# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి 11 ] మార్చి—ఏప్రిల్ 1967 [ సంచిక 5, 6
ఫాల్గుణము-చైత్రము 1889 శాక

ప్రధాన సంపాదకులు
బి. ఆర్ కె శాస్త్రి,
ఎం ఏ, ఐ ఏ ఎస్

సంపాదకులు
చదువుల రంగనాథం

## ఈ సంచికలో



ముఖ చిత్రం 'ఉగాది శుభాకాంక్షలు'
ఫోటో టి రామచంద్రరావు

రెండవ చిత్రం ఉపరాష్ట్రపతితో ముఖ్యమంత్రి

మూడవ చిత్రం ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌తో ముఖ్యమంత్రి

నాలుగవ చిత్రం తుంగభద్ర ఎగువ కాలువ
ఫోటోలు 'సీతు'

* ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు





మరొకసారి భారత రక్ష సారథ్యం వహించిన

శ్రీమతి ఇందిరా గాంధి

"స్వదేశంలో ప్రజాస్వామిక సోషలిజం విధానాన్ని, అంతర్జాతీయ విషయాలలో అలీన విధానాన్ని ప్రభుత్వం అనుసరిస్తుంది."

# భవిష్యత్తులో గురుతర బాధ్యత



భారతదేశంలో నాలుగవ సార్వత్రిక ఎన్నికలు ముగిసి కొత్త ప్రభుత్వాలు తమ తమ బాధ్యతలను నిర్వర్తించడానికి పూనుకుంటున్నాయి. ప్రజాస్వామిక వ్యవస్థలలో ఎన్నికలు ప్రముఖ స్థానం వహిస్తాయి. ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థ రూపొందడానికీ, పనిచేయడానికీ ఎన్నికలు అత్యంత ప్రధానమైనవి. అసెంబ్లీలకు, పార్లమెంటుకు తమ ప్రతినిధులను ఎన్నుకోవడంలో తమ బాధ్యతలను, విధులను క్రమశిక్షణాయుతంగా నెరవేర్చినందుకు భారత ప్రజలను—ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలను—అభినందిస్తున్నాను.

నేనూ, నా మంత్రిమండలి సభ్యులూ మార్చి 6 వ తేదీన ప్రమాణ స్వీకారం జరపడం మీకందరకూ తెలుసు. మరొకసారి ఈ రాష్ట్రానికి సేవచేసే భాగ్యం నాకు కలగడం—అది నా అదృష్టం. ఈ మహద్భాగ్యాన్ని నాకు ప్రసాదించిన ప్రజలకు, ప్రజాప్రతినిధులకు యింకొకసారి నా వినయపూర్వక కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

ఈ ఆనందావసరాన భవిష్యత్తులో మన బాధ్యతలను విస్మరించ తగదు. ఆంధ్రప్రదేశ్ అనాదిగా దక్షిణాది ధాన్యాగారంగా ప్రసిద్ధికెక్కింది. ఇరుగు పొరుగు తరుగు రాష్ట్రాల ఆహార కొరతను తీర్చడానికై ఆంధ్రప్రదేశ్ యితోధికాహారోత్పత్తికి అనవరతమూ శ్రమించడమే కాకుండా పారిశ్రామికంగాకూడా ప్రగతిని సాధించడానికై తీవ్రంగా శ్రమిస్తున్నది. వ్యవసాయోత్పత్తిని అధికం చేయడం వల్ల జాతీయాదాయం పెరగడమే కాక తద్వారా జీవన ప్రమాణాన్ని

మెరుగు పరిటః విద్య, ఆరోగ్య సౌకర్యాలు వంటి సాంఘిక సంక్షేమ కార్య కలాపాలను విస్తృతీకరించడానికికూడా అవకాశం వుంటుంది. పైపెచ్చు యిది పారిశ్రామికీకరణకు ప్రాతిపదిక కూడా. అందుచేత అధికవ్యవసాయోత్పత్తిని సాధించడం అనేది అవశ్యక ర్తవ్యం. నిజానికి వ్యవసాయోత్పత్తినితగినంతగా ఎక్కువ చేయకపోతే ద్రవ్యోల్బణనుండి తప్పించుకోలేము. ముఖ్యంగా పెద్దమొత్తాలలో ప్రణాళికా కేటాయింపులు అవసరమైనచోట ఈ ప్రమాదం ఎప్పుడూ పొంచివుండే వుంటుంది.

ఎన్నికల సమయంలో రాష్ట్ర మంతటా మారుమూలల్లోకి సైతం వెళ్ళాను. ఈ సందర్భంలో ఒక విషయం మీకు తెలియ జేద్దామను కుంటున్నాను. మనం చేపట్టిన ప్రతి పనీ-అది వ్యవసాయానికి సంబధించిందే కావచ్చు, నీటి పారుదలకు సంబంధించినది కావచ్చు, విద్యుచ్ఛక్తికి సంబంధించినదైనా కావచ్చు, లేదా అభివృద్ధి కార్యకలాపాలలో ప్రజలు పాల్గొనే విషయమైనా కావచ్చు, సాంఘిక సేవా సంస్థల కృషి అయినా కావచ్చు-ఏవిష యాన్ని చూసినా అటు ఆంధ్ర ప్రాంతంలోను, యిటు తెలంగాణా ప్రాంతంలోనూ అంతటా యిటీవలి కాలంలో మెలమెల్లగా అభివృద్ధీ, ప్రగతీ స్పష్టంగా కనిపిస్తోంది. అయితే మనం యిప్పుడిప్పుడే యీ ప్రగతి పథం వైపు పురోగమిస్తున్నాం. అందుచేత యీ ప్రగతి యాత్ర-అభివృద్ధి వైపు, సుఖజీవితంవైపు, ఐశ్వర్యంవైపు మనం చేసే యీ ప్రయాణం-సుదీర్ఘమైనది కావచ్చు. క్లిష్టమైనది, సంకీర్ణమైనదీ కావచ్చు. అందుచేత ఈ మార్గంలో మనం స్థిరచిత్తంతో, అచంచల విశ్వాసంతో, ఉత్సాహంతో, శక్తితో అడుగులు సరిగా వేసి నడవాలి.

బాగా అభివృద్ధి చెందాలనీ, జీవన ప్రమాణాన్ని మెరుగు పరచుకోవాలనీ యీనాడు గ్రామీణ ప్రాంతాలలో సైతం సర్వులు గుర్తిస్తున్నారు. దీనివెనక కృషికూడా వుండాలన్న విషయాన్ని కూడా అంతా గుర్తించారు. బడుగుదేశం అభివృద్ధి చెందాలంటే తేలికేమీకాదు. నిజానికి కష్టపడందే సుఖం పొందలేము. మరో విధంగా చెప్పాలంటే శ్రమించనిదే ప్రగతిని సాధించలేము. క్రమశిక్షణతో, ఉత్సాహంతో సమిష్టికృషితో, మన కృషి కొనసాగవలసివుంది. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి పురుషుడూ, ప్రతి స్త్రీ తమ భుజస్కంధాలమీద వున్న తమ బాధ్యతలను, విధులను సక్రమంగా నిర్వర్తిస్తారని నేను విశ్వశిస్తున్నాను. ఈ గుణగణాలే వ్యక్తుల్నీ, దేశాల్నీ రూపొందించేవి.

ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ సాధనాకృషిలో మన కృషిని కేంద్రీకరించడంతో పాటు భారతదేశ సమైక్యతను పరిపోషించుకోవడానికి అనువైన ప్రతిచర్యనూ మనం తీసుకోవాలి. ఈ సందర్భంలో ఏవిధమైన సంకుచితత్వానికీ, స్వార్థబుద్ధికీ, అసూయకూ తావుండరాదు. పొరుగు రాష్ట్రాలవారితో సత్సంబంధాలను నిరంతరంగా పరిపోషించుకొంటూ రావాలి. నిజానికి మన రాష్ట్రంలోనివారు భారతదేశంలోని అన్ని ప్రాంతాలవారితోనూ ఆ విధంగానే మెలగుతూ వస్తున్నారు.

పొదుపరిగుణాన్ని అందరిలోనూ కలిగించాలి. మొత్తం రాష్ట్రంయావత్తు పొదుపుగుణాన్ని అలవరచుకొని, తద్వారా సర్వతోముఖ వికాసానికి తోడ్పడాలి. ప్రతి ఒక్కరూ తమ కాలీ సమయాన్ని యిందు విషయమై వినియోగించాలి. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతివ్యక్తీ నెలకు ఆరు పైసలు పొదుపు చేశాడనుకుంటే ఏడాదికి రాష్ట్రంలో రెండున్నర కోట్ల రూపాయలకు పైగా కూడబెట్టవచ్చు. ప్రతిఒక్కరూ పొదుపు ఉద్యమంలో పాల్గోవడం చాలాఅవసరం. మన దేశానికి కావలసిన వనరులను సమీకరించుకోవడానికే గాక ప్రణాళికల సందేశాలను ప్రతి గృహానికీ మోసుకుపోవడానికి కూడ యీ పొదుపు ఒక చక్కటి శక్తివంతమైన సాధనంగా ఉపయోగపడుతుంది.

ముందు ముందు మరీ క్లిష్టమైన, మరీ ఎక్కువైన శ్రమ వుంటుంది. ప్రజాస్వామిక వ్యవస్థ బాల్యదశలో వున్నాము మనం. పందొమ్మిదేళ్ళక్రితమే మనం స్వరాజ్యాన్ని సంపాదించుకున్నాం. అయితే ఆధ్యాత్మిక, నైతిక విలువలతో కూడిన పురాతన నాగరికతా స్రవంతులతో, సుసంపన్నమైన సాంస్కృతిక సాంప్రదాయ భూములతో విలసిల్లిన దేశం మనది. మన దేశంలో జీవనస్థాయి చాలా తక్కువ. అందుచేత ఆర్థిక ప్రగతి, అభివృద్ధి మన దేశానికి చాలా అవసరం. ఈ ప్రగతికై జరిపే మన యీ ప్రయత్నంలో మనం ఎప్పుడూ నైతిక, ఆధ్యాత్మిక విలువలను మనసులో వుంచుకోవాలి.

మీ అందరకూ ఉగాది శుభాభినందనలను తెలియజేస్తున్నాను.

ముఖ్యమంత్రి

# 'అప్సరస'లో ఒక్కరోజు

## హైదరాబాదు యాత్రికునికి 'అప్సరస' లో
## ఒకరోజు మరపురాని అనుభూతి

అది అతనిని

గోల్కొండ కోట

చార్‌మినార్

పబ్లిక్ గార్డెన్స్

ఉస్మాన్‌సాగర్

సాలార్జంగ్ మ్యూజియం

ఉస్మానియా విశ్వవిద్యాలయం



మొదలయిన స్థలాలకు తీసుకొని వెళ్తుంది

శుక్రవారం మినహా ప్రతిరోజూ పర్యటించవచ్చు

## సాలార్జంగ్ మ్యూజియం

ప్రవేశరుసుముతో సహా

**రూ. 8-00 మాత్రమే**

రిజర్వేషన్లు చేయించుకోవలసిన స్థలము-అప్సరస బయలుదేరు స్థలము

**రాష్ట్ర సమాచార కేంద్రం, సమాచార పౌర సంబంధాల శాఖ**

*గాంధీభవనం ఎదుట, హైదరాబాదు.*

ఫోన్ నం. 43281 మరియు 43282

# కొత్త మంత్రివర్గం



గవర్నరుతో కొత్తమంత్రులు, (కూర్చున్నవారు, ఎడమనుండి) శ్రీ టి. వి. రాఘవులు, శ్రీ తోట రామస్వామి, శ్రీ పి. తిమ్మారెడ్డి, శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, గవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్ళై, డా॥ ఎం. చెన్నారెడ్డి, శ్రీ వి. బి. రాజు, శ్రీ జె. వి. నర్సింగరావు, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ.

స్టేట్ మంత్రులు (నిల్చున్నవారు, ఎడమనుండి)

శ్రీ ఎస్. సిద్దారెడ్డి, శ్రీ ఆర్. రామలింగరాజు, శ్రీ బి. వి. గురుమూర్తి, శ్రీ కె. విజయభాస్కరరెడ్డి, శ్రీ ఎన్. చెంచురామానాయుడు శ్రీ పి. వి. నరసింహారావు.

---

## శాఖల కేటాయింపు

### కేబినెట్ మంత్రులు

శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి, ముఖ్యమంత్రి—సాధారణ పరిపాలన, సర్వీసులు, ఎన్నికలు, ప్రణాళిక, భారీ పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, (చిన్నతరహా నీటివసరులు మినహా), ఆరోగ్య వైద్యశాఖలు, హోం, పోలీసు, ఆయుధాలచట్టం, సినిమాటోగ్రఫీ, ప్యాసుపోర్టులు, వక్ఫ్స్, వక్ఫ్స్‌బోర్డు, సాలార్ జంగ్ ఎస్టేట్, రవాణాశాఖలు.

డా. ఎం. చెన్నారెడ్డి—ఆర్థిక, వాణిజ్య పన్నులు, సహకార చక్కెర ఫ్యాక్టరీలు, వాణిజ్యం, ఎగుమతుల పెంపుదల, చిన్నమొత్తాల పొదుపు విద్య, సాంస్కృతిక వ్యవహారాలు, పురావస్తు, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, సాహిత్య, శాస్త్రవిజ్ఞాన సంఘాలు (అకాడమీలు, రవీంద్రభారతితో సహా), మ్యూజియంలు, సంగీతకళాశాలలు, పాఠశాలలు, పురాతన వ్రాతప్రతుల సంరక్షణ అనువాదం,— పండితులకు ఆర్థిక సహాయం, ఆధునిక భారతీయ భాషల అభివృద్ధి, స్టేట్ఆర్కైవ్స్, ప్రాంతీయ చారిత్రక పరిశోధన, రికార్డు కమిటీలు, లలితకళలు, వాస్తుశాస్త్రకళాశాల, స్పోర్ట్స్ గేమ్స్ కౌన్సిల్, రాష్ట్రాన్ని దర్శించే సాంస్కృతిక ప్రతినిధి వర్గాలు, స్టేడియం, ఫిజికల్ విద్య (డా॥ ఎం చెన్నారెడ్డి కేంద్ర మంత్రివర్గంలో ఉక్కు, గనులు, లోహాల మంత్రిగా ఆ తరువాత నియుక్తులైనారు)

శ్రీ పి. తిమ్మారెడ్డి,—వ్యవసాయం, ఆహారోత్పత్తి, మార్కెటింగ్, గ్రామీణ ఋణాలు, ఋణవిముక్తి సహాయం. ఋణాలు, ఋణదాతలు, పశుపోషణ, సమీకృత పాలప్రాజెక్టు, పాడిపరిశ్రమాభివృద్ధి, రాష్ట్ర గిడ్డంగుల కార్పొరేషన్.

శ్రీ వి. బి. రాజు,—భూమిశిస్తు, భూసంస్కరణలు, రిజిస్ట్రేషన్, స్టాంపులు, కాందిశీకుల ఆస్తులు, అతియాత్ జాగీర్ వ్యవహారాలు, ఋణపరిష్కారాలబోర్డు, పౌర సరఫరాలు రేషనింగ్.

శ్రీ తోటరామస్వామి,—పంచాయతీ రాజ్యం, పంచాయతీలు, ఎకనామిక్స్‌బ్యూరో, మత్స్య పరిశ్రమ.

శ్రీ జె. వి. నర్సింగరావు:—భవనాలు, రహదార్లు, రోడ్లు, రేవులు, ఉద్యానవనాలు, నగరనీటిసరఫరా, పబ్లిక్‌వర్క్స్, వర్క్‌షాపులు, రైల్వేలు, టెలిగ్రాఫ్‌కు సంబంధించిన విషయాలు.

శ్రీ టి. వి. రాఘవులు,—ఎక్సైజ్, మద్యనిషేధం

శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ,—సమాచార, పౌరసంబంధ, యాత్రిక, కార్మికశాఖలు.

### స్టేట్ మంత్రులు

శ్రీ పి. వి. నరసింహారావు,—న్యాయశాఖ, న్యాయస్థానాలు, న్యాయాధికార్లు, జైళ్లు, శాసననిర్మాణం, దేవాదాయ ధర్మాదాయ శాఖలు.

శ్రీ బి. వి. గురుమూర్తి,—పరిశ్రమలు (భారీ పరిశ్రమలు మినహా), పారిశ్రామిక సహకారసంఘాలు, స్టేషనరీ, ప్రింటింగ్, లఘు పరిశ్రమలకార్పొరేషన్, గనులు, గనులకార్పొరేషన్, కంట్రోలువస్తువులు.

శ్రీ ఎన్. చెంచురామానాయుడు,—మునిసిపల్ పరిపాలన, టౌన్‌ప్రణాళిక, గృహనిర్మాణం, గృహవసతి, అడవులు.

శ్రీ కె. విజయభాస్కరరెడ్డి,—సహకారం.

శ్రీ ఆర్. రామలింగరాజు,—సాంఘిక సంక్షేమం, (గిరిజన స్త్రీ సంక్షేమంతోసహా) పునరావాస సౌకర్యాలశాఖలు.

శ్రీ ఎస్. సిద్దారెడ్డి,—మధ్యరకం, చిన్నతరహా నీటి పారుదల శాఖ.

సంక్షిప్త జీవిత చిత్రణలు:

# ప్రభుత్వంలోని ప్రజా ప్రతినిధులు



## శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గుంటూరుజిల్లా చిరుమామిళ్ల గ్రామంలో 1909 జూలై 28 న జన్మించారు. గుంటూరులో ఉన్నత పాఠశాలవిద్య పూర్తిచేసిన తర్వాత మద్రాసులోని పచ్చయప్ప కళాశాలనుండి పట్టభద్రులైనారు. ఆతర్వాత మద్రాసు విశ్వవిద్యాలయంనుండి న్యాయశాస్త్రంలోపట్టా పొందారు. జాతీయ భావాలుగల విరు స్వాతంత్రోద్యమంముమ్మరంగా ఉన్న 1941_42 సంవత్సరం ఉద్యమంలో పాల్గొని అరెస్టుఅయినారు. 1945 వరకు రాజమండ్రి, వెల్లూరు, తంజావూరు జైళ్లలో నిర్బంధంలో ఉన్నారు.

1916 లో వీరు మద్రాసుశాసనసభకు ప్రప్రథమంగా ఎన్నికైనారు. అప్పటినుండి, 1952_55 మధ్యకాలంమినహా శ్రీ బ్రహ్మానందరెడ్డి శాసన సభ్యులుగానే ఉంటున్నారు రెడ్డిగారు అఖిలభారత కాంగ్రెసు సంఘంలోను, ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేటులోను సభ్యులు. వీరు తమ 27వ ఏట 1936లో గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షులుగాఉన్నారు. 1955_56వ సంవత్సరంలో విస్తృత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నిర్దిష్టరూపందాల్చి అవతరించిన సమయంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రకాంగ్రెసు కమిటీప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత శ్రీ ఎన్. సంజీవరెడ్డి ఏర్పాటుచేసిన ప్రథమ మంత్రివర్గంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి, స్థానిక స్వపరిపాలన, నీటి సరఫరా, డ్రైనేజి, పట్టణప్రణాళిక శాఖల మంత్రిగా చేరారు.

1958లో శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆర్థికమంత్రి పదవి స్వీకరించారు. ఆరు సంవత్సరాలు ఆపదవిని నిర్వహించారు. వేతనాల సంఘం, రిట్రెంచ్మెంటు సంఘం అధ్యక్షులుగా శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆచరణాత్మకమైన సూచనలుచేశారు. 1959లో అప్పటిరెవిన్యూ మంత్రి శ్రీ కళావెంకటరావు మరణించిన ఫలితంగా ఏర్పడిన పోర్టుపోలియోల మార్పులలో శ్రీ బ్రహ్మానందరెడ్డికి ప్రణాళికాశాఖ లభించింది.

1960 జనవరిలో శ్రీ సంజీవయ్య మంత్రి వర్గం ఏర్పడినప్పుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆర్థికమంత్రిత్వంతో పాటు న్యాయ శాఖకూడ నిర్వహించారు. 1962లో జరిగిన సాధారణ ఎన్నికలకు ముందు కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికల ఉపసంఘం సభ్యుడుగా కీలకమైన పాత్ర వహించారు. ఆఎన్నికలలో గుంటూరుజిల్లా ఫిరంగిపురం నియోజకవర్గంనుండి శాసనసభకు ఎన్నికఅయినారు. 1962లో మూడవ సాధారణ ఎన్నికల తర్వాత శ్రీ సంజీవరెడ్డి రాష్ట్ర రాజాకీయాలలో ప్రవేశించి ఏర్పాటు చేసిన రాష్ట్ర మంత్రివర్గంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆర్థిక, సహకారశాఖల మంత్రిగా ఉన్నారు. ఆతర్వాత జరిగిన పోర్టుపోలియోల మార్పులలో శ్రీ బ్రహ్మానందరెడ్డి సమాచార, ఎన్నికలు, శాసనసభ శాఖలుకూడ నిర్వహించారు.

1964 ఫిబ్రవరిలో శ్రీ సంజీవ రెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇవ్వగా ఆయన సలహాపై శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశారు. 1964 ఫిబ్రవరి 29వ తేదీన శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా పదవీప్రమాణ స్వీకారం చేశారు. అంతకు ముందు ఉన్న 7 గురు క్యాబినెట్ మంత్రులు, ఆరుగురు స్టేట్‌మంత్రులు మొత్తం 13 మంది సభ్యులతో మంత్రివర్గం ఏర్పాటుచేశారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రజాసేవ స్వచ్ఛమైనదీ, సంపూర్ణమైనది. 1964 మే 14వ తేదీన ప్రజలకు ఉగాదిసందేశమిస్తూ రేడియోలో యీవిధంగా అన్నారు :

"నేను రెండువారాలక్రితమే ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారంచేశాను. దాదాపు 28 సంవత్సరాల క్రితంరాజకీయరంగంలో ప్రవేశించిన కొద్దిసంవత్సరాల తర్వాత శ్రీ ప్రకాశంపంతులుగారి ఆశీస్సులతో గుంటూరు జిల్లాలో బాధ్యతాయుతమైన పదవిని స్వీకరించాను. అప్పటినుండి ప్రజాసేవలో ఏదో ఒక బాధ్యతాయుత పదవిని నిర్వహిస్తూనే ఉన్నాను. ప్రజాసంక్షేమమే లక్ష్యంగా నా శక్తికొలది కృషిచేస్తున్నాననే నేను భావిస్తున్నాను. ముఖ్యమంత్రిపదవి స్వీకరించడంతో నేను మీకు ప్రథమ సేవకుణ్ణి అయ్యాను. మీ సంపూర్ణ సహకారం లభిస్తుందనే విశ్వాసంతోనే నేను యీ బాధ్యతను స్వీకరించాను......"

1966 నవంబరుతో శ్రీ బ్రహ్మానందరెడ్డి పదేళ్ళు మంత్రి పదవులు నిర్వహించారు. ఆరు సంవత్సరాలకుపైగా ఆర్థిక మంత్రిగా ఉన్నారు. ఆకాలంలో రాష్ట్ర ఆదాయం రూ 68 కోట్లనుండి రూ. 143 కోట్లకు పెరిగింది. ఆర్థిక మంత్రిగా వీరు అన్నీ మిగులు బడ్జెట్లు ఇచ్చారు. వీరు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో రాష్ట్రం అన్నిరంగాలలో గణనీయమైన అభివృద్ధి సాధించడం జరిగింది. ఆంధ్రలో కేంద్రరంగంలో అనేక భారీ పరిశ్రమలు నెలకొల్పబడడం అందరికీ తెలిసిందే. రాజమండ్రి వద్ద గోదావరిపై రైలు-రోడ్డువంతెన నిర్మాణం మంజూరుకావడం సికింద్రాబాదు హెడ్‌క్వార్టర్సుగా దక్షిణ మధ్యరైల్వే మండలం ఏర్పాటు, ఉర్దూకు ఉచితస్థానం కల్పిస్తూనే తెలుగును అధికార భాషగా నిర్ణయించడం, నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువ కాలువ పథకాలకు ఎక్కువనిధులు సమకూర్చడం, ఇవి వీరి పరిపాలనకు మైలురాళ్లుగా నిలుస్తాయి.

## డాక్టర్ ఎం. చెన్నారెడ్డి

డాక్టర్ ఎం. చెన్నారెడ్డి 1919 జనవరిలో హైదరాబాదు జిల్లా ధరూర్, సిరిపురంగ్రామంలో జన్మించారు. విద్యార్థిగా అనేక బహుమతులు, స్కాలర్ షిప్పులు సంపాదించి విద్యార్థి దశలో పేరుగడించారు. 1941లో ఎం. బి. బి. ఎస్. డిగ్రీ పొందారు. 1940లో ఆంధ్ర యువజనసమితి, ఆంధ్రవిద్యార్థి మహాసభ స్థాపకులలో వీరు ఒకరు. ఉస్మానియా ఆసుపత్రిలో ఒక సంవత్సరంపాటు పనిచేసి ఆతర్వాత ప్రైవేటు ప్రాక్టీస్ ప్రారంభించడానికి ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. అప్పటి హైదరాబాదు రాష్ట్రరాజకీయ ఉద్యమంలో పాల్గొన్నారు. 1946లో హైదరాబాదు నగరసంఘం కార్యదర్శిగాను, రాష్ట్ర కాంగ్రెసు సంఘంస్థాయీసంఘం సభ్యులుగాను ఉన్నారు. రాష్ట్రకాంగ్రెసు కార్యదర్శిగాకూడ వ్యవహరించారు. ఆతర్వాత కాంగ్రెసులో కె.ఎం.పి. వర్గానికికార్యదర్శి, నిర్మాతలలో ఒకరు అయ్యారు. రాష్ట్ర విముక్తి పోరాటసమయంలో 1947 సెప్టెంబరు నవంబరు మధ్య కాలంలో జైలుశిక్ష అనుభవించారు. రాష్ట్ర ప్రజల కోర్కెలను ప్రచారం చేసే ఉద్దేశంతో 1948 ఏప్రిల్‌లో హైదరాబాదునుండి తెలుగు వార పత్రికను ప్రారంభించారు. జాతీయసంస్థ అధికారంలోకి రాగానే శ్రీ జనార్ధన్‌రావు దేశాయ్, బి. రామకృష్ణారావు ఆధ్వర్యంలోని కాంగ్రెసు సంస్థకు వీరు సంయుక్తకార్యదర్శిగా వ్యవహరించారు. సంవత్సరం తర్వాత వీరు ఆంధ్ర ప్రాంతీయ కాంగ్రెసుసంఘం సంయుక్తకార్యదర్శి అయినారు. 1950లో వీరు రాజ్యాంగ శాసనసభకు నామినేటు అయినారు. కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ విప్‌గా తన ప్రతిభ చూపారు. 1952నుండి 1956 వరకు రామకృష్ణారావు మంత్రివర్గంలో వీరు వ్యవసాయ శాఖ మంత్రిగా వ్యవహరించారు.



1962 ఎన్నికలలో కాంగ్రెసు టిక్కెట్టుపై హైదరాబాదు జిల్లా తాండూరు నియోజక వర్గంనుండి శాసన సభకు ఎన్నిక అయినారు. వీరు ప్రణాళికాశాఖ మంత్రిగా నియమింపబడ్డారు.

రాష్ట్రంలో మూడవ పంచవర్ష ప్రణాళికా పథకాలను రూపొందించడంలోను, విజయవంతంగా అమలు పరచడంలోను డాక్టర్ చెన్నారెడ్డి ఉత్సాహం, ప్రతిభ చూపారు. 1964 ఫిబ్రవరిలో ఏర్పడిన బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో కూడా అదే పదవిని వీరు నిర్వహించారు. అయితే మే నెలలో శాఖల పునర్విభజన జరిగిన ఫలితంగా వీరు ఆర్థిక, లఘుపరిశ్రమల శాఖ చేపట్టారు.

ఆర్థిక మంత్రిగా డాక్టర్ చెన్నారెడ్డి రాష్ట్ర ఆర్థిక వ్యవహారాలను ఎంతగానో చక్కదిద్దారు. లఘుపరిశ్రమల రంగంలో వీరు అధ్వర్యాన గణనీయమైన అభివృద్ధి సాధించడం జరిగింది. ఇటీవల జరిగిన సార్వత్రిక ఎన్నికలలో తాండూరు నియోజక వర్గం నుండి చెప్పుకోదగిన మెజారిటీతో శాసన సభకు వీరు ఎన్నిక అయ్యారు. (ప్రస్తుతం వీరు కేంద్ర మంత్రి వర్గంలో ఉక్కు, గనులు, లోహాలమంత్రిగా నియుక్తులైనారు.)



1952 సాధారణ ఎన్నికలలో శ్రీ తిమ్మారెడ్డి కృషికర్ లోకపార్టీ టికెటుపై మద్రాసు శాసనసభకు అత్యధిక మెజారిటీతో ఎన్నికైనారు. 1953 లో ఏర్పడిన అప్పటి ఆంధ్రరాష్ట్రంలో ప్రకాశం మంత్రివర్గంలో ఆయన స్థానిక స్వపరిపాలన శాఖ మంత్రిగా చేరారు. 1955లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో కూడ వీరు శాసన సభకు తిరిగి ఎన్నికైనారు.

1956 లో శ్రీ తిమ్మారెడ్డి వ్యవసాయం, ఆహారశాఖల మంత్రిగా వ్యవహరించారు. వ్యవసాయిక విషయాలలో పరిజ్ఞానం కలవారు కావడం మూలంగా ఆరంగంలో వీరు ఉపయోగకరమైన అనేక చర్యలు తీసుకున్నారు. 1961 లో వ్యవసాయ నిపుణుడుగా వీరు నఫీల్డు ఫౌండేషన్ ఆహ్వానంపై బ్రిటన్‌లో పర్యటించారు.

1962 జూన్ నుండి 1964 జనవరి వరకు ఖాదీ బోర్డు అధ్యక్షులుగా వ్యవహరించారు. అదే సంవత్సరంలో అదే నియోజకవర్గంలో జరిగిన ఉప ఎన్నికలలో శాసన సభకు ఎన్నికైనారు.

అనుభవజ్ఞుడు, సమర్థుడు అయిన శ్రీ తిమ్మారెడ్డి, 1964 ఆగస్టులో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులైనారు. ఇటీవల జరిగిన సాధారణ ఎన్నికలలో చిత్తూరుజిల్లా వాయిల్పాడు నియోజక వర్గం నుండి శాసన సభకు ఎన్నికైనారు.

## శ్రీ పి. తిమ్మారెడ్డి

శ్రీ పి. తిమ్మారెడ్డి, 1914 నవంబరు 24వ తేదీన చిత్తూరు జిల్లా వాయిల్పాడు తాలుకా చేనేపల్లి గ్రామంలో జన్మించారు. మదనపల్లిలో విద్యాభ్యాసంచేశారు. విద్యార్థిదశలోనే రాజకీయాలలో ఆసక్తితో పాల్గొనేవారు. పట్టభద్రులు కాకముందే ఆచార్య రంగా నిడుబ్రోలులో ఏర్పాటు చేసిన వేసవి రాజకీయ ఆర్థిక పాఠశాలలో చేరారు. అదే వీరి రాజకీయ చైతన్య జీవితానికి తొలిమెట్టు.

అనతి కాలంలోనే వీరు రైతుల సమస్యలను ఆకళింపు చేసుకుని 1936–37 లో రాయలసీమ విద్యార్థుల ఫెడరేషన్ అధ్యక్ష పదవికి ఎన్నిక అయినారు. ఆ తర్వాతి సంవత్సరంలో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం ఉపాధ్యక్షులైనారు. 1940–41లో ఆ సంఘం అధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు. అప్పటికే చిత్తూరు జిల్లాలో ఆయన జాతీయ వాదిగా ప్రఖ్యాతిగాంచారు. వీరు నిర్వహించిన రాజకీయ పాఠశాలలు యువకులను బాగా ఆకర్షించాయి. రాయలసీమ ప్రాంతంలో వాటికి విశిష్టత ఏర్పడింది.

1946 లో ఆచార్యరంగా ఆంధ్ర ప్రాంతం కాంగ్రెసు కమిటీ అధ్యక్షులైనప్పుడు శ్రీ తిమ్మారెడ్డి ఉపాధ్యక్షులైనారు. రెండుసార్లు ఆయన ఆ పదవిని నిర్వహించారు. వీరి హయాంలో అనేకమంది ఉత్సాహవంతులైన యువకులు కాంగ్రెసులో చేరారు. 1942 లో మద్రాసు విశ్వ విద్యాలయం పట్టభద్రుడు కావడానికి



ద్వారా సమాజంలోని బడుగువర్గాల సంక్షేమానికి అనేకచర్యలు తీసుకున్నారు.

మత్స్యపారిశ్రామికులను, రిక్షాడ్రైవర్లను, రజకులను, టాక్సీడ్రైవర్లను సహకార రంగంక్రిందికి తేవడం జరిగింది. రుణాలు, సబ్సిడీలు, వాటాధనం మొదలైన రూపాలలో వారికి ఆర్థికసహాయం అందజేశారు. శ్రీ తోటరామస్వామి నిర్విరామ కృషి, సహకారఫలితంగా 1966లో 'సూపర్ బజారు'(కల్పలత) ఏర్పడింది. ఆయన యీకృషిని రాష్ట్రరాజధాని ప్రజలు కృతజ్ఞతతో గుర్తుంచుకుంటారు.



## శ్రీ జె. వి. నర్సింగరావు

శ్రీ జె. వి. నర్సింగరావు 1914 అక్టోబరు 14న ఆదిలాబాదుజిల్లా లక్సెట్టిపేట తాలుకాకు చెందిన రైతు కుటుంబంలో జన్మించారు. అలీఘర్ ముస్లిమ్ విశ్వ విద్యాలయంనుండి రాజకీయ శాస్త్రంలో ఎం. ఎ. డిగ్రీ పొందారు. బనారస్ హిందూ విశ్వ విద్యాలయంనుండి న్యాయ శాస్త్రంలో పట్టా పొందారు. విద్యార్థి దశనుండి వీరు విద్యార్థి కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనే వారు. బనారస్ హిందూ విశ్వవిద్యాలయం విద్యార్థుల సంఘానికి అధ్యక్షులుగా వ్యవహరించారు.

శ్రీ నర్సింగరావు చాలాకాలంనుండి ప్రజాసేవలో గణుతికెక్కారు. న్యాయవాదుల సంఘం బార్ కౌన్సిల్ లలో అనేక పదవులు నిర్వహించడమేగాక న్యాయవాదిగా ఖ్యాతి నార్జించారు. నగరంలోని పెక్కు విద్యాసంస్థలు, సాంఘిక సంస్థలలో ప్రముఖంగా పాల్గొన్నారు. 25 సంవత్సరాలకు పైగా నగరంలో రెండు ఉన్నతపాఠశాలల మేనేజింగ్ కమిటీలకు కార్యదర్శిగా వ్యవహరించారు. 6 సంవత్సరాలకుపైగా ఉస్మానియావిశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులుగా ఉన్నారు.

శ్రీ నర్సింగరావు తీవ్ర జాతీయవాది, ఆంధ్రమహాసభ, హైదరాబాదు రాష్ట్రకాంగ్రెసు కార్య వర్గంలో సభ్యులుగా పని చేశారు.

సహాయ నిరాకరణోద్యమం సమయంలో న్యాయవాదుల సంఘాల నేర్పరచి తెలంగాణా జిల్లాలలోను, నగరంలోను వందలమంది న్యాయవాదులు కోర్టులను బహిష్కరించడంలో వీరు ప్రముఖమైన పాత్ర వహించారు.

కాంగ్రెసుసంస్థను పటిష్ఠంచేసే ఉద్దేశంతోను పూర్తికాలం పనిచేయటానికి వీరుగా న్యాయవాదవృత్తిని విడనాడారు. అఖిల భారత స్థాయిలో రాష్ట్రప్రయోజనాలను కాపాడుతూ అనేక సంవత్సరాలపాటు ఎ.ఐ.సి.సి. సభ్యులుగా వీరు వ్యవహరించారు. 1954లో రాష్ట్రాల పునర్విభజనకు ముందువీరు హైదరాబాదు కాంగ్రెసుసంఘం అధ్యక్షులుగా ఉన్నారు.

1956లో తెలంగాణ, ఆంధ్రప్రాంతాల విలీనీకరణ సమయంలో హైదరాబాదు రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా కీలకమైన పాత్ర వహించారు. తెలంగాణా ప్రాంతం ప్రజలలో ఉన్న భయ సందేహాలను నివృత్తి చేయటానికి వీలుగా ప్రాంతీయ సంఘాన్ని ఏర్పాటు చేయాలనే సూచనను ప్రప్రథమంగా వీరే ప్రతిపాదించిన విషయం అందరకు తెలిసిందే.

1956లో వీరు నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రిగా వ్యవహరించారు. వారి శ్రద్ధాసక్తులు, కృషిఫలితంగానే ప్రణాళికా పథకాల క్రింద నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు ఎంతో ప్రాధాన్యం వహించాయి.

1963 ఏప్రిల్ లో వీరు విద్యుచ్ఛక్తి బోర్డు అధ్యక్షులైనారు 1966 డిసెంబరు వరకు ఆ పదవిలో ఉన్నారు. వీరిహయాంలో విద్యుచ్ఛక్తిబోర్డు ఎంతో అభివృద్ధిని సాధించింది. విద్యుచ్ఛక్తి బోర్డు ఆదాయం రూ. 8.52 కోట్లనుండి రూ. 15.00 కోట్లకు పెరిగింది. దక్షిణ ప్రాంత విద్యుచ్ఛక్తిబోర్డుకు వీరు ప్రథమ అధ్యక్షులు.

ఇటీవలి ఎన్నికలలో నర్సింగరావు లక్సెట్టిపేట నియోజక వర్గంనుండి శాసనసభకు ఎన్నిక అయ్యారు.

## శ్రీ తానేటి వీర రాఘవులు

శ్రీ తానేటి వీర రాఘవులు 1917 జూలై 6వ తేదీన జన్మించారు. మచిలీపట్నం హిందూ కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. ఆనాటి విఖ్యాత సంఘ సంస్కర్త శ్రీ వేమూరి రాంజీ పంతులు, శ్రీ రాఘవులును ఉన్నత విద్యకు ప్రోత్సాహించి తగు విధంగా సహాయం చేశారు. పట్టభద్రులైన పిమ్మట శ్రీరాఘవులు మద్రాసు న్యాయకళాశాలలో ప్రవేశించి ఉన్నతశ్రేణిలో బి. ఎల్ డిగ్రీ పొందారు.

నివేశాలను ప్రదర్శించడానికి, మంచి అవకాశం కలిగించింది. శ్రీ లక్ష్మణ్ ఈ అవకాశాన్ని వినియోగించు కోవడంలో ఎవ్వరికీ తీసిపోలేదు. బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని స్థాపించే నిమిత్తం కాంగ్రెసు నడిపిన ఉద్యమంలోనూ, వందేమాతరం ఉద్యమంలోనూ శ్రీ లక్ష్మణ్ అగ్రగామిగా వున్నారు.

శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ వివిధ సందర్భాలలో అనేక ఉన్నత పదవులను సమర్థవంతంగా నిర్వహించారు. ఆంధ్ర ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ కార్యదర్శిత్వం; హైద్రాబాదు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యత్వం; స్టేట్ కాంగ్రెసు స్థాయీ సంఘం సభ్యత్వం; రాష్ట్ర చేనేత కాంగ్రెసు అధ్యక్షత; హైద్రాబాదు కేంద్ర చేనేత సహకార సంఘం అధ్యక్షత; పారిశ్రామిక సహకార సంఘాల సమాఖ్య డైరెక్టరు, ప్రతినిధి; అఖిల భారత చేనేత సంఘం సభ్యత్వం—ఇవి వీరు నిర్వహించిన కొన్ని పదవులు.

1960 జనవరిలో శ్రీ డి. సంజీవయ్య నాయకత్వాన రాష్ట్రంలో ఏర్పడిన నూతన మంత్రివర్గంలో శ్రీ లక్ష్మణ్ సభ్యులుగా చేరారు. వీరికి (లఘు పరిశ్రమల సహకార సంఘాలతో సహా), కుటీర పరిశ్రమలు, ఎక్సైజు శాఖలు ఇచ్చారు. 1962 మార్చి వరకు—రెండు సంవత్సరాలపాటు ఈ హోదాలో రాష్ట్రానికి సేవ చేశారు. నేటి ప్రముఖ సహకార నాయకులలో ఒకరైన శ్రీ లక్ష్మణ్ తమ పదవీకాలంలో సహకార సంఘాలను పటిష్టం చేయడానికి అనేక పరిపాలనా చర్యలు తీసుకున్నారు.

ఇటీవల జరిగిన సార్వత్రిక ఎన్నికలలో శ్రీ లక్ష్మణ్, నల్గొండ జిల్లాలోని భువనగిరి నియోజక వర్గంనుంచి శాసనసభకు అధిక మెజారిటీతో ఎన్నిక అయ్యారు.

## శ్రీ పి. వి. నరసింహారావు

శ్రీ పి. వి. నరసింహారావు, కరీంనగర్ జిల్లాలో 1921 వ సం॥ లో జన్మించారు. వీరి విద్యార్థి దశ చాలా ఉజ్వలమైనది. నాగపూర్ విశ్వవిద్యాలయం నుంచి బి. ఎస్‌సి., ఎల్. ఎల్. బి. డిగ్రీలు పుచ్చుకున్నారు. ఫ్యూడల్ ప్రభువుల పాలననుంచి విముక్తి పొందడానికి హైద్రాబాదు రాష్ట్ర ప్రజలు ప్రారంభించిన వందేమాతరం ఉద్యమంలో శ్రీ నరసింహారావు ప్రముఖ పాత్ర వహించారు. హైదరాబాదు ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ఈ జాతీయ సంస్థను రాష్ట్రంలో శక్తివంతమైన సంస్థగా రూపొందించడానికి ఈ హోదాలో వీరు అవిరళ కృషిచేశారు. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీకి ఉపాధ్యక్షులయ్యారు. రెండు ప్రాంతాల మధ్య సమైక్యతను పెంపొందించడానికి ఈ పదవి వీరికి తోడ్పడింది.

శ్రీ నరసింహారావు అఖిలభారత ఖాదీ బోర్డు సభ్యులుగా, ఉస్మానియా విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులుగా వున్నారు. హైద్రాబాదు ఖాదీ బోర్డు సంయుక్త కార్యదర్శిగా ఖాదీ ఉత్పత్తిని హెచ్చించడానికి వీరు కృషిచేయడమే కాకుండా బోర్డును శక్తివంతమైన సంస్థగా రూపొందించడానికి కూడా దోహదం చేశారు.



1962 సార్వత్రిక ఎన్నికలలో శ్రీ నరసింహారావు కరీంనగర్ జిల్లా మంథెన శాసనసభా నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు. 1962 మార్చిలో అధికారంలోకి వచ్చిన శ్రీ సంజీవరెడ్డి మంత్రివర్గంలో వీరు న్యాయ, సమాచార శాఖల మంత్రిగా నియుక్తులయ్యారు. 1963 డిశంబరు నుంచి ఒక్క న్యాయ శాఖను మాత్రమే నిర్వహించారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో కూడా అదే శాఖలు చేపట్టారు. 1964 ఆగష్టులో ధర్మాదాయ, తామదాయ శాఖలు అదనంగా స్వీకరించారు.

మంథెన సమీపంలోని కాళేశ్వరం దేవాలయం పునరుద్ధరణ విషయంలో శ్రీ నరసింహారావు చాలా శ్రద్ధ వహించారు. ఈ సందర్భంగా వీరి అధ్యక్షతన ఒక కమిటీ కూడా నియమించబడింది. ఈ పునరుద్ధరణ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి వీరు బాగా ప్రయత్నించారు. మంథెన పట్టణానికి మంచి నీటిని సరఫరా చేయడానికి ఉద్దేశించిన కొత్త పథకం అమలు జరగడంతో పాటుగా జిల్లాలోని అనేక చిన్నరకం సేద్యపు నీటివనరులకు మరమ్మతులు జరగడం శ్రీ నరసింహారావు కృషి ఫలితమే. ప్రభుత్వ కార్యాలయాలలో ఉపయోగించే నిమిత్తం శాసన సంబంధమైన, పరిపాలనా సంబంధమైన పదాలతో కూడిన ఒక పారిభాషిక పదకోశాన్ని తయారుచేయడంలో ప్రముఖపాత్ర నిర్వహించారు.

ఇటీవలి సార్వత్రిక ఎన్నికలలో శ్రీ నరసింహారావు తిరిగి మంథెన నియోజక వర్గంనుంచి మంచి మెజారిటీతో ఎన్నిక అయ్యారు.



శ్రీ బి. వి. గురుమూర్తి

శ్రీ బి. వి. గురుమూర్తి 1916 జూలై 16 వ తేదీన జన్మించారు. వీరి జనకుడు జాతీయవాది. సికిందాబాదులో పేరు ప్రఖ్యాతులుగల వర్తక శ్రేష్ఠులు. విద్యాభ్యాసానంతరం శ్రీ గురుమూర్తి రాజకీయ రంగంలో ప్రవేశించారు. కాంగ్రెసు సంస్థలో చేరారు. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో ఈ శతాబ్ది మధ్య భాగంలో ప్రజల విమోచనోద్యమానికి కాంగ్రెసు సారథ్యం వహించింది. స్వామి రామనందతీర్థవంటి ప్రముఖ నాయకుల మార్గదర్శకత్వం క్రింద ఈ ఉద్యమం ఉధృతంగా సాగింది.

శ్రీ గురుమూర్తి 1952 లో హైద్రాబాదు ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ కార్యదర్శిత్వాని చేపట్టి మూడు సంవత్సరాల పాటు ఆపదవిని నిర్వహించారు. తమ ఉత్సాహం, కార్య దక్షతల ద్వారా వీరు ప్రజా జీవితంలో ప్రముఖ పాత్ర వహించగలిగారు. శ్రీ గురుమూర్తి 1952–53, 1956–57 వ సంవత్సరాలలో సికింద్రాబాదు జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా, తరువాత మునిసిపల్ కాంగ్రెసు పార్టీ నాయకులుగా ఎన్నికయ్యారు. 1953–54 లో సికిందాబాదు మునిసిపల్ కార్పొరేషన్ మేయర్ అయ్యారు.

మూడవ సార్వత్రిక ఎన్నికలలో శ్రీ గురుమూర్తి సికిందాబాదు కంటోన్మెంటు నియోజకవర్గంనుంచి పోటీచేసి —నెగ్గారు. శ్రీ సంజీవరెడ్డి మంత్రి వర్గంలో కార్మిక, రవాణా శాఖలపై అధ్వర్యం వహించారు. రోడ్డు రవాణా సంస్థ వ్యవహారాలను దక్షతతో నిర్వహించారు. 1964 ఫిబ్రవరిలో శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయిన తరువాతకూడా శ్రీ గురుమూర్తి ఆ వేశాఖలను నిర్వహించారు. తరువాత మూడునెలలకు సమాచార, పౌర సంబంధ శాఖ కూడా వీరికి అప్పగించ బడింది. పాకిస్తాన్ దురాక్రమణ సమయంలో శ్రీ గురుమూర్తి, రాష్ట్ర పౌర. రక్షణ సంఘం అధ్యక్షులుగా గణనీయమైన సేవచేశారు. వీరి ప్రోత్సాహంవల్ల రాష్ట్రంలో సాముదాయిక రేడియో సెట్ల నిర్వహణ విషయంలో చాలా అభివృద్ధి సాధించబడింది. ఈ రంగంలో ఆంధ్ర ప్రదేశ్, దేశానికే అగ్రగామిత్వం వహిస్తున్నది.

ఇక కార్మిక రంగంలోచూస్తే రాష్ట్రంలో పారిశ్రామికంగా శాంతి పరిస్థితులు బాగా నెలకొనివున్నాయి. దీనికి కార్మిక మంత్రి శ్రీగురుమూర్తి ప్రతిభాసామర్థ్యాలే చాలా వరకు కారణం. కార్మిక సంక్షేమ విషయాల పట్ల శ్రీగురుమూర్తికి మక్కువ ఎక్కువ. కార్మికులకు సౌకర్యాలు చేకూర్చే అనేక పథకాలను వీరుఅమలు జరిపించారు. ఆంధ్ర ప్రదేశ్ లో ఉద్యోగుల ప్రభుత్వ భీమాపథకం (ఇ.ఎస్.ఐ.ఎస్.) ఉద్యోగులకేకాక వారికుటుంబ సభ్యులకు కూడా ప్రయోజనాలు కలిగిస్తున్నది.



శ్రీ నలమోతు చెంచురామా నాయుడు

శ్రీ నలమోతు చెంచురామా నాయుడు 1914 లో జన్మించారు. ప్రారంభ విద్య తరువాత గాంధీజీ నాయకత్వాన జాతీయోద్యమంలో ప్రవేశించారు 1936 సంవత్సరం నుంచే వీరికి కాంగ్రెసుతోనూ, రాష్ట్రంలోని దేశంలోని అగ్రశ్రేణి కాంగ్రెసు నాయకులతోనూ సంబంధంవుంది. ఆరోజుల్లో స్థానిక స్వపరిపాలనా సంస్థలు, ఉత్తరోత్తరా ప్రముఖులుగా రూపొందిన అనేక మంది రాజకీయ వాదులకు ఆటపట్టులుగా వుండేవి. శ్రీ చెంచు రామా నాయుడు విషయంలో కూడా అలాగే జరిగింది.

1936లో వీరు నెల్లూరుజిల్లా బోర్డు సభ్యులుగా ఎన్నిక య్యారు. 1938-1942 సంవత్సరాల మధ్యకాలంలో నాలుగు సంవత్సరాలకు పైగా జిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. 1949-1953 సంవత్సరాల మధ్యకాలంలో జిల్లా బోర్డు అధ్యక్షులుగా వున్నారు. రాష్ట్రంలో పంచాయతీరాజ్య సంస్థలు ఆవిర్భవించడంతో శ్రీనాయుడు నెల్లూరు జిల్లా పరిషత్తుకు తొలిఅధ్యక్షులయ్యారు. ఈవిధంగా, ఆంధ్రలోని ప్రముఖ పట్టణం నెల్లూరు పౌర జీవితాన్ని తీర్చిదిద్దడానికి శ్రీ చెంచురామా నాయుడు పెక్కు అవకాశాలు పొందారు.

శ్రీనాయుడు ప్రముఖ శాసన కర్తకూడా. 1952 మొదటి సార్వత్రిక ఎన్నికలలో అవిభక్త మద్రాసు రాష్ట్రశాసనసభకు ఎన్నికయ్యారు. 1955లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో పూర్వఆంధ్ర శాసనసభకు ఎన్నుకొనబడినారు. మూడవ సార్వత్రిక ఎన్నికలలో నెల్లూరు జిల్లా కందుకూరు నియోజకవర్గంనుంచి కాంగ్రెసు అభ్యర్థిగా మంచి మెజారిటీతో గెలిచారు.

ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి 1965 ఆగష్టులో మంత్రుల శాఖలను పునర్విభజించిన సందర్భంలో శ్రీనాయుడుకు వారిమంత్రి వర్గంలో స్థానం లభించింది. అప్పుడు వీరికి మునిసిపల్ పరిపాలన, అటవీ శాఖలను అప్పగించారు. మురుగు వినియోగానికీ, కంపోస్టు తయారీకీ వరుసగా రూ. 21 లక్షలు, రూ. 13 లక్షలు ఖర్చయ్యే రెండు ముఖ్యమైన పథకాలను హైదరాబాదు పురపాలక సంఘం 1965-66 లో చేపట్టడానికి వీరి శాఖ ఇచ్చిన ప్రోత్సాహమే కారణం. టౌన్ ప్లానింగ్ పథకాలను, ముఖ్యంగా "బృహత్ప్రణాళికల"ను రూపొందించే కార్యక్రమానికి వీరి హయాములో మంచి ప్రోత్సాహం లభించింది. ఇటీవలి ఎన్నికలలో శ్రీ చెంచురామా నాయుడు కందుకూరు నియోజకవర్గం నుంచి గెలుపొందారు.

## శ్రీ కె. విజయభాస్కర రెడ్డి

శ్రీ కె. విజయ భాస్కర్ రెడ్డి కర్నూలు జిల్లా, లద్దగిరి గ్రామంలో 1922లో జన్మించారు. కర్నూలు జిల్లాలో ప్రారంభ విద్య ముగించారు. మదనపల్లి థియోసాఫికల్ కళాశాలలోనుంచి పట్టభద్రులయ్యారు. మద్రాసు విశ్వ విద్యాలయం నుంచి న్యాయ శాస్త్రంలో పట్టా పుచ్చుకున్నారు. 1942వ సంవత్సరంలో విద్యార్థి ఉద్యమంలో పాల్గొన్నారు.

శ్రీ విజయ భాస్కర రెడ్డి ప్రముఖ రాజకీయనాయకులేకాక ప్రముఖ సహకార నాయకులు కూడా. ఒక దశాబ్దానికి పైగా వీరు ఈ రంగంలో కృషిచేస్తున్నారు. ఆంధ్ర ప్రదేశ్ సహకార మార్కెటింగ్ సమాఖ్య అధ్యక్షులుగా వున్నారు. వీరికి కాంగ్రెసుతోగల సంబంధం కూడా సుదీర్ఘమైనదే. 1951వ సంవత్సరం నుంచి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సభ్యులు. తరువాత కార్యదర్శి అయ్యారు. 1955-62 సంవత్సరాల మధ్యకాలంలో కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ కార్యదర్శిత్వం నిర్వహించారు. అమెరికా ప్రభుత్వం ఆహ్వానంపై శ్రీ రెడ్డి అమెరికాలో పర్యటించి అచ్చటి విద్యా విధానాన్ని ప్రత్యక్షంగా పరిశీలించారు.



రాష్ట్రంలో పంచాయతీ రాజ్య వ్యవస్థ ఏర్పడిన తరువాత శ్రీ విజయ భాస్కర రెడ్డి 1959వ సం॥లో కర్నూలు జిల్లా పరిషత్తుకు తొలి అధ్యక్షులయ్యారు. మూడు సంవత్సరాలకు పైగా ఆ పదవి నిర్వహించారు. 1964వ సం॥లో జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా తిరిగి ఎన్నిక అయ్యారు. 1955-62 సంవత్సరాల మధ్య కాలంలో వీరు శాసన సభ సభ్యులు. కర్నూలు జిల్లాలో మునిసిపల్ వ్యవహారాలతో సంబంధం వున్న కాలంలో శ్రీ విజయభాస్కర రెడ్డి, పబ్లిక్ స్కూల్ను అధికంగా నెలకొల్పడానికి కృషి చేశారు.

## శ్రీ రుద్రరాజు రామలింగరాజు

శ్రీ రుద్రరాజు రామలింగరాజు 1915వ సంవత్సరంలో తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకాలో జన్మించారు. జాతీయ ప్రయోజనాలకూ, కాంగ్రెసు సంస్థకూ చేయూతనిచ్చిన దేశభక్తుల కుటుంబం వీరిది. ఆంధ్రలోని కొన్ని ప్రాంతాలలో జస్టిస్‌పార్టీ గట్టిగా వేళ్లూనిన కాలంలో శ్రీ రాజు కుటుంబం ఈ పార్టీకి వ్యతిరేకంగా నిలిచి జాతీయ ప్రయోజనాలను, కాంగ్రెసు సంస్థ ఆదర్శాలను ప్రచారం చేయడానికి గట్టిగా కృషిచేసింది.

స్వర్గీయ శ్రీ కళా వెంకటారావు ఒకప్పుడు ఈ జిల్లాకు తిరుగు లేని నాయకుడుగా పరిగణింప బడేవారు. శ్రీ రామలింగ రాజు ఆయనకు ముఖ్య అనుయాయి. శ్రీరాజు శ్రీ వెంకటారావును తమకు రాజకీయ గురువుగా ఎంచేవారు. వీరికి ఆంధ్రప్రదేశ్





కాంగ్రెసు సంఘంతో రెండు దశాబ్దాలకు పైగా సంబంధంవుంది. శ్రీరాజు జిల్లా రైతు కాంగ్రెసు అధ్యక్షులు. జిల్లా కాంగ్రెసు సంఘానికి నాలుగు సంవత్సరాలకు పైగా అధ్యక్షులుగా వ్యవహరించారు. సహకార కేంద్రబ్యాంకు, పాలకొల్లు చక్కెర ఫ్యాక్టరీల డైరెక్టర్ల బోర్డు సభ్యులు.

శ్రీ రామలింగరాజు 1958వ సంవత్సరం నుంచి రాష్ట్ర శాసనమండలి సభ్యులు. మండలిలో చర్చకు వచ్చిన ప్రజాసమస్యలన్నింటిపైన మాట్లాడి సభలోని అన్ని వర్గాలవారి గౌరవాభిమానాలు చూరగొన్నారు. 1966లో స్థానిక సంస్థల నియోజక వర్గం నుంచి మండలికి తిరిగి ఎన్నికయ్యారు. సేద్యపునీటి వనరుల అభివృద్ధి పట్ల, ముఖ్యంగా గోదావరి బ్యారేజ్ నిర్మాణంపట్ల శ్రీరాజు ఎక్కువ శ్రద్ధచూపుతున్నారు.

## శ్రీ శీలం సిద్దారెడ్డి

శ్రీ శీలం సిద్దారెడ్డి ఖమ్మంజిల్లా బనిగండ్లపాడులో 1927 ఆగష్టు 23 వ తేదీన జన్మించారు. స్వగ్రామం బనిగండ్ల పాడులో ప్రాథమిక విద్యముగించి 1940–44 సంవత్సరాలలో ఖమ్మంలో ఉన్నతవిద్యపూర్తి చేశారు. హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాల నుంచి 1948 లో పట్టభద్రులయ్యారు. తరువాత రెండు సంవత్సరాలకు న్యాయపట్టాపుచ్చుకున్నారు.

విద్యార్థి సంఘం కార్యకలాపాలలో శ్రీ సిద్దారెడ్డి చాలా ఉత్సాహంగా పాల్గొనేవారు. పరాయి ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన విద్యార్థి పోరాటంలో కూడా పాల్గొన్నారు. వీరికి గల రాజకీయ సంబంధాల ఫలితంగా వీరు తాలూక కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా, తరువాత కొద్ది కాలానికి ఖమ్మం జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

తమ జిల్లాలో ఉన్నతపాఠశాలలు, హరిజన హాస్టళ్ళ, గ్రంథాలయాలు మొదలైన సంస్థలను స్థాపించడంలో శ్రీ సిద్దారెడ్డి అమిత శ్రద్ధవహించారు. వీరు రాష్ట్ర సహకార బ్యాంకు అధ్యక్షులు. 1958 నుంచి రాష్ట్ర శాసనమండలి సభ్యులు. స్థానిక సంస్థల నియోజక వర్గంనుంచి మండలికి ఎన్నికయ్యారు. వీరు శాసనమండలి హామీల సంఘానికి అధ్యక్షులు.





జననం: 6_4_1884 మరణం: 24_2_1967

7 వ హైదరాబాదు నిజాం

సర్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్

# నిజాం మరణంతో ఒక యుగం ముగిసినట్లయ్యింది

—ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి

హైదరాబాదు నిజాం నవాబు హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్ నవాబ్ సర్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్ వారు క్రీ. శ. 1724లో ఒకటవ నిజాముల్ ముల్కు చిన్ క్విలిచ్‌ఖాన్‌తో ప్రారంభమైన అసఫ్‌జాహి రాజవంశంలోనివారు. 1911 ఆగస్టు 29న తమ తండ్రిగారైన మహాఘనత వహించిన సర్ మీర్ మహబూబ్ అలీఖాన్ బహదూర్ వారసుడుగా హైదరాబాదు రాజ సింహాసనాన్ని అధిష్ఠించారు. ఇంచుమించు 40 సంవత్సరాల పాటు పరిపాలన సాగించారు. భారత దేశంలో పరిపాలన సాగిస్తున్న రాజులలో అగ్రగాములుగా వీరిని పేర్కొనవచ్చు. 1950లో హైదరాబాదు సంస్థానం భారత దేశంలో విలీనం కావడంతో ప్రజాస్వామిక వ్యవస్థ ఏర్పడింది. కొంత కాలం పాటు మిలటరీ పరిపాలన, ప్రాంతీయ పౌర ప్రభుత్వ పరిపాలన ఏర్పడిన తర్వాత 1952 మార్చిలో ప్రజా ప్రభుత్వం ఏర్పాటు చేయబడింది. నిజాం రాజప్రముఖ్‌గా నియుక్తులైనారు. రాష్ట్రాల పునర్విభజన జరిగినప్పుడు హైదరాబాదు సంస్థానాన్ని ఆయా భాషా ప్రాంతాలను బట్టి మూడుగా విభజించి వాటిని పొరుగునవున్న బొంబాయి, మైసూరు, ఆంధ్రప్రదేశ్‌లలో కలిపి వేయడం జరిగింది.

స్వర్గీయ నిజాం ఉస్మాన్ అలీఖాన్ బహదూర్ ఔదార్యం జగద్విదితమే. ఆనాటి హైదరాబాదు సంస్థానంలో ఎన్నో సత్కార్యాలు అమలు జరిపారు. 1918లో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పారు. అన్ని మతాలకు, అన్నివర్గాలకు సంబంధించిన అనేక సంస్థలకు ఉదారంగా విరాళాలు యిచ్చారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం, భండార్కర్ సంస్థ, శాంతినికేతనం — అట్టి వాటిలో కొన్ని. విశేష ఐశ్వర్య సంపన్నులైనప్పటికీ చాలా ఆదర్శమైన జీవితాన్ని గడిపారు. ఆయన ఇస్లాం సిద్ధాంతాన్ని తు చ. తప్పకుండ పాటించారు.

గడచిన బ్రిటిష్ సామ్రాజ్యకాలంలో విలసిన సంస్థానాలలో ఒకటయిన హైదరాబాదు సంస్థానం ఆయన జీవిత కాలంలోనే ఒక చరిత్రను సృష్టించింది. చెరిగిపోయిన వెనకటి రాచరికపు వ్యవస్థకు ఆధునిక కాలంలో యిది ఒక నిదర్శనంగా విలసిల్లింది. బహుశా మళ్ళీ మనమిక యిట్టిది చూడలేక పోవచ్చు.

నిజాం మరణానికి సంతాప సందేశాన్ని పంపిస్తూ శ్రీమతి ఇందిరాగాంధి ఇలా అన్నారు—నిజాం మరణించారన్న వార్త తెలిసి మిక్కిలి చింతించాను. వారి మరణంతో ఒక యుగం ముగిసినట్టయ్యింది. ప్రతిభాశాలిగా ఆయన వినుతికెక్కారు. సుప్రసిద్ధకవి కూడా ఆయన.....

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి తమ సందేశంలో యిలా అన్నారు—నిజాం మరణానికి చాలా చింతిస్తున్నాను. వెనకటి సంస్థానానికి ఆయన చేసిన సేవ బహుముఖమైనది. వారి కుటుంబంలోని సభ్యులందరికి నా ప్రగాఢ సంతాపాన్ని తెలియచేస్తున్నాను.



# అంతిమ యాత్ర





ప్రజావాహిని—స్వర్గీయ నిజాం భౌతిక కాయాన్ని అంతిమ సంస్కారానికై తీసుకొని వెళ్తున్న సందర్భంలో ఊరేగింపులో పాల్గొన్న అశేష ప్రజానీకం





ఫిబ్రవరి 26న స్వర్గీయనిజాం భౌతిక కాయాన్ని మక్కామసీదుకు తెచ్చిన పిమ్మట అచ్చట జరిగిన సామూహిక ప్రార్థనలలో మూడులక్షల మందికి పైగా ప్రజలు పాల్గొన్నారు. ప్రార్థనల అనంతరం భౌతిక కాయాన్ని శతఘ్ని శకటంపై వుంచి జూడీ మసీదుకు ఊరేగింపుతో తీసుకొనివెళ్లారు. ఈ అంతిమ సంస్కారం పూర్తి సైనిక మర్యాదలతో ప్రభుత్వ పరంగా జరిగింది



స్వర్గీయ నిజాం శవపేటికను మక్కామసీదులో శతఘ్ని శకటంపై వుంచడంలో తోడ్పడుతున్న ముకర్రంజా రాకుమారుడు (ప్రస్తుత నిజాం)



స్వర్గీయ నిజాం భౌతిక కాయంపై జూడీ మసీదులో ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి పుష్పగుచ్ఛాలు వుంచారు. ముకర్రంజా రాకుమారుడు, శ్రీ అలీపాషా, ప్రిన్సెస్ దుర్రెషహవార్ ప్రభృతులనుకూడా ఈ చిత్రంలో చూడవచ్చు

# నగరానికి ప్రముఖుల రాక



1967 జనవరి మొదటితేదీన బేగంపేట విమానాశ్రయంలో భారత ఉపరాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుసేన్‌కు పుష్పమాల వేస్తున్న ముఖ్యమంత్రి



బేగంపేట విమానాశ్రయంలో ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి



విమానాశ్రయంలో ప్రధానికి స్వాగతం—మరొక దృశ్యం



ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 1967 జనవరి 3 వ తేదీన హైద్రాబాదులో నేషనల్ జియోఫిజికల్ రీసెర్చ్ ఇనిస్టిట్యూటు ప్రయోగశాల భవనానికి శంకుస్థాపన చేశారు



కామారెడ్డికి వెళ్తూ మార్గంలో గ్రామస్థులతో ముచ్చటిస్తున్న ప్రధాని



ముఖ్యమంత్రి ఆనందనిలయంలో శ్రీమతి ఇందిరాగాంధికి స్వాగతం చెప్పుతున్న దృశ్యం



శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి ప్రధానమంత్రికి పూలమాల వేస్తున్న దృశ్యం



కరీంనగర్ జిల్లా కలెక్టర్ శ్రీ సి. ఓ. రావు ఐ. ఎ. ఎస్. ప్రధానమంత్రికి పూలమాల వేస్తున్న దృశ్యం



ప్రజలు శ్రద్ధాసక్తులతో ప్రధానమంత్రి ప్రసంగాన్ని వింటున్న దృశ్యం



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి, 1967 జనవరి 8వ తేదీన తుంగభద్ర ఎగువ కాలువకు ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్రప్రదేశ్, మైసూరు ముఖ్యమంత్రులనుకూడ చిత్రంలో చూడవచ్చు



శ్రీమతి ఇందిరాగాంధి, 1967 జనవరి 9న తుంగభద్ర ప్రాజెక్టు స్థలాన్ని పరిశీలించారు. డాక్టర్ కె.యల్. రావు, ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాల ముఖ్యమంత్రులు కూడ వెంటఉన్నారు



శ్రీమతి ఇందిరాగాంధి 1967 జనవరి 16న కొద్దిసేపు బేగంపేట విమానాశ్రయంలో ఆగినప్పటి దృశ్యం



జెకొస్లొవేకియా ఉపప్రధాని శ్రీ జోసెఫ్ క్రెజీ 1967 జనవరి 26న బేగంపేట విమానాశ్రయానికి చేరుకోగానే జెక్ కుటుంబాలకు చెందిన సభ్యులతో (రామచంద్రాపురంలోని భారత భారీ విద్యుత్ పరికరాల ఫ్యాక్టరీలో పనిచేస్తున్నవారు) ముచ్చటిస్తున్న దృశ్యం





ఆర్థికమంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి 1967 జనవరి 26న బేగంపేట విమానాశ్రయంలో జెక్ ఉపప్రధానికి స్వాగతం చెప్పుతున్న దృశ్యం



రిపబ్లిక్ దినోత్సవంనాడు జెకోస్లొవేకియా ఉపప్రధాని ఆంధ్రప్రదేశ్ గవర్నరు ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రితో కలిసినప్పటి ఫోటో

# మార్షియస్ మంత్రి హైదరాబాదు రాక



మార్షియస్ దేశ విద్యాశాఖమంత్రి శ్రీ వి. ఆర్. రింగాడూ శ్రీమతి రింగాడూలకు బేగంపేట విమానాశ్రయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ కె. ఎన్. అనంతరామన్ ఐ. సి. యస్. స్వాగతం చెప్పుతున్న దృశ్యం



మార్షియస్ విద్యా మంత్రి శ్రీ రింగాడు దంపతులు, 1967 జనవరి 23న నీలోఫర్ ఆసుపత్రిని సందర్శించారు

## నగరంలో ఉజ్బెక్ నృత్యబృందం

ప్రతి వసంతఋతువు, ఒంటనగరాలకు బాఖోర్ ఎన్సెంబిల్‌ను గుర్తుకుతెస్తుంది. ఉజ్బెకిస్తాన్‌కు చెందిన యీ నృత్య బృందం, యీ సంవత్సరం జనవరిలో హైదరాబాదుకు విచ్చేసింది. భారత దేశానికి శాంతిని ప్రసాదించిన తాష్కెంట్ ఉజ్బెక్‌కు రాజధాని మనోహరమైన నృత్యకదలికలు యీ ఎన్సెంబిల్ ప్రదర్శనల ప్రత్యేకత వసంతోత్సవ గీతాలుగా అలలు అలలుగా ఆలాపిస్తూ ఉజ్బెక్ సుందరాంగనలు నృత్యంచేస్తారు



ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ఉజ్బెక్ నృత్యబృందం ప్రదర్శనలను ప్రశంసిస్తూ ప్రసంగిస్తున్న దృశ్యం





# మహాభారతము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 7

## యుధిష్ఠిరుని యౌవరాజ్య పట్టాభిషేకము

తరువాత ఒక సంవత్సరములోనే ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరుని యువరాజుగా చేసెను. అతడు, తన సౌజన్యము, ధైర్యము, స్థైర్యము, ఓర్పు, అహింస, ఋజువర్తనము ఈ మొదలగు సహజ సుగుణములచేత కొలదికాలములోనే ప్రజలఅభిమానమును చూరగొని తండ్రిని మరపించెను. భీమసేనుడు బలరాముని నుండి కత్తియుద్ధము, గదాయుద్ధము, రథయుద్ధమును నేర్చి నిపుణుడయ్యెను. అర్జునుడు సర్వయుద్ధములలో నిపుణుడయ్యెను. అతనిని చేర బిలిచి ద్రోణాచార్యులు, "అర్జునా! అగస్త్యశిష్యుడగు అగ్నివేశుడు నాకు గురువు. అతడు నన్ను ప్రేమించి యిచ్చిన 'బ్రహ్మశిరస్సు' అను అమోఘాస్త్రమును నీకు ఇచ్చితిని మూడులోకములలోను దీనికి ఈడగు అస్త్రము లేదు దీనిని మనుష్యులపైనను, దుర్బలులపైనను ఉపయోగించ కూడదు. దీనికి నీవే అర్హుడవని యిచ్చితిని ఈనియమమును పాటించి యీయస్త్రమును వాడుము నా కొకగురుదక్షిణ యిమ్ము" అని కోరెను 'చిత్తము మహాత్మా! తప్పక యిచ్చెద' నని అర్జును డనెను. 'ఒకవేళ యుద్ధములో నేనే నీకు ఎదురుగా వచ్చినను వెనుకాడక నన్ను ఎదిరించి నీవు యుద్ధము చేయ వలెను' అని కోరెను అర్జునుడు గుర్వాజ్ఞను స్వీకరించి గురుచరణములకు అభివాదము చేసి వెడలిపోయెను

అర్జునుడు తరువాత దిగ్విజయము చేసి, తనతండ్రికిగూడ అజేయుడైన 'సౌవీరుడు' మొదలగు వీరరాజన్యులను కొందరిని హతమార్చి, కొందరిని అణచి తెచ్చినధనరాసులను హస్తిపురిలో నింపెను అతని 'ధనంజయుడు' అనుపేరు సార్థక మయ్యెను

పాండుకుమారుల శౌర్యవైభవములను జూచి ధృతరాష్ట్రుడు ఓర్వలేక చింతతో నిద్రపట్టక బాధపడెను. కూటనీతి విశారదుడు. మంత్రియు నైన 'కణికుడు' అను బ్రాహ్మణుని పిలిపించి దిన దినము వృద్ధి జెందుచున్న పాండవులను జూచి సహించ లేకున్నాను వారితో సంధి చేయుట యుక్తమా? విరోధము చేయుటయుక్తమా? అని అడిగెను.

ఆమాట విని కణికుడు రాజనీతి సిద్ధాంతముల నీవిధముగా ధృతరాష్ట్రునకు బోధించెను — "రాజు సర్వదా దండించుటకు సిద్ధపడియుండవలెను. పౌరుషము గలిగి; తన దౌర్బల్యము నెరుకపరచక, ఇతరుల ఛిద్రములను జాగ్రత్తతో కనిపెట్టుచు, వారు దుర్బలులైనప్పుడు వెంటనే వారిపై దాడి సలుప వలెను శత్రువు దుర్బలుడుగదా యని నిర్లక్ష్యము చేయ కూడదు. అపకారము చేసినశత్రువును తప్పక వధించ వలెను అగ్ని అల్పమైనను నిర్లక్ష్యము చేసినచో వనమునంతయు దహించును దుర్బల శత్రువును సాధించునపు డెవరైనను 'ఇది అకార్యము' అని నిన్ను నిందించినను, అంధునివలె, బధిరునివలె, వారిని జూడక వారి మాట చెవిని బెట్టక నీపని నీవు చేయుచుండవలెను. శత్రువు నిన్ను శరణు వేడినను వానిపై దయ చూపకుము. వా డెప్పుడును నీకు భయంకరుడే. శత్రుమూలమును ఛేదించవలెను. వేరు పోయినతర్వాత చెట్టు స్వయముగా నశించునట్లు శత్రుపక్షీయులు నశించెదరు తొలుత అగ్నివలె, సన్యాసివలె, శాంతుడుగా నున్నట్లు నటించి పిదప, సమయము చూచి సమీపించిన శత్రువును హతమార్చ వలెను. కాలము పరిపక్వ మగువరకు కనిపెట్టి శత్రువును భుజముపైన ఎక్కించుకొని ఆదరించ వలెను. సమయము రాగానే రాతిపైన కుండను పగుల గొట్టినట్లు అతనిని చంపవలెను. ఎంత దీనముగ మాట్లాడినను శత్రువును నారవిడువ కూడదు. వానిపైన దయ చూప కూడదు సామదాన భేద దండోపాయములచేత ఏలాగైనను శత్రుసంహారము చేయుట విధి

"ఈనాలుగు ఉపాయములచేత శత్రువును ఎట్లు సాధించవలెను? చెప్పుము." అని ధృతరాష్ట్రు డడిగెను కణికుడు దానికి సమాధానముగా ఈ క్రింది కథ చెప్పెను. —

## శత్రు సంహారోపాయము

పూర్వ మొక నక్క ఉండెను. అది మంచిప్రజ్ఞ గలది స్వార్థమే దానికి ప్రధానము. అది ఒకవనములో వ్యాఘ్రము,

ఎలుక, తోడేలు ముంగిసలతో నివసించు చుండెను. అవి యన్నియు నొకనాడు ఒక లేళ్ళయూథపతిని చూచెను. దానిని అవి పట్టుకొన లేక అన్నియు చేరి ఆలోచింప సాగెను. అప్పుడు నక్క యిట్లనెను :—

"వ్యాఘ్రమా ! ఈ మృగమును చంపుటకు పలుసార్లు యత్నించినను సాధ్యము కాకపోయెను. కనుక నిద్రించు చున్న మృగముపాదములను యెలుక కొరికినచో, అది నడువ జాలదు. అప్పుడు వ్యాఘ్రము దానిని చంప వచ్చును. మన మందరము దానిని భక్షింతము" అని చెప్పగనే, యెలుక మృగము పాదములను కొరికెను. మృగమును వ్యాఘ్రము చంపెను. అప్పుడు నక్క 'నే నీమృగకళేబరమును కాపాడు చుండెదను. మీ రందరు స్నానము చేసి రండు. తరువాత భక్షింతము' అనెను ఆప్రకారమే స్నానార్థమై అవి పోయెను.

నక్క చింతించుచు అక్కడనే యుండెను. మొదట వ్యాఘ్రము స్నానము చేసి వచ్చెను. చింతించుచున్ననక్కను చూచి యిట్లనెను :—

వ్యా :—నీవు మహాబుద్ధిశాలివి. నీ కీచింత యేల ? సుఖముగా దీనిని భుజింతము.

నక్క :— ఓయీ! ఎలుక యే మనెనో వినుము "మృగరాజైన వ్యాఘ్రముయొక్క బలము వ్యర్థము. చివరకు నేనే యీ లేడిని చంప గలవాడ నైతిని. నాబాహుబలముచేత చంప బడినయీలేడిని యిప్పుడు వ్యాఘ్రము తృప్తిగా భుజించును." అని యనెను. కనుక నేను ఎలుకపెట్టిపోతలకై యాశించను. నా కక్కర లేదీ భోజనము.

వ్యా :—"ఎలుక యీవిధముగా కారుకూతలు కూసెనా ! అది యిప్పుడు నాకన్నులు తెరపించెను. కనుక నేను నేటి నుండి నాబాహుబలముచేత నే మృగములను చంపి తినెదను" అని చెప్పి వనములోకి పోయెను. తరువాత యెలుక స్నానము చేసి వచ్చెను. దానినిచూచి నక్క యిట్లనెను:—

నక్క :—ఎలుకబావా ! ముంగిస యే మనెనో వింటివా ? "ఈలేడిని వ్యాఘ్రము చంపెను. కనుక ఇది విష మయ్యెను. నేను తినను. నీయాజ్ఞ అయినచో నేను ఎలుకను తినెదను." అని యనెను.

అది విని ఎలుక భయపడి తనబిలములో దూరెను. తరువాత తోడేలు స్నానము చేసి వచ్చెను. నక్క దానితో "నేడు వ్యాఘ్రమునకు నీపై కోపము వచ్చినది. అందువల్ల నీవు ఇక్కడ ఉండుట క్షేమము గాదు. ఇంతలోనే వ్యాఘ్రము వచ్చి నిన్ను చంపును." అని యనెను. అది విని తోడేలు భయముచే పారిపోయెను ఇంతలో అక్కడికి ముంగిస స్నానముచేసి వచ్చెను. దానిని చూచి నక్క, "నకులమా ! నాబాహుబలమునకు ఓడి మనతోడిమృగములు మూడును పారిపోయెను. నీకు శక్తి యున్నచో నాతో పోరాడి నన్ను గెలిచి యీమృగమాంసమును తినుము." అనెను. ఆమాట విని ముంగిస, మృగరాజైన వ్యాఘ్రము, తోడేలు, బుద్ధిమంతుడైన ఎలుక, యీమూడును వీరుడ వగునీకు ఓడి పారిపోయెను. నీవు వీరశిరోమణివి. కనుక నేను నీతో యుద్ధము చేయ లేను." అని చెప్పి ముంగిస గూడ పారిపోయెను.

ఈకథ చెప్పి కూటనీతివిశారదుడైన కణికుడు, "ధృతరాష్ట్రా ! యీవిధముగానే శత్రువులను భేదోపాయముచేత నిర్జించవలెను. లోభిని ధనముచేత, సమానుని, దుర్బలుని పరాక్రమముచేత అణచ వలెను. పుత్రుడు, మిత్రుడు, సోదరుడు, తండ్రి, గురువు, ఎవరైనను సరే, శత్రుత్వము చేసినప్పుడు అవశ్యముగ వారిని చంపవలెను. గురువు గర్వితుడై యుక్తాయుక్తము లెరుగక కుమార్గగామి యైనచో అతనిని గూడ దండించుట న్యాయము. కనుక శత్రువును ఎన్నియో యుక్తులు పన్ని సంహరించవలెను."

—అని అనేకకపటోపాయములను బోధించి కణికుడు, 'దృతరాష్ట్రమహారాజా ! నీవుగూడ పాండవులతో అత్యంత మైత్రిని చూపించినట్లు నటించుచు వారిని రూపుమాపకపోయినచో నీకు, నీసంతతికి క్షేమము గలుగదు. వారు బలవంతులు, వారి నిప్పుడు నిర్లక్ష్యము చేసి తరువాత పశ్చాత్తాప పడకుము " అని చెప్పి కణికుడు వెడలిపోయెను.

## లాక్షా గృహదహనము

అధిక బలిశాలియైన భీముని, అస్త్రవిద్యలో అధికుడైన అర్జునుని చూచి దుర్యోధనుడు సహించలేక మిక్కిలి పరితపించు చుండెను. కర్ణ, శకుని దుశ్శాసనులతో కలిసి దుర్యోధనుడు అనేక యుక్తులను పన్ని పాండవులను చంపదలచుచుండెను. ఈ నలుగురికి 'దుష్టచతుష్టయము' అని ప్రసిద్ధి. వీరు చేయు నపకారమునకు పాండవులు ప్రతిక్రియలను సలుపుచునేయుండిరి. కాని, విదురుని ఉపదేశమును పాటించుచు పాండవులు దుష్టచతుష్టయము చేయు దుష్కృత్యములను బయలుపరచకుండిరి.

పాండవుల సద్గుణములను గూర్చి ప్రజలు విశేషముగా ప్రశంసించుకొనుచుండిరి. యుధిష్ఠిరునే రాజునుగా చేయదలచు చుండిరి 'అతడు ధర్మాత్ముడు గనుక భీష్మాదులగు పెద్దలను పూజించుచు గౌరవించగలడు' అని తలచుచుండిరి. ఈ విధముగా ప్రజలు యుధిష్ఠిరునియందు అనురక్తులై యుండుటను జూచి దుర్యోధనుడు ఓర్వలేకుండెను తండ్రికడకుపోయి యిట్లనెను "తండ్రీ! ప్రజలు నిన్ను, భీష్ముని లెక్కచేయక యుధిష్ఠిరునే రాజుగా చేయదలచుచున్నారు. భీష్మునకు రాజ్యకాంక్షలేదు. మాకు నష్టము కలిగించు పన్నాగములను ప్రజలు పన్నుచున్నారు. పాండురాజుకు ఉత్తరాధికారిగా యుధిష్ఠిరుడు అయినచో భవిష్యత్తులో అతని పుత్రపౌత్రాది సంతతియే కురురాజ్యాధికారమును వహించగలరు. మేము మా సంతతియు ఎల్లప్పటికిని రాజ్యహీనుల మయ్యెదము. ప్రపంచములో అవమానముల పాలగుదుము. సర్వదా యితరుల పెట్టిపోతలపై ఆధారపడుచు బాధలను అనుభవించవలసివచ్చును. తొలుతనే రాజ్యాధికారమును పాండురాజునకు ఈయకుండ నీవే వహించియుండినచో ఇప్పుడది మాకు

సంక్రమించి యుండెడిది. ప్రజలు ఏమియు ననజాలకుండిరి. కనుక దీనికొక యుపాయము చేయవలసియున్నది.''

ఈ విధముగ చెప్పిన పుత్రుని మాటలనువిని ప్రజ్ఞా చక్షువైన ధృతరాష్ట్రుడు కలతపడి పూర్వము కణికుడు చెప్పిన రాజనీతి మాటలుగూడ తన మనస్సును ఆందోళన పరచుచుండగా ఏమి చేయుటకును తోచక ఉండెను. అప్పుడు దుర్యోధనుడు దుష్టచతుష్టయముతో దురాలోచనచేసి తండ్రితో 'ఏలాగైనను నిపుణముగా యుక్తులుపన్ని నీవు పాండవులను ఊరినుండి వెడలించి 'వారణావత' పురమునందు నివసింపజేయుము.' అని చెప్పెను.

కొడుకు మాటలను ధృతరాష్ట్రుడు క్షణకాలము చింతించి యిట్లనెను. ''పుత్రా. నా తమ్ముడు పాండురాజు సర్వదా ధర్మాచరణము చేయుచు అందరియెడల, ధర్మానుకూలముగా వర్తించుచుండెను. విశేషించి నాపైన ఎక్కువ భక్తిశ్రద్ధలుగలవాడై యుండెను అతడు ఉత్తమముగా రాజ్యపాలనము చేయుచుగూడ ''అగ్రజా! ఈ రాజ్యము నీది'' అని చెప్పుచుండెను. అతనివలెనే అతని కొడుకు యుధిష్ఠిరుడుగూడ ధర్మపరాయణుడు, గుణవంతుడు, జనప్రియుడుగా నున్నాడు. అట్టివానిని, అతని పితృపైతామహమైన రాజ్యమునుండి వంచితునిచేసి యెట్లు వెడలగొట్టుదును. విశేషించి అతడు మంచి సహాయ బల సంపదగలవాడు. అతనిని వెడలించుట సాధ్యముకాదు. పాండురాజు మంత్రులను, ప్రజలను సైనికులను, వారి పుత్ర పౌత్రులను మిక్కిలి ఆదరించెను. అట్టి ప్రజలు ఇప్పుడు పాండుపుత్రులపై విశేషప్రేమ కలిగి యున్నారు. మనము పాండవులకు ఏమాత్రము అపకారమును తలపెట్టినను పౌరజానపదులు మనను సహించరు. కనుక ప్రజాభిమతమునకు వ్యతిరేకముగా ఆచరించినచో మనము నిలువజాలము.''

ఈ విధముగా తండ్రిచెప్పిన మాటలను విని దుర్యోధనుడు ఇట్లనెను. ''తండ్రీ! నీవు చెప్పినట్లే ప్రజలు మనపైన తిరుగుబాటు చెసెదరని నేను తొలుతనే ఊహించితిని. అందువలన నేను ప్రజలకు ధనసహాయము చేయుచు వారిని గౌరవించుచున్నాను. ఇప్పుడు వారు నాకు వ్యతిరేకముగ లేరు. ఇదిగాక ఇప్పుడు ధనరాసులు, మంత్రివర్గము మనవశములో నున్నవి, కనుక నీవు మృదువైన ఉపాయమును పన్ని పాండవులను వారణావతమునకు తరలింపుము. ఈ రాజ్యము పూర్తిగా నా యధికారములోనికి వచ్చినతరువాత వారు తిరిగి యిక్కడికివచ్చి యుండగలరు.''

ఆ మాటకు ధృతరాష్ట్రుడిట్లనెను. ''పుత్రా! నాకుగూడ ఈ యభిప్రాయమే యున్నది. కాని యిది పాపచింతనము గనుక ప్రకటించలేకున్నాను. పాండవులను నగరమునుండి బయటకు పంపుటకు భీష్మ, ద్రోణ, కృప, విదురాదులు అంగీకరించరు. వారికి మనము, పాండవులు సమానులమే. ఒక రెక్కువ, మరియొకరు తక్కువఅను భేదభావము లేదు. కనుక మనము పాండవులకు అపకారము చేయ తలపెట్టినచో ధర్మాత్ములైన భీష్మాదులు, పాండవ ప్రియులైన మంత్రి పురోహితులు-ప్రజలు మనను నిరసించుటకు వెనుదియరు.''

ఆ మాటకు దుర్యోధనుడిట్లనెను. 'తండ్రీ! భీష్ముడు మన యిరువురియెడల మధ్యస్థుడుగా నుండును. ద్రోణ పుత్రుడగు అశ్వత్థామ నా వైపుననే యున్నాడు ద్రోణుడుగూడ కొడుకునే యనుసరించును. కృపాచార్యుడు తన బావను, మేనల్లుని మీరిపోవ జాలడు. అతడుగూడ మనవాడే యగును. ఇక విదురుడో, అతడు మన ఆర్థిక బంధనములో చిక్కుకొని యున్నాడు. రహస్యముగా నొకవేళ పాండవుల హితము కోరినను మన కేమియు అపకారము చేయజాలడు. కనుక తండ్రీ! నీవు నిశ్చింతగా పాండవులను వారి తల్లితోపాటు వారణావతమునకు పంపివేయుము. నా మనస్సులో శల్యము గ్రుచ్చుకున్నట్లున్నది. నిద్ర పట్టుటలేదు. నా యీ కోర్కెను మన్నించి నా శోకాగ్నిని చల్లార్పుము.'' అని చెప్పి తండ్రిని అంగీకరింపజేసెను.

తరువాత దుర్యోధనుడు, ప్రజలకు ధనధాన్యాదులను ఇచ్చుచు, వారిని ఆదరించి సత్కరించుచు ప్రజాదరము సంపాదించెను. అతని తమ్ములుగూడ జన ప్రీతిని సంపాదించిరి. అప్పుడు ధృతరాష్ట్రుని ప్రోత్సాహముపైన కొందరు మంత్రులు వారణావత పురమును ప్రశంసించుచు, అక్కడ ఆ దినములలో గొప్పగా పరమేశ్వరుడగు పార్వతీవిభుని ఉత్సవములు కన్నుల పండువుగా జరుగుచున్నట్లు నలువైపుల ప్రచారము చేసిరి యుధిష్ఠిరునకు ఆ ఉత్సవములను దర్శించవలెనను ఆకాంక్ష కలిగెను. అది కనిపెట్టి ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరునివద్దకు పోయి ఆ యుత్సవ వైభవమును, వారణావతపుర ప్రశస్తిని గూర్చి అభివర్ణించి, మీరు తల్లితో వారణావతమునకు పోయి ఆ యుత్సవములను చూచి కొన్నాళ్లచటనే యుండుడు, తిరిగి యిక్కడికి రావచ్చును!' అని చెప్పెను. ఆ మాటల పోకడవలన యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రుని కుట్రను గ్రహించియు చేయనదిలేక అతని మాట ప్రకారము తమ్ములతో, తల్లితోను వారణావతమునకు పోవ సమకట్టెను.

దుర్యోధనుడు సంతసించి 'పురోచనుడు' అను మంత్రిని పిలిపించి యిట్లనెను. 'ఓయీ! ధనసమృద్ధమైన ఈ కురు రాజ్యము నాకువలెనే నీకును ప్రియమైనది. నీకన్న నాకు విశ్వాసపాత్రుడు మరియొకడు లేడు. నాకు సహాయము చేయుము నాశత్రువులైన పాండవులు తండ్రి యాజ్ఞచేత వారణావతపురమునకు పోవుచున్నారు. నీవు వెంటనే కంచరగాడిదల రథముపైన త్వరగా అచటికిపోయి నా శత్రువులను చంపు కార్యక్రమములో నాకు తోడుపడుము. ఈ రహస్యమును కాపాడుము. అక్కడ నీవు అతి శీఘ్రముగా నొక సుందరమైన చతుశ్శాలాభవనమును లక్కతో నిర్మించుము. మట్టిలో జనపనార, మద్దిజిగురు మొదలైన అగ్నిని ఉత్తేజపరచు ద్రవ్యములను కలిపి యెక్కువగా లక్కను చేర్చి భవన నిర్మాణము చేయుము అందులో నేయి, తైలము, క్రొవ్వు మొదలైన వస్తువులను చేర్చి నిర్మించుము. ఇవన్నియు, ఎంత పరీక్షించినను ఇతరులకు తెలియపడకుండ చేర్చుము, అక్కడ ఉత్సవమును సందర్శించుచు వినోదముగా తిరుగుచున్న పాండవులకడకు పోయి వారిని పూజించి సన్మాన

పూర్వకముగా ఆహ్వానించి ఆ సుందరభవనములో విడిది చేయింపుము. దానివలన మాతండ్రిగూడ సంతసించును. ఆయింటిని దహించు నవకాశము మనకు లభించువరకు రహస్యమును కాపాడుము. దానిలో సమస్త సౌకర్యములను పాండవుల కొరకు ఏర్పాటు చేసియుంచుము. వారు పూర్తిగా విశ్వసించి నిద్రించి యున్నప్పుడు బయటినుండి యాయింటికి నిప్పును అంటించుము. వారు అందులో పడి చత్తురు. ఇల్లుగాలి చచ్చినారని అందరు భావింతురు. మనపైన నిందపెట్టరు.'' అని చెప్పగనే పురోచనుడు అంగీకరించి వెంటనే వారణావతమునకు పోయి ఒక సుందర లాక్షా గృహమును నిర్మించి యందులో దాహక ద్రవ్యముల నన్నింటిని సిద్ధముగ నుంచెను.

పాండవులు తండ్రి యాజ్ఞ ప్రకారము వారణావతమునకు తల్లితో పర్యాణమై పోవుచు భీష్మ ద్రోణాదులకు నమస్కరించి, సమానులను ఆలింగనము చేసికొని, పిన్నల నాదరించి, ప్రజల సెలవుగొని రథముపైన వెడలిరి. వారి దీనావస్థను చూచి ప్రజలు దుఃఖించి ధృతరాష్ట్రుని నిందించుచు పాండవులను వీడజాలక వారి వెంటనే పోవుటకు బయలుదేరిరి. యుధిష్ఠిరుడు వారికి హితబోధచేసి అందరిని తిరిగి హస్తిపురికి పంపెను.

పౌరులు తిరిగిపోయిన తరువాత విదురుడు పాండవులకు ఈ క్రిందివిధముగా బోధించెను. అతడు చాల బుద్ధిమంతుడు. మ్లేచ్ఛభాష నెరిగినవాడు. యుధిష్ఠిరునకుగూడ ఆభాష తెలియును. కనుక విదురుడు మ్లేచ్ఛభాషలో యుధిష్ఠిరునకు ఉపదేశించెను. ఆభాష యితరులకు తెలియదు గనుక ఈ రహస్యము నెవరును కనిపెట్టలేకపోయిరి. విదురునకు లక్కయింటి రహస్యము తెలియును.

'యుధిష్ఠిరా! శత్రువుల నీతిశాస్త్ర ప్రజ్ఞను కనిపెట్టువాడు వారి మాయోపాయములనుండి తప్పించుకొనవలెను. లోహనిర్మితము కాకున్నను శరీర నాశమును కలిగించునది నీతిశాస్త్రము. దాని నెరిగినవాడు దానినుండి తప్పించుకొను నుపాయమును అన్వేషించవలెను. అట్టి వానిని శత్రువు చంపలేడు. పెద్ద గడ్డివాములను, శుష్క వృక్షవనములను, శీతబాధను నశింపజేయు ఘోరమైన అగ్నిగూడ బిలములలోనుండు ఎలుకలు మొదలగు జంతువుల నేమియు చేయజాలవు. ఆలాగే తనను తాను రక్షించుకొను వానిని ఎంత తీవ్ర శస్త్రఘాతముగూడ హింసించ జాలదు. అంధునకు మార్గములు, దిక్కులు తెలియనట్లే ధైర్యహీనునకు గూడ సద్బుద్ధి గోచరించదు. కనుక నాయుపదేశమును అనుసరించుము. శత్రువుల మాయోపాయములను కనిపెట్టగల బుద్ధిశాలి, బిలములో దూరి అగ్నిబాధను తప్పించుకొన్నట్లు, శత్రుబాధనుండి విముక్తుడగును.

విదురుని మాటలలోని రహస్యార్థమును గ్రహించిన ధర్మరాజు విదురునకు కృతజ్ఞత తెలిపెను. ఈ విధముగనే బోధించుచు విదురుడు వారివెంట కొంతదూరము పోయి వారి సెలవు తీసికొని తిరిగి యింటికి పోయెను. తరువాత కుంతి అజాతశత్రువు కడకు వచ్చి విదురుడు చెప్పినమాటల యర్థమును గూర్చి యడిగెను. వారణావతములో తనకు ఇంటిలో గలుగు అగ్నిభయమును గూర్చి, దానినుండి తప్పించుకొను ఉపాయమును గూర్చియు విదురుడు చెప్పెనని యుధిష్ఠిరుడు తల్లికి చెప్పెను. పాండవులు ఫాల్గున శుక్ల అష్టమి, రోహిణీ నక్షత్రము నాడు వారణావతమునకు ప్రయాణమై పోయిరి.

వారణావత నగర వాసులు పాండవులను భక్తి గౌరవములతో నెదుర్కొని వారికి స్వాగతము పలికిరి. పురోచనుడు వారికి తొలుత నొక పటకుటీరము (డేరా) లో నివాసము కల్పించి సకల సౌకర్యములు చేకూర్చుచుండెను. పది దినముల తరువాత పురోచనుడు పాండవులను లక్కయింటికి తరలించెను. దానికి 'శివము' (మంగళకరము) అని పేరు పెట్టబడెను. అతిసుందరము, సర్వవస్తు శోభితమునగు నా లాక్షా గృహమున పాండవులు తల్లితో ప్రవేశించిరి. వారికి కించిత్తుగూడ లోపము కలుగకుండ పురోచనుడు, ఇతర సేవకులు సేవచేయుచుండిరి.

ఆ యింటిలో ప్రవేశించి యుధిష్ఠిరుడు భీమునితో రహస్యముగా 'ఇది లక్కయిల్లు సుమా! అగ్నిని ఉత్తేజపరచు నెయ్యి, జనపనార, నూనె మొదలగు వస్తువులతో నిర్మింప బడినది. ఈ రహస్యమును నాకు ధర్మాత్ముడగు విదురుడు తెలిపెను. కనుక మనము జాగ్రత్తగా మెలగుచు ప్రాణములను కాపాడుకొని యిందుండి బయటపడవలెను. దురాత్ముడగు దుర్యోధనుడు పురోచనుని ద్వారా మన నీయింటిలో దహింప దలచినాడు అని యనెను. ఆ మాటవిని భీముడు 'అట్లైన మనమిప్పుడే యీ లక్కయింటిని వీడి పోవుదము!' అనెను. ఆ మాటవిని ధర్మాత్ముడు, కార్యసాధకుడు నగు యుధిష్ఠిరుడు భీమసేనునితో నిట్లనెను,

''తమ్ముడా! మనకీ రహస్యము తెలిసినట్లు ఏమాత్రము గూడ బాహ్య చేష్టలచే ప్రకటించక ఉండవలెను. తప్పించుకొని పోవుటకు అనుకూల మార్గమును వెతకుచుండవలెను. అంతదాక వారికి నమ్మకము కలిగించి జాగరూకులమై యిచటనే యుండవలెను. ఈ గుట్టు పురోచనునకు తెలిసినచో యేదో యొక యుక్తి పన్ని వెంటనే మన నీయింటిలో కాల్చివేయును. అతడు ధర్మమునకు గాని అపనిందకుగాని, దుర్యోధనుని వలెనే, భయపడువాడు కాడు. అట్లొకవేళ మనమిక్కడ దహింపబడినచో భీష్మ పితామహుడు అతికుపితుడై దుర్యోధనాదులకు నష్టము కలిగించును. మనము మరణించిన పిదప వారిని కష్టములపాలు చేసినచో మనకేమి లాభము. బ్రతికియే వారిని మనము సాధించవలెను గదా! అట్లుగాక మనమొకవేళ భయపడి పారిపోయినచో, పాపాత్ముడగు దుర్యోధనుడు గూఢచారులద్వారా మనను వెతకించి చంపించును. అతడు అధికారములో నున్నాడు. మనము లేము. అతని కిప్పుడు సైనిక సహాయ మున్నది. మనకు లేదు. అతనికి ధనమున్నది. మనకు లేదు. మనను తప్పక హింసించును. కనుక మనము పారిపోవకూడదు. మనము చావకుండ చూచుకొనవలెను గాని, చచ్చిన తరువాత దుష్టులకు ఏ కష్టములు వచ్చినను మనకేమి లాభము. కనుక వీరందరిని వంచించుచు మనమిక్కడనే యుండి యెవరికిని తెలియకుండ భూమిలో నొక

సురంగమును త్రవ్వి యందులో నుండినచో అగ్ని మనను దహించ జాలదు.''

విదురుడు సురంగము త్రవ్వువాని నొకనిని యుధిష్ఠరుని కడకు పంపెను. ఆ ఖనకుడు రహస్యముగా వచ్చి తనను తెలిపికొని సురంగము త్రవ్వుటకు వారి యాజ్ఞను కోరి, "ఈ కృష్ణపక్ష చతుర్దశి రాత్రియే యీ యింటికి పురోచనుడు నిప్పంటించును'' అనెను. ఆ మాటకు యుధిష్ఠరుడు సంతసించి యతని యిష్టము ప్రకారము చేయమనెను. అతడును మంచి సురంగమును గూఢముగా త్రవ్వెను. పాండవులు నిద్రించుచుండగా ఆ యింటి ద్వారమునకు నిప్పంటించవలెనని పురోచనుడు సర్వదా ద్వారమువద్దనే కూర్చొని యుండెను. పాండవులును శస్త్రాస్త్రధరులై జాగ్రత్తగా అతనికడనే కూర్చొనుచు ముచ్చట్లతో రాత్రి గడపుచుండిరి, పగళ్ళు వేటనెపమున అడవికి పోయి, తాము తప్పించుకొని పోవుటకు వివిధ మార్గముల నరయుచుండిరి. అసంతుష్టులైనను సంతుష్టులవలె మెలగుచుండిరి.

ఒక సంవత్సర కాలమిట్లు పాండవులు లక్కయింటిలో ప్రసన్న చిత్తులుగా నున్నట్లు పురోచనుడు నమ్మియుండెను. ఒకనాడు యుధిష్టరుడు తమ్ములతో నిట్లనెను, "పాపాత్ముడైన పురోచనుడు మనము వానిని నమ్మియున్నట్లుగానే భావించు చున్నాడు. కనుక మనము తప్పించుకొని పోవుట కీసమయమే మంచిది. ఈ యాయుధాగారమును, పురోచనుని దహించి యిందులో ఆర్గురిని ఉంచి వెడలిపోవుదము" అని చెప్పెను.

మరునాడు కుంతీదేవి దానముచేయు నెపముతో అనేకులను బ్రాహ్మణులను, ముత్తైదువులను పిలిపించి వారిని సత్కరించి పంపెను అప్పుడు కాలవశమున నొక అడవిజాతి భిల్లస్త్రీ తన యైదుగురు పుత్రులతో పాటు ఆ యింటికి వచ్చి ఆ భోజన సంతర్పణలో చేరెను. భుజించిన తరువాత తప్పత్రాగి మద్యపు మత్తుచే వారు మృతులట్లు పడి నిద్రించుచుండిరి. ఆరాత్రి గొప్పగా సుడిగాలి వీచెను. భీమసేనుడు పురోచనుడు నిద్రించుచున్న చోటికి నిప్పు అంటించి పిదప జతు గృహద్వారమునకు గూడ నిప్పు పెట్టెను. ఆ యిల్లంతయు అంటుకొనుటను చూచి పాండవులు తల్లితోపాటు సురంగము ద్వారా తప్పించుకొని పోయిరి.

పాండవులు నిద్రాభావముచేతను, భయముచేతను ఆ సురంగ మార్గమున వేగముగా నడవజాలకుండిరి భీమసేనుడు తల్లిని భుజముపైన, నకుల సహదేవులను ఇరుపార్శ్వముల యందును ఎక్కించుకొని యుధిష్ఠిరార్జునులను రెండు చేతులతో పట్టుకొని, రొమ్ముతో చెట్లను విరుచుచు. పాదములతో భూమిని చీల్చుచు వాయువేగముతో అడవిలో నడచుచు పోయెను. కొంత దూరముపోయి వారు గంగాతీరమును చేరిరి గంగలో నీరెంత లోతున్నదని కొలుచుచునుండిరి.

అక్కడికి విదురుడు పంపిన ఒక పురుషుడు వచ్చెను. అతని వెంట విదురుడొక యంత్రనౌకను పంపియుండెను. ఆ మరఓడ జలములో మనోవాయు వేగములతో అలలను వాయువును



ఎదిరించుచు పోవగలదిగా నుండెను ఆ నావనుచూపి ఆ పురుషుడు, తాను విదురుడు పంపగా వచ్చినట్లు తెలిపి. వారు విశ్వసించు నట్లుగా కొన్ని గుర్తులుచెప్పి వారిని ఆ నావపైన గంగను దాటించి సెలవు తీసికొని తిరిగి హస్తిపురికి పోయెను పాండవులు గంగను దాటి ఇతరులకు తెలియకుండ నిగూఢముగా అడవిలో పడి పోయిరి.

ఆ రాత్రి గడచినతరువాత వారణావత నగరవాసు లందరు కాలిన యింటిచుట్టు చేరిరి. అందులో అర్గురు వరుసగా దహింపబడియున్న గుర్తులు చూచి అయ్యో దుర్యోధనుడు ధర్మాత్ములైన పాండవులను అన్యాయముగా చంపెనే అని దుఃఖించిరి. వెంటనే వారు పాండవులు, పురోచనుడును దహింపబడినట్లు ధృతరాష్ట్రునకు తెలియజేసిరి అతడును, భీష్మాదులతో పాండవ మరణమునకు మిగుల దుఃఖించెను. విదురుడు మనస్సులో సంతసించుచు పైకి దుఃఖించుచున్నట్లు నటించెను ధృతరాష్ట్రుడు పాండవులకు యథావిధిగా ప్రేత కార్యములను చేయించి వారి పేర అనేక దానములను గూడ చేయించెను.

అతి దుర్గమారణ్యములో పాండవులు చాలా బాధలుపడుచు నడవలేక నడచుచుండిరి యుధిష్ఠిరుని ఆజ్ఞపైన మహా బలశాలి యగు భీమసేనుడు అందరిని మోసికొని ధీర గంభీరముగా అడవిని ఛేదించుకొనుచు ముందుకు సాగిపోవుచుండెను. అతని పాద ఘట్టనముచేత నేల అదరుచుండెను. లతలు వృక్షములు నరకుచు మార్గము చేసికొనుచు పోవుచుండెను మదగజమువలె పోవుచున్న భీముని ఆర్భాటమును చూడలేక పాండవులు, తల్లి మూర్ఛిల్లిరి. నదులు, వాగులు వచ్చినపుడు అతి కష్టముతో తల్లిని జాగ్రత్తగా మోసికొని వరదల నెదిరించి పోవుచుండెను. సాయంకాల మగువరకు అట్లే నడచుచు భీముడు ఒక ఘోరా రణ్యమును చేరెను. అచ్చట జలముగాని ఫల మూలములుగాని లభించకుండెను

ఇంతలో అతిఘోరమగు అంధకారము నలుదిక్కుల వ్యాపించెను. గొప్ప సుడిగాలి వీచెను. పాండవులు మిక్కిలి దప్పి గొని యుండిరి ముందుకు సాగిపోలేకుండిరి కుంతి చాలా దప్పి గొని నీటికై పుత్రులను కోరెను భీముడు తల్లియెడ కరుణార్ద్ర హృదయుడై అట్లే వారినందరిని మోసికొనిపోయి యొక మఱ్ఱి చెట్టుకడ దింపి నీటికై వెదకుచు అంధకారములోకి పోయెను. జల పక్షుల ధ్వనిని విని అచ్చట కొలను ఉన్నదని తెలిసి ఆ ధ్వనినిబట్టి పోయి ఆ సరస్సులో స్నానముచేసి తృప్తిగా నీరుత్రాగి తనవారికై ఉత్తరీయములో నీరు తెచ్చెను. అతడు వచ్చుసరికి వారు సొమ్మసిల్లి నిద్రించుచుండిరి. అట్లు కంటక పాషాణములలో నిద్రించుచున్న మాతృదేవిని సోదరులనుచూచి భీమసేనుడు మిగుల దుఃఖించెను. వారు నిద్రలేచువరకు వేచి యుండెను. కాని నీరు త్రాపుటకు వారిని మేలుకొలుపలేదు.

## హిడింబాసుర వధ

ఆ సమీపమునందే చెట్టుపైన తన చెల్లెలు 'హిడింబ'తో నివసించుచున్న 'హిడింబుడు' అను రాక్షసుడు మనుష్యగంధము నాఘ్రాణించి మనుజ మాంసమును తినగోరి వారిని చంపితెమ్మని చెల్లెలిని పంపెను. ఆమె వారికడకు పోయెను. వారిలో మేల్కొని యున్న భీమసేనుని సుందర సుదీర్ఘ కాయమును చూచి అతనిని మోహించెను అన్న చెప్పినమాట మరచిపోయెను. భ్రాతృ స్నేహముకన్న ప్రియప్రేమ మిన్నగదా! "వీరందరిని చంపినచో ఈ మాంసముతో నేను నాయన్న ఒక్క క్షణకాలమేకదా తృప్తి చెందెదము వీరిని చంపక యితనిని ప్రేమించినచో శాశ్వతముగా నేను సుఖపడవచ్చును" అని నిశ్చయించుకొని కామరూపిణియగు హిడింబ సుందరమైన మనుష్యరూపమును ధరించి మెలమెల్లగా భీమసేనుని సమీపించెను సిగ్గుపడుచు భీమునితో, నీ వెవరు? ఎక్కడివాడవు? వీరిట్లు సుఖముగా స్వగృహమునందువలె నిద్రించుచున్నారే. ఈమె యెవరు? ఈ వనము క్రూరుడగు హిడింబాసురుని నివాసస్థానము. మిమ్ముచంపి తెమ్మని అతడునన్ను పంపెను నే నతని చెల్లెలను అతనినుండి నిన్ను రక్షించెదను. నిన్ను కామించితిని. నన్ను చేపట్టుము. ఈ గిరి కందకములలో విహరించుచుందము". అనెను. భీము డది విని తల్లిని సోదరులను రాక్షసుని వశముచేసి కామార్తుడనై నీవెంట వచ్చుటకు నేను ఇష్ట పడను. నేను రాక్షసునకు భయపడువాడను కాను.' అనెను. 'వీరందరిని మేల్కొలుపుము వీరిని హిడింబునినుండి విడిపించెదను నీ యిష్టమును నెరవేర్చి నీతో సుఖించెదను.' అని హిడింబ యనెను. 'సుఖముగా శయనించియున్న వీరిని నేను రాక్షస భయముచేత మేల్కొలుపను. రాక్షసులు, గంధర్వ యక్షు లెవరువచ్చినను నన్నేమియు చేయజాలరు, ఒక్క త్రుటిలో వారిని హతమార్చెదను. నీవు పొమ్ము. అతనిని పంపుము. నాకు భయములేదు.' అని భీమసేనుడు చెప్పెను.



ఇంతలో హిడింబాసురుడు, హిడింబ యెంత సేపటికిని రాకుండుటనుచూచి, కుపితుడై వృక్షమునుండి దుమికి పాండవు లున్నచోటికి వచ్చుచుండెను. అదిచూచి హిడింబ భయపడి భీమునితో 'ఆ రాక్షసుడు వచ్చుచున్నాడు, నేనుచెప్పినట్లు చేయుము. నన్ను ప్రేమించుము. నేను కామగమనము కలదానను. మీవారిని మేల్కొల్పుము. అందరిని మోసికొని యిటనుండి పోయెదను. రాక్షసుని బారినుండి తప్పించుకొందము' అని చెప్పెను. దానికి భీముడంగీకరింపక 'భయపడకుము. నీవు

చూచుచుండగనే యితనిని చంపెదను ఇతడేకాక యితని రాక్షసగణమంతయు వచ్చినను నన్నెదిరించలేరు నాశరీరబలము చూడుము. నాపరాక్రమము నిప్పుడు ప్రత్యక్షముగా చూచెదవుగాక.' అని చెప్పెను అమాటకు హిడంబ యిట్లనెను. 'మీస్వరూపము దేవతలను పోలియున్నది. నేను మిమ్ము తిరస్కరించుటలేదు. మానవులను ఈరాక్షసుడు హింసించుట అనేకపర్యాయములు నేనుచూచినాను కనుకభయపడుచున్నాను."

ఆయిరువురి సంభాషణమును వినుచునే హిడింబాసురుడు వారిని సమీపించెను. తనచెల్లెలి సుందరమైన మాయా రూపమును చూచి, ఆ పురుషునియందు కామవశురాలై యుండుటను కనిపెట్టి మిక్కిలి క్రుద్ధుడయ్యెను. పండ్లు పటపటకొరకుచు కన్నులవిప్పులు గ్రక్కుచు చెల్లెలితో 'దుష్టరాక్షసీ! మనకులమున కంతటికిని అపయశము కలిగించుచు మానవునికామించి నాకు విఘ్నమును కలిగించెదవా! ఇప్పుడు వీరిని నిన్ను చంపెదను చూడుము' అని వారిపై బడెను వెంటనే భీముడువానితో 'నాతోపోరినన్ను గెలిచి వీరివైపుచూడుము. నిన్నిప్పుడే యమలోకమునకుపంపి ఈవనమును నిష్కంటకముచేసెదను.' అని చెప్పి ఆరాక్షసునితో బాహుయుద్ధమునకు పూనుకొనెను. ఆయిరువురును ద్వంద్వ యుద్ధము చేయుదొడగిరి. ఆ ధ్వనికి యుధిష్ఠిరాదులు మేలుకొనిరి. ఎదురుగ నిలుచియున్న సుందరాంగిని చూచిరి. 'నీవెవరు!' అని కుంతి యడగెను. హిడింబ జరిగినసంగతి చెప్పెను. భీమ, హిడంబుల ద్వంద్వయుద్ధముచూచుచు అన్నకు సహాయము చేయుటకు అర్జునుడు ముందునడచెను భీముడువారించి రాక్షసునితో ఏకాకిగాపోరాడి వాని సంధిబంధములుపొడిచేసి క్రిదపడవేసి మెడనులిమిచంపుచు 'దురాత్మా! నీవువ్యర్థజీవివి నిన్ని బాహుయుద్ధములో హతమార్చితిని. కనుక నీకు వీరస్వర్గముకూడ లభించదు. (బాహుయుద్ధములో చచ్చినవారికి వీరస్వర్గము లభించదు. అని రణధర్మము). అనిచెప్పి వానినిచంపెను అందరుహర్షించిరి అచ్చటనే సమీపముననున్న నగరమునకు పాండుపుత్రులు హిడింబతోను, తల్లితోను ప్రయాణమైపోయిరి.

హిడింబ భీముని సమీపించి, 'నిన్ను ప్రేమించినాను. నన్ను చేపట్టి నా యిష్టార్థమును నెరవేర్చుము' అని వేడుకొనెను. భీముడు మాయావులైన రాక్షసులను నమ్మకూడదని కోపించి, దుష్టరాక్షసీ! నిన్నుగూడ నీయన్నకడకే పంపెదనని అమెనుచంపబోయెను. యుధిష్ఠిరుడు వారించి 'సోదరా! నీవుక్రుద్ధుడవై యున్నను స్త్రీవధ పాపమునకొడిగట్టకుము. విజ్ఞులు శరీరనాశమైనను సహించవచ్చునుగాని ధర్మనాశమునొనర్పకూడదు. స్త్రీవధ మహాపాపము.' అని చెప్పెను. భీముడంగీకరించెను.

హిడింబ దీనమై కుంతికడకుపోయి, 'తల్లీ! నేను నిక్కముగా నీపుత్రుని ప్రేమించినాను కామబాధచేత తపించుచున్నాను స్త్రీలకు కామబాధ యెంతదుర్భరమో నీవు గ్రహింపగలుగుదువు. కనుక నన్నునుగ్రహించి భీమునితో నాకువివాహముచేయుము. అతని యనుగ్రహమువలన సుతుని కని ఆ పుత్రునితో స్వేచ్ఛగా పోయెదను. మీకు సంకటములు కలిగినప్పుడు తలచినంతనే వచ్చి నేను, నా పుత్రుడు తోడుపడెదము. మీయిష్టమువచ్చినచోటికి సులభముగా నేను మిమ్ము చేర్చెదను. ధర్మానుసరణము చేయువారు, ఆపదను తరించుటకు ఏయుపాయమునైనను అనుసరించవచ్చును ఆపత్తివచ్చినప్పుడు ధర్మరక్షణము చేయువాడే ఉత్తమ ధర్మాత్ముడుగా భావించబడును. పుణ్యమే ప్రాణధారణము చేయును పుణ్యము ప్రాణదాతయనబడును కనుక ధర్మాచరణము చేయుటకు అనువైన యేయుపాయము నాశ్రయించినను తప్పులేదు' అని హిడింబచెప్పెను.

ఆమె ధర్మవచనములకు యుధిష్ఠిరుడు సంతుష్టుడై ఆమె కోరికను భీమునితో అంగీకరింపజేసెను 'భీమసేనునితో నీవు పగలెల్ల విహరించి సాయంసమయమునకు మావద్దకు పంపుచుండుము' అని హిడింబకు చెప్పెను. ఆమాటకు భీమసేనుడు గూడ అంగీకరించి హిడింబతో, 'రాక్షసీ! నీకు పుత్రోత్పత్తియగు వరకు నీతో విహరించుచుండెదను. ఆతరువాతనిన్ను వీడెదను.' అనిచెప్పెను. ఆమాటకు హిడింబ అంగీకరించి భీమసేనునితో ఆకాశముపైకి ఎగిరిపోయెను. అనేక రమ్యవనములలో, సరస్సీమలలో, మణికందరములలో సర్వాభరణశోభితయై భీమసేనునితో యథేచ్ఛగా విహరించి హిడింబ ఒక మహాబలశాలియైన పుత్రునికనెను. అతడు బాలుడైనను మనుష్యులలో యౌవనవంతుడుగా రూపొంది భీమకాంతములైన అవయముల శోభతో తేజరిల్లుచుండెను. అతడు తల్లిదండ్రులకు పాదవందనము చేసెను. అతనిఘటము (తల) పైన కచములు (వెంట్రుకలు) లేవుకనుక 'ఘటోత్కచుడు' అనుపేరుతో హిడింబా భీములు అతనికి నామకరణముచేసిరి

'భీమసేనునితో తానుచేసికొన్న ఒడంబడిక పుత్రోత్పత్తితో తీరిపోయినదని' హిడింబ పాండవులకుచెప్పి వారితో సెలవు తీసికొని, వారు తనను తలంచినప్పుడు తిరిగి వచ్చెద నని చెప్పి యథేచ్ఛగా వెడలిపోయెను.



ఘటోత్కచుడు తండ్రులకు, పితామహికి నమస్కరించి నేను ఏమిచేయవలెనో ఆజ్ఞాపింపుడు, అనిప్రార్థించెను, 'నాయనా నీవు కురువీరులలో శ్రేష్ఠుడవగుదువు. మాకు జ్యేష్ఠ పుత్రుడవు. మాహితమును కోరి మేము తలచినప్పుడు మాకడకు వచ్చుచుండును.' అని యుధిష్ఠిరుడు చెప్పెను. రాక్షసులలో రావణ, కుంభకర్ణ,

హిరణ్యాక్ష, హిరణ్యకశిపులతో సమానమైన బలశాలినగు నేను. మీహితమునకోరియే సర్వదా మెలగుచుండెను.' అనిప్రతిజ్ఞ చేసివెడలిపోయెను ఇంద్రుడు. తాను కర్ణునకిచ్చిన శక్త్యాయుధము దెబ్బకుతట్టుకొను శక్తిగలవాడుగా ఘటోత్కచుని సృజించెను.

తరువాత పాండవులు వనములలో తిరుగుచు ననేక దేశములను గడచిపోయిరి. జడలను వల్కములను ధరించి తాపసులుగా సంచరించుచుండిరి తల్లిని ఒక్కరొక్కరుగా భుజములపైన మోసికొనుచు పోవుచుండిరి బ్రాహ్మణ వేషములోనుండి వేదవేదాంగముల నభ్యసించుచు నీతిశాస్త్ర కోవిదులై యుండిరి. వ్యాసభగవానుడు వారికి ప్రత్యక్షమయ్యెను. ఆయనకు అందరు నమస్కరించి అంజలిబంధులై నిలిచిరి. "ఇదివరకే మీకు ధార్తరాష్ట్రులవలనగలిగిన కష్టములు నాకుతెలిసి మీకు హితముగోరి వచ్చితిని. ఈ కష్టమంతయు మీ సుఖముకొరకే వచ్చినది. దుఃఖింపకుడు. నాకు మీరు, ధార్తరాష్ట్రులు సమానులే యైనను మీరు దీనులు, ధర్మాత్ములు గనుక మీయెడల నాకు ఎక్కువ స్నేహము గలదు. కనుక మీకొక హితము చెప్పెదను. ఇక్కడికి సమీపమునందు 'ఏకచక్ర' యను పురముకలదు. అక్కడికిపోయి మీరు నివసించుడు ' అనిచెప్పి వారి నా నగరమునకు తోడ్కొని పోయి వ్యాసుడచట నొక బ్రాహ్మణ గృహమునుంచి కుంతితో నిట్లనెను. ''నీపుత్రులు సమర్థులు, జ్యేష్ఠుడు అధిక ధర్మాత్ముడు. నీసుతులు భూమండలములోని మనుజుల నందరిని పాలించగలరు. రాజసుయాశ్వమేధయాగములు చేయగలరు. తండ్రితాతల రాజ్యమును చాలకాలము పాలించగలరు నీవు చింత చేయకుము, అనిచెప్పి యుధిష్ఠిరునితో 'నేనువచ్చి తిరిగి మీకు కనపడెదను.' అని చెప్పి వెడలిపోయెను.

## బకాసురవధ

ఏకచక్రపురములో పాండవులు మాధుకర వృత్తిచే బిచ్చమెత్తుకొని జీవయాత్ర గడపుచుండిరి. తమ సద్గుణములచేత నచట నందరికి ప్రియులైరి. ప్రతిదినము సాయంకాలమువరకు వారైదుగురు భిక్షావృత్తిచేత తెచ్చిన అన్నమంతయు తల్లికి నివేదించుచుండిరి. ఆమె ఆమొత్తములో సగము విభజించి భీమసేనునకిచ్చుచుండెను. మిగిలినసగము అందరును భుజించుచుండిరి.



ఒకనాడు నలుగురుమాత్రము భిక్షమునకుపోయిరి. భీమసేనుడు కార్యవశము చేత తల్లికడనే యుండెను. అప్పుడు వారున్న బ్రాహ్మణ గృహములో నొక యార్తనాదము వినబడెను. ఆ దుఃఖధ్వనినివిని సహించలేక కుంతి భీమసేనునితో 'పుత్రా! మనము దుర్యోధనాదులబాధను తప్పించుకొనివచ్చి సుఖముగా ఈ యింట కాలము గడపుచున్నాము వీరు మననెంతయో యాదరించుచున్నారు. వీరికేదో కష్టమిప్పుడు సంప్రాప్తమైనట్లున్నది. ఉపకారికి ప్రత్యుపకారముచేయుట మన కర్తవ్యము. కనుక నీవు వీరిదుఃఖమును పోగొట్టుము.' అనెను. 'అమ్మా! వారిదుఃఖకారణమేమో కనుగొనుము. ఎంతదుష్కరమైనను నేను సాధించి వారికి సుఖము కలిగించెదను.' అనిభీముడనెను.

అప్పుడు కుంతి ఆబ్రాహ్మణదంపతుల దుఃఖమును విని సహించలేక, అరచుచున్న దూడలగదిలోనికి పుత్రేషణచేతపోవు ఆవువలె వారి అంతఃపురములోనికి పోయి' దుఃఖించుచున్నవారిని చూచెను,

ఇంటిలోపల ఆబ్రాహ్మణుడీవిధముగా దుఃఖించుచుండెను :-- ''నిస్సారము, పరాధీనమైన జీవితము వ్యర్థము. ఇది దుఃఖమూలము. జీవితములో దుఃఖములు తప్ప మరియేమియులేవు. ధర్మార్థకామములను సేవించుచున్నవారికి అవి వీడిపోయినప్పుడు తిరిగి దుఃఖమే ప్రాప్తించును. మోక్షమొక్కటే సుఖమందురు. అదిలభించుటకల్ల. అర్థము నరకప్రాప్తికి హేతువు. ధనాశ దుఃఖమును గలిగించును. లభించిన ధనమును రక్షించుట అతి దుఃఖకరము. దానినాశమువలన అత్యంత దుఃఖముకలుగును. ఈ యాపదనుండి విముక్తి కలుగుటయెట్లు ? యువకుడైన యీ చిన్నిబాలునెట్లువిడుతును ? సహధర్మచారిణివై నిన్నుగాని, ఉభయ కులతారకురాలైన కూతునుగాని యెట్లు విసర్జింతును ? ఇదిగాక, కూతురనునది నా వస్తువు కాదు. ఆమెభర్తకు సమర్పించుటకై బ్రహ్మదేవుడు ఆమెను నావద్ద న్యాసముగా నుంచినాడు. నేనే మరణింతమన్నచో నాయనంతరము కుటుంబమును పోషించువా రెవరున్నారు ? కనుక అందరము ఒకేసారి మృత్యుముఖమునకు పోవుటతప్ప మార్గాంతరము లేదు.''

( సశేషము )

# సమాచారశాఖ అధ్వర్యంలో సాంస్కృతిక కార్యక్రమాలు



ఉజ్బెక్ సాంస్కృతికబృందం నాయకురాలు శ్రీమతి ముకర్రమాతురున్ బాయివా భారత, సోవియట్ దేశాల మధ్యగల సౌహార్ద్రపూర్వకమైన సంబంధాలను గూర్చి మాట్లాడారు



సుప్రసిద్ధ హిందుస్తానీ గాత్ర సంగీత విద్వాంసులు శ్రీ మునవ్వర్ అలీఖాన్. రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా వీరి గాత్ర సంగీత కార్యక్రమం సమాచార, పౌర సంబంధశాఖ అధ్వర్యంలో జరిగింది



హైద్రాబాదు గాంధీ భవన్‌లో 1967 జనవరి 23 వ తేదీన మహారాష్ట్ర బృందంవారు సాంస్కృతిక కార్యక్రమాలు సమర్పించారు. ప్రదర్శనల అనంతరం ఆంధ్రప్రదేశ్ హైకోర్టున్యాయమూర్తి శ్రీ గోపాలరావు ఎక్బోటే ప్రసంగిస్తున్న దృశ్యం



మహారాష్ట్ర సాంస్కృతిక బృందం నాయకురాలు శ్రీమతి సుధా కర్మార్కర్ ఆ సందర్భంలో మాట్లాడారు



ఒక నాట్యభంగిమ



రాష్ట్ర సమాచారకేంద్రం 1967 జనవరి 23 వ తేదీన హైదరాబాదులో నిర్వహించిన విచిత్ర వేషధారణ పోటీలో పాల్గొన్న అభ్యర్థులు.



రాష్ట్ర సమాచారకేంద్రం నిర్వహించిన రిపబ్లిక్ దినోత్సవ పోటీలలో గెలుపొందిన బాలబాలికలకు శ్రీమతి కె. ఎన్. అనంత రామన్ బహుమతులు అందజేశారు. ప్రధాన కార్యదర్శి, సమాచారశాఖడైరెక్టరులను కూడా ఈ చిత్రంలో చూడవచ్చు



కేస్లాపూర్ జాతర సందర్భంలో ఏర్పాటుచేసిన పశు ప్రదర్శనంలో ఒక మేలు జాతి ఎద్దును పరిశీలిస్తున్న రెవిన్యూబోర్డు రెండవ సభ్యులు శ్రీ జె. పి. ఎల్ గ్విన్, ఐ.సి.ఎస్.



కేస్లాపూర్ జాతరసందర్భంలో నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాలలో గెలుపొందిన వారికి శ్రీమతి జె. పి. ఎల్. గ్విన్ బహుమతులు పంచారు



కేస్లాపూర్ జాతర దర్బార్ హాలులో గోండు తెగవారు



ఆదిలాబాదు జిల్లా కేస్లాపూర్‌లో ఇటీవలి జాతర సందర్భంలో నగోబా ఆలయంలో కొండజాతి ప్రజలు



శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఎడ్మినిస్ట్రేషన్ భవనానికి 1967 జనవరి 21వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టం ఏ. థానుపిళ్లై ప్రారంభోత్సవం చేశారు



గరుడ వాహనంపై వేంచేపు చేసిన శ్రీరాముడు



వైకుంఠ ఏకాదశినాడు శ్రీరామచంద్రుడు వేంచేపు చేసిన సేవను భద్రాచలం పురవీధులగుండా ఊరేగించారు



కుమారి బి. ఎన్. రమాదేవిని శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి అభినందిస్తున్న దృశ్యం



కుమారి బి.ఎన్. రమాదేవి "అరంగేట్రమ్" ప్రదర్శన జరిపినప్పటి ఫోటో. శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి, శాసనమండలి అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, మంత్రి శ్రీ బి వి. గురుమూర్తి, నటరాజ రామకృష్ణ తదితరులను కూడ చిత్రంలో చూడవచ్చు



శ్రీమతి సి. బి. రావు ఫిబ్రవరి 2న కరీంనగర్‌లో సంగీత, నాటక పోటీలలో నెగ్గినవారికి బహుమతులు ప్రదానంచేశారు



శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి 1967 జనవరి 10వ తేదిన హైదరాబాదులో అఖిల భారత వస్తుప్రదర్శనలో దేవాదాయ, ధర్మాదాయ శాఖవారి స్టాల్‌కు ప్రారంభోత్సవం చేశారు



మంత్రి శ్రీ తోట రామస్వామి, 1966 నవంబరు 5వ తేదీన యునెస్ సహాయంతో ఏర్పాటు అయిన హైదరాబాదు డెయిరీ యూనిటు ప్రారంభోత్సవం సందర్భంలో అధ్యక్షోపన్యాసం ఇచ్చారు. శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు



గద్వాలలోని ప్రభుత్వ ఉన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ ఎం. సూరిరెడ్డికి, 1966 డిసెంబరు 3న రాష్ట్రపతి ఉపాధ్యాయుల జాతీయ అవార్డును (1966_67) ప్రదానం చేశారు



భారత ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు, 1966 డిసెంబరు 31న హైదరాబాదులోని హైకోర్టులో "భారతరాజ్యాంగం క్రింద చట్టబద్ధమైనపాలన" అనేఅంశంపై ప్రసంగించారు



శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం 10 వ స్నాతకోత్సవం 1966 జనవరి 21 న తిరుపతిలో జరిగింది



ఆంధ్రప్రదేశ్ గవర్నరు, 1967 ఫిబ్రవరి 3 న హైదరాబాదులోని ఉస్మానియా వైద్యకళాశాలలో 22 వ అఖిల భారత క్షయవ్యాధి, హృదోగాల నివారణ కార్యకర్తల సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు



గవర్నరుతో ఎన్. సి. సి. కేడెట్లు



ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, 1967 జనవరి 2 న సికిందాబాదులో పారిశ్రామిక శిక్షణ సంస్థ నూతన భవనాలకు శంకుస్థాపన చేశారు. మంత్రి శ్రీ బి.వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు. విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఎన్. రమేషన్, ఐ. ఎ. ఎస్ ను కూడ చిత్రంలో చూడవచ్చు

'ప్రజాస్వామ్య సుస్థిరతకు'

# ఆంధ్రప్రదేశ్‌లో నాలుగవ సార్వత్రిక ఎన్నికలు



విజయవాడలోని ఒక పోలింగ్ కేంద్రంలో స్త్రీ ఓటర్లు



ఒక పోలింగ్ కేంద్రంలో వృద్ధ స్త్రీ తన ఓటును వినియోగించుకోవడంలో సహాయం అందజేస్తున్న దృశ్యం

భారత దేశంలో ప్రజాస్వామ్యం వేళ్ళూనినదని యీ నాలుగవ సార్వత్రిక ఎన్నికలు రుజువు చేశాయి. ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామిక దేశమైన భారత దేశంలో మరే దేశపు ఎన్నికలలోను కనుపించని ఉత్సాహం, వింతలు, విశేషాలు ప్రదర్శింప బడినాయి



ఒక పోలింగ్ కేంద్రంలో లంబాడీ స్త్రీ ఓటర్లు



క్రైస్తవ సన్యాసినులు తమ ఓటును వినియోగిస్తున్న దృశ్యం




సచివాలయంవద్ద నెలకొల్పబడిన ఆంధ్రప్రదేశ్ మ్యాప్ దృశ్యం. కంట్రోలు రూంనుండి ఎన్నికల ఫలితాలు తెలిసిన వెంటనే వాటిని యీ మ్యాపులో ప్రదర్శించారు



సమాచార, పౌర సంబంధశాఖవారు, ప్రత్యేకంగా నిర్మించిన బోర్డులపై ఎన్నికల ఫలితాలను ఎప్పటికప్పుడు ప్రదర్శించారు. డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, సమాచారశాఖడైరెక్టరు, ఇతర శాఖాధికారులతో యీ బోర్డులను పరిశీలిస్తున్న దృశ్యం

## మన మహోన్నత పర్వదినం

# రిపబ్లిక్ దినోత్సవం



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జనవరి 26న కొత్తఢిల్లీలో, రాష్ట్ర అవతరణ తర్వాత 10 సంవత్సరాలలో ఆర్థిక రంగంలో రాష్ట్రంసాధించిన అభివృద్ధిని విశదంచేసే అలంకృత శకటాన్ని ప్రదర్శించింది



ఆంధ్రప్రదేశ్ రిపబ్లిక్ దినోత్సవ బృందం, భారత రాష్ట్రపతితో కలిసినప్పటి చిత్రం



ప్రధానమంత్రితో

# హైదరాబాదులో



కొత్తఢిల్లీలో రిపబ్లిక్ దినోత్సవంనాడు బృందంసభ్యులు ట్రోఫీ అందుకున్నారు



ఆంధ్రప్రదేశ్ గవర్నరు, రిపబ్లిక్ దినోత్సవంనాడు సికిందాబాదు పెరేడు మైదానంలో ప్రసంగిస్తున్న దృశ్యం



ఆంధ్రప్రదేశ్ గవర్నరు రిపబ్లిక్ దినోత్సవంనాడు పెరేడు మైదానంలో గౌరవ వందనం స్వీకరించారు



రిపబ్లిక్ దినోత్సవం పెరేడును తిలకిస్తున్న ప్రేక్షకుల ఒకభాగం. శ్రీమతి పట్టం ఎ. థానుపిళ్ళె, ముఖ్యమంత్రి, శ్రీమతి రాఘవమ్మా బ్రహ్మానందరెడ్డి, జకోస్లోవేకియా ఉపప్రధానిని చిత్రంలో చూడవచ్చు



రిపబ్లిక్ దినోత్సవంనాడు విశిష్టసేవా పతకాలనుపొందిన పోలీసు అధికారుల గ్రూపుఫోటో



రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా రాజభవన్‌లో విందుజరిగిన దృశ్యం



ముఖ్యమంత్రిని అభినందిస్తున్న ప్రజలు





సన్మానం : కాంగ్రెసు శాసనసభాపార్టీ నాయకులుగాఎన్నికైన శ్రీ బ్రహ్మానందరెడ్డిని మార్చి 8వ తేదీన "ఆనంద నిలయం" లోఆయన అభిమానులు అభినందనలు తెలియజేస్తున్న దృశ్యం

# రాజ్ భవన్‌లో ప్రమాణ స్వీకారోత్సవం



రాజభవన్‌లో ప్రమాణస్వీకారోత్సవం. ప్రభుత్వప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఎస్. అనంతరామన్, ఐ.సి.ఎస్: మార్చి 6వ తేదీన హైదరాబాదులోని రాజభవన్‌లో నూతన మంత్రివర్గం నియామకానికి సంబంధించిన ఉత్తర్వును చదువుతున్న దృశ్యం



ఆంధ్రప్రదేశ్ గవర్నరు, మార్చి 6వ తేదీన రాజభవన్‌లో నూతన మంత్రివర్గం సభ్యులతో పదవీ ప్రమాణ స్వీకారం చేయించారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రమాణస్వీకారంచేస్తున్న దృశ్యం



డాక్టర్ ఎం. చెన్నారెడ్డి పదవీ ప్రమాణ స్వీకారం చేస్తున్న దృశ్యం



శ్రీ పి. తిమ్మారెడ్డి పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం



శ్రీ వి. బి. రాజు పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం



శ్రీ తోట రామస్వామి పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం



శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం



శ్రీ జె. వి. నర్సింగరావు పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం



శ్రీ పి. వి. నరసింహారావు పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం







శ్రీ ఎన్. చెంచురామా నాయుడు పదవీ ప్రమాణంచేస్తున్న దృశ్యం



శ్రీ కె. విజయభాస్కరరెడ్డి పదవీ ప్రమాణం చేస్తున్నదృశ్యం



శ్రీ ఆర్. రామలింగరాజు పదవీ ప్రమాణం చేస్తున్న దృశ్యం



శ్రీ ఎస్ సిద్దారెడ్డి పదవీ ప్రమాణం చేస్తున్నదృశ్యం





రాజభవన్‌లో మార్చి 6వతేదీన నూతన మంత్రివర్గం ప్రమాణ స్వీకారోత్సవానికి హాజరు అయిన
ప్రముఖుల రెండు దృశ్యాలు

స్వాతంత్ర్యం మనజన్మహక్కు, మనజీవనసంగీతాన తొలిరుక్కు

# సమరాకారం

బాలగంగాధర తిలక్

> తనసజీవ రచనల ద్వారా యువలోకానికి నవోత్తేజం కలిగించిన ఉత్తమకవి ఇటీవలనే మరణించిన బాలగంగాధర తిలక్. మన హృదయక్షేత్రాలపై క్రొంగ్రొత్త కవితా గంగను ప్రవహింప చేసిన కవిభగీరథుడీయన. తిలక్ కవితా ప్రయాణం ఎప్పుడూ "ఎడదలో కరుణ జడి వానలా కురుస్తున్న చోటికి, బ్రతుకు టింటిలోకి వెలుగు వాకిళ్లు తెరుచుకునే చోటికి". చైనా దురాక్రమణ సమయంలో ఈయన రాసిన ఒక గేయం ఈ క్రింద ప్రచురిస్తున్నాము.

### ఒక గంధర్వుని గొంతు :

హిమాలయం పాద భూములలో
ఎవరివీ రాక్షసుల అడుగులు
హిమాలయం మంచుగుండెల మీద
ఎందుకీ నెత్తుటి మడుగులు

### అశరీర వాణి :

అర్ధరాత్రివేళ శార్దూలాలు తిరగడం మానుకొన్నాయి
అదేవేళ చైనా హంతకుడు మేల్కొన్నట్టు తెలిసికొని,
అర్ధరాత్రివేళ కొరివి దెయ్యాలు సంచార మాపుచేశాయి
అదేవేళ వాడు పొలిమేరలో దుర్గంధంలా వ్యాపిస్తున్నాడని.

### చరిత్ర గొంతు :

అవనీతలంమీగ హాహాకార వృక్షాగ్రాల మీద
చైనా రాబందులు వ్రాలి చప్పుళ్లు చేస్తున్నాయి
ఆనంద మలయశైలంమీద ఆశీవిషాలు క్రమ్ముకొని
చైనా ద్విజిహాగ్రాలతో కాలకూటం చిందుతున్నాయి
భారతావనికే కాదు సర్వ ప్రపంచానికీ
చైనావాడు చెప్పలేనంత కీడు!

### మరణించిన సైనికుని గొంతు :

ఏమరకు ఏమరకు
స్వతంత్రం మనకి జన్మహక్కు
మన జీవన సంగీతాన తొలి రుక్కు
ఈ భారతం మనస్వార్జితం
మన నెత్తురోడ్చికొన్న ఫలితం
మన తపస్సు పండినచోటు
మన మహస్సు విరిసిన చోటు
ఏమరకు ఏమరకు

ఇదంధరాత్రి విడిచెను నాడు భగవత్సింగు ప్రాణం
ఇతఃపూర్వమే చిందెను మహాత్ముని పవిత్ర రుధిరం
ఈ ఎరుపు లిపిని మరచి మైమరపులో పడకు
ఈ యిరుసు వదలి చెల్లాచెదురుగా పోకు
ఈ నేల విడిచిపోతే ఏముంది మిగిలింది నీకు
ఇది మన ఉనికి కేంద్రం మన మనికి పరిధి
మన ఆశయాల కైవారం.
ఏమరకు ఏమరకు
ఎదిరిపొంచి ఉన్నాడు హిమాలయాల చాటున
ఏటవాలు జెండాల మోసపు నీడల మాటున
నీచమైన మాటలకి గ్రుచ్చిన యీటెల్ని విసిరే వేటున
వాడీశతాబ్దపు చెంగజ్‌ఖాన్, రెండవ హిట్లరు, హిరణ్యకశిపుడు
వాడు చరిత్ర చక్రానిలోగిలిమధ్య వమనం చేసే నీచుడు
వాడు ధరిత్రి సుందరవదనం మీద మసిపూసే మారీచుడు
ఏమరకు ఏమరకు
వాడి సిద్ధాంత శుద్ధాంతాల దరికి వెళ్ళకు
మేల్ముసుగు తాల్చిన విషకన్యల మధ్య నిలవకు
వాడికి ప్రాణం విలువ తక్కువ, సూత్రాలమీద మక్కువ
వాడు మూర్ఖుడు దురావేశ పరుడు జిత్తుల మారి
వాడి బుర్ర కొకటే త్రోవ, వేరొకవైపు లేదు దారి

### భవిష్యద్వాణి :

నడు, నడుం కట్టి నిలబడు
నగంలాగ నభం లాగ
నడు, కండ చరచి పైబడు
ఉడుములాగ పిడుగులాగ
నడుం విరిగి బలం సురిగి
నేల కరచి శత్రువొరగ
జయం మనది జయం మనది
జయం శ్రియం మనది మనది



# అమెరికాలో తెలుగు చదువు

డాక్టర్ అడపా రామకృష్ణరావు

"దేశభాషలందు తెలుగు లెస్స" అని మొదట ఘంటా పథంగా చాటి చెప్పినవాడు క్రీడాభిరామకర్త. ఆ మాటనే తరువాత సాధికారంగా ఏకంగా పెరుమాళ్ళచేత నే పలికించాడు కృష్ణరాయలు. ఆంధ్రత్వమూ, ఆంధ్రభాషా అనల్పమైన తపస్సుచేతనే ప్రాప్తిస్తాయని అప్పయ్య దీక్షితులుగారన్నారు అజంతభాష గనుక ఎంతైనా విన సొంపుగా ఉన్నదని తెలుగును Italian of the East అని పాశ్చాత్యులు మెచ్చుకున్నారు. ఊరికే మెచ్చుకోవడమే కాదు వారిలో కొందరు — ఎ. డి. కాంబెల్, బిషప్ కాల్డ్వెల్, సి. పి. బ్రౌన్ వంటి విజ్ఞులు — తెలుగు నేర్చుకుని ఈ భాషకూ, సాహిత్యానికీ ఎన్నదగిన సేవకూడా చేశారు. ఇక్కడ ఉద్యోగం చాలించుకుని స్వదేశానికి తిరిగి వెళ్ళాక సి. పి. బ్రౌన్ కొంతకాలంపాటు లండన్ విశ్వవిద్యాలయంలో ఆంధ్ర భాషా బోధకు ఆచార్యపీఠం అధిష్ఠించాడు. ఈనాడు అమెరికా దేశంలోకూడా కొన్ని విశ్వ విద్యాలయాలలో తెలుగుభాషను బోధిస్తున్నారు భాషా తత్త్వ శాస్త్రంలో కృషిచేస్తున్న అమెరికన్ పండితులు ఆంధ్రదేశం వచ్చి ఈ భాషను నేర్చుకుని వెళ్ళి. దీనిని తమదేశంలో బోధించడమేగాక, ఈ భాషా ధ్వనులను గురించి, వ్యావహారిక భాషా వ్యాకరణ విశేషాలను గురించి పరిశోధనకూడా సాగిస్తున్నారు.

## సంస్కృత అనువాదాలు

అసలు అమెరికా దేశస్థులకు మన దేశభాషలను గురించి, సాహిత్య సంపదను గురించి తెలుసుకోవాలనే అభిలాష కలిగింది 19వ శతాబ్దపు తొలి రోజులలో. 18వ శతాబ్దంలో సర్ విలియమ్ జోన్స్ వంటి విద్వాంసులు సంస్కృతానికీ, గ్రీక్, లాటిన్ వంటి పాశ్చాత్య భాషలకూ గల సన్నిహిత సంబంధాన్ని గుర్తించి, తులనాత్మక భాషాతత్త్వ పరిశోధనకు రాచబాట వేశారు వారి కృషివల్లనే కలకత్తాలో రాయల్ ఏసియాటిక్ సొసైటీ వెలిసింది. ఆ సంస్థ పక్షాన వేదాలను, ఉపనిషత్తులను, భగవద్గీతను, మనుస్మృతిని, విష్ణు పురాణాన్ని, శాకుంతల, మేఘ సందేశాది కావ్య నాటకాలను ఇంగ్లీష్ లోనికి అనువదించి ప్రకటించారు. ఆరోజులలో అమెరికాలోని బోస్టన్ రేవునుంచి వ్యాపార సంబంధంగా కలకత్తాకు వచ్చే నౌకలు తిరుగు ప్రయాణంలో మనదేశంనుంచి సుగంధ ద్రవ్యాలతోబాటు సంస్కృత గ్రంథాల అనువాదాలనుకూడా తీసుకువెళ్ళడం జరిగింది. ఆ విధంగా అమెరికన్ మేధావులకు భారతీయ తత్త్వశాస్త్రం పరిచయమయింది క్రమంగా అమెరికన్ విశ్వ విద్యాలయాలలో సంస్కృత భాషా బోధకు, భారతీయ తత్త్వ శాస్త్రాధ్యయనానికి పీఠాలు నెలకొన్నాయి. లాన్మన్ వంటి పండితుల కృషి ఫలితంగా Harvard Oriental Series లో సంస్కృత గ్రంథాలకు ప్రామాణికమైన అనువాదాలు అమెరికాలో వెలువడ్డాయి.

ఈ విధంగా అమెరికన్ విశ్వ విద్యాలయాల్లో సంస్కృత బోధకు అవకాశాలు గత శతాబ్దంనుంచీ వున్నా ఇతర భారతీయ భాషలను బోధించడానికి ఏర్పాట్లు మాత్రం ఇటీవల రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాతనే జరిగాయి. ఇందుకు చాలా కారణాలున్నాయి ప్రపంచంలోని వర్ధమాన దేశాలతో సన్నిహిత సంబంధా లేర్పరచుకోవడానికి వీలుగా అమెరికన్ పౌరులు విదేశ భాషలను నేర్చుకోవడంకోసం ఆ దేశ ప్రభుత్వం ఉపకార వేతనాలిచ్చి ప్రోత్సహించడం ముఖ్యకారణం. ప్రభుత్వంతోబాటు కొన్ని వైజ్ఞానిక సంస్థలుకూడా ఇందుకు ఆర్థికంగా తోడ్పడుతున్నవి. స్వరాజ్యం వచ్చినప్పటినుంచీ మనకుకూడా విదేశాలతో ఎక్కువగా సంబంధా లేర్పడ్డాయి. మన విద్యార్థులు విదేశాలకు — ముఖ్యంగా అమెరికా దేశానికి — వెళ్ళి చదువుకోవడానికి మునుపటికంటె అవకాశాలు హెచ్చాయి. ఇందువల్లకూడా మన దేశ భాషలను అమెరికాలో బోధించడానికి సదుపాయం కలిగింది. అమెరికన్ పండితులు ప్రస్తుతం భాషా శాస్త్రంలో విశేషించి కృషిచేస్తూ వుండడంచేత వారిదృష్టిని మన దేశభాషలాకర్షించడంకూడా ఇందుకొక కారణం

## తెలుగు భాషాబోధన

సంస్కృతంతోబాటు అమెరికన్ విశ్వవిద్యాలయాలలో ఇటీవల హిందీ, ఉర్దూ, తెలుగు, బెంగాలీ, తమిళం, కన్నడం, మళయాళం వంటి భారతీయ భాషలను బోధిస్తున్నారు. వీటిలో తెలుగు నేర్పుతున్నవి ఐదు విశ్వ విద్యాలయాలు — విస్కాన్సిన్, పెన్సిల్వేనియా, కాలిఫోర్నియా, టెక్సాస్, కార్నెయిల్ ఈ ఐదుచోట్ల తెలుగు నేర్చుకున్న అమెరికన్ అధ్యాపకులున్నారు. అంతేగాక ఆ విశ్వ విద్యాలయాల ఆహ్వానంమీద మన దేశస్థులుకూడా కొందరు అక్కడికి వెళ్ళి ఒకటి రెండేళ్ళపాటు మన భాషను బోధిస్తున్నారు.

తెలుగు నేర్చుకునే అమెరికన్ విద్యార్థులను స్థూలంగా రెండు వర్గాలుగా విభజించవచ్చు. భాషా తత్త్వశాస్త్ర విద్యార్థులు మొదటి వర్గం. భాష వీరికి పరిశోధనకు మూల సాధనం తెలుగులోని ధ్వనులు, వాక్యనిర్మాణ పద్ధతి వీరిని విశేషంగా ఆకర్షిస్తున్నవి. ఇంగ్లీషులో "She is a beautiful woman" అనే వాక్యం తీసుకోండి. దానిలో Is

అనే క్రియ ముఖ్యం ఆ క్రియ లేకుండా ఆ వాక్యం నిర్మించ డానికి వీలుకాదు. కాని ఆ భావమే తెలుగులో చెప్పవలసి వచ్చినప్పుడు "ఆమె అందమైన మనిషి" అని అంటాము. ఈ వాక్యంలో క్రియ కనిపించదు. Is అనే ఇంగ్లీషు మాటకు సమానార్థకమైన పదమేదీ లేదు. తెలుగు భాషా స్వరూపం తెలియనివాళ్లు మాత్రం ఆ ఇంగ్లీషు వాక్యాన్ని అనువదించ మంటే "ఆమె అందమైన స్త్రీ అయివున్నది" అని అంటారు. "అయి వున్నది" అన్నమాట నేటి తెలుగు పలుకుబడికాదు. ఇటువంటి భాషాశాస్త్రవిశేషాలు ఆ పండితులను ఆకర్షిస్తున్నవి.

## తెలుగుభాషా అధ్యయనం

ఇక రెండవ వర్గానికి చెందిన విద్యార్థులు సత్వర ప్రయోజనం కోసం — ఏ కారణంచేతనో వెంటనే తెలుగు మాట్లాడడం నేర్చుకోవలసిన అవసరం కలిగి - ఈ భాషాధ్య యనాని కుపక్రమిస్తున్నారు. సాంఘిక శాస్త్రమో, ఖనిజ శాస్త్రమో, దేశ చరిత్రమో, ఏదో చదువుతూ, దానిలో ఆంధ్ర దేశానికి సంబంధించిన సమస్య నొకదానిని వీళ్ళెంచు కుంటారు. భద్రాచల ప్రాంతంలోని కోయజాతి ప్రజల స్థితి గతులను తెలుసుకోవాలని ఒకరు, వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమాన్ని గురించి పరిశోధించాలని మరొకరు. ఈ విధంగా ఆంధ్ర దేశానికివచ్చి కొంతకాలం పాటు ఇక్కడ వుండదలచి వీరు తెలుగు నేర్చుకుంటున్నారు. విస్కాన్సిన్ విశ్వ విద్యాలయంలో భారతీయ విద్యాశాఖలో M. A. డిగ్రీ పొందాలంటే అక్కడనేర్పే భారతీయ భాషల లో ఒకటి విధిగా నేర్చుకోవాలనే నియమంకూడా ఉన్నది.

ఇటీవల Peace Corps అనే స్వచ్ఛంద సేవక దళం ఒకటి అమెరికాలో ఏర్పడింది. ఈ శాంతిదళ సభ్యులు జట్లు జట్లుగా మన దేశానికి వస్తున్నారు. వీళ్ళలో కొందరు ఆంధ్రదేశంలో పని చేస్తున్నారు. ఇట్లా తెలుగు దేశానికి రాబోయే శాంతిదళ సభ్యులకోసం అమెరికన్ విశ్వవిద్యాల యాలు ప్రత్యేకంగా మూడేసి నెలలపాటు శిక్షణ తరగతులను నిర్వహిస్తున్నవి. వాటిలో తెలుగు భాష మాట్లాడడం, కొంత వరకు వ్రాయడం చదవడం నేర్పుతున్నారు. అమెరికన్ విశ్వ విద్యాలయాలలో తెలుగు భాషాబోధకు ఇదిగాడా ఒక కారణం. నేను విస్కాన్సిన్ యూనివర్సిటీలో ఇంగ్లీషు సాహి త్యంలో డాక్టరేట్ డిగ్రీకోసం పరిశోధన సాగించిన మూడేళ్ళ లోను రెండేళ్ళు అక్కడ అమెరికన్ విద్యార్థులకు తెలుగు నేర్పే అవకాశం నాకు కలిగింది. ఆ సందర్భంలోనే ఆంధ్ర దేశం రాబోతున్న శాంతిదళంలో ఒక జట్టుకు కూడా తెలుగు బోధించాను.

## కొత్త బోధన మార్గాలు

అమెరికన్ విశ్వ విద్యాలయాలలో విదేశ భాషలను నేర్పడానికి ఆధునిక యంత్ర సామగ్రిని కూడా ఉపయోగిస్తు న్నారు. నిత్య జీవితంలో తటస్థపడే సన్నివేశాలన్నిటికి తగిన సంభాషణలు కూర్చి తెలుగు మాతృభాషగాగల వ్యక్తులతో ఆ వాక్యాలను పలికించి టేప్‌మీద రికార్డుచేసి వుంచుతారు. పాఠం చెప్పేటప్పుడు భాషాస్వరూపం బోధించి ఈ వాక్యాలు నేర్పుతారు. వాటి అర్థం వివరిస్తారు. తరువాత విద్యార్థులు టేప్ సహాయంతో సరియైన ఉచ్చారణ తెలుసుకుని అనుకరించ డానికి ప్రయత్నిస్తారు. ఈ విధంగా అక్కడ రెండు మూడేళ్లు తెలుగు నేర్చుకున్న అమెరికన్ విద్యార్థులు నిఘంటువుల సహాయంతో వ్యావహారిక భాషలోవున్న పుస్తకాలనూ, పత్రికలనూ స్వతంత్రంగా చదివి అర్థంచేసుకునేపాటి భాషా జ్ఞానం గడించగలుగుతున్నారు.

తెలుగు నేర్పడానికి తగిన సాధన సామగ్రిని అమెరికన్ విశ్వ విద్యాలయాలు సమకూర్చుకుంటున్నవి. అక్కడి విద్యార్థులకోసం కొన్ని వాచకాలను సిద్ధంచేశారు. భాషతో బాటు ఆధునికాంధ్ర సాహిత్యపు తీరుతెన్నులను గురించి బోధించడానికికూడా యేర్పాట్లు జరుగుతున్నవి. అమెరికా నుంచి ప్రతి సంవత్సరం విద్యార్థుల జట్టు ఒకటి ఆంధ్రదేశం వచ్చి ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెలుగు నేర్చుకోవ డానికి యేర్పాటు కూడా జరిగింది. అమెరికన్ భాషా తత్త్వ శాస్త్రజ్ఞులు మునుపటి కంటె ఎక్కువగా ఇప్పుడు తెలుగు భాషనుగురించి పరిశోధన సాగిస్తున్నారు. అందుచేత అమెరికన్ విశ్వ విద్యాలయాలలో తెలుగు చదువు మునుముందు మరింత విస్తరిస్తుందని నిశ్చయంగా చెప్పవచ్చు.

---

తిట్టుకోవడం, పోట్లాట లేనిది ఆదంపతులకు దినంగడవదు. ఒకనాడు ప్రాణంవిసిగి భర్త అన్నాడు: "మీనాన్న తెలివితక్కువపని చేశాడు. ఎవడైనా శుద్ధ అప్రయోజకుడూ, చెవలవాజమ్మా, అలాటివాడిని నీకుమొగుడిగా వెతక వలసింది" అన్నాడు.

భార్య నిశ్చింతగా 'వెతికాడు' అంది.

'వెతికాక ఊరుకున్నాడేం' అని ఉరిమాడు భర్త.

'ఊరుకోలేదు. నన్నిచ్చి పెళ్ళిచేశాడు' అంది భార్య రెప్పవాల్చకుండాచూస్తూ

---

రి య ల్

# గృహిణి

## పిలకా గణపతి శాస్త్రి

### జ రి గి న క థ

పార్థసారథికి నాటకాల పిచ్చి. రాఘవ నాట్యకళా మండలిద్వారా నాటకాలు వేస్తుండేవాడు. నాటకాల రిహార్సల్సులో పడి తరచు రాత్రిళ్ళు ఆలస్యంగా యింటికి వచ్చేవాడు. భార్యాభర్తల మధ్య ఈ విషయంలో పొరపొచ్చాలు వస్తుండేవి. ఒకసారి అతని భార్య విజయలక్ష్మి మేనమామ కొడుకు పెళ్ళికని పుట్టింటికి వెళ్ళింది. పార్థసారథి నాటకంలో వేషం వెయ్యవలసి వచ్చి పెళ్ళికి వెళ్ళలేదు. నాటకం రోజున నాటకం పూర్తయ్యాక నాటకంలో హీరోయిన్ వేషం వేసిన సరోజతోపాటు ఆమె యింటికి వెళ్ళాడు. ముచ్చట పడి, నాటకంలో పాడిన పద్యాల్ని మళ్ళీ ఆమెచేత పాడించుకుని, ఆ పరవశంలో ఆమెను హృదయానికి హత్తుకున్నాడు.

---

పార్థసారథి ఇంచుమించుగా ఆ మరునాడు ఉదయం అయిదుదాకా రంగనాయకి మేడలోనే ఉండిపోయాడు. కాని కొంచెమయినా వెలుగు రాకముందే తిరిగి తన యింటికి బయలుదేరాడు. తొందర తొందరగా నడుస్తున్నాడన్న మాటేగాని అతని కింకా పూర్తిగా ఒంటిమీద స్పృహే కలగలేదు. గత రాత్రి తలవని తలంపుగా జరిగిన ఆ సంఘటన తలుచుకున్న కొద్ది అతని శరీరం జల్లుమని జలదరించి నిలువునా పులకరించింది.

కృష్ణ వేషాభినయాలతో లభించిన అభినందనలతో అంతకుమునుపే అతడెంతో ఉల్లాసంగా ఉన్నాడు. ఆపైన సరోజ, రాఘవకన్న అతడే చక్కగా నటించినట్టు నచ్చజెప్పి మనసారా అభినందించింది. అంతేకాదు. పార్థసారథి పరోక్షంలో తల్లితో అదే మాట రెట్టించింది. ఆతరవాత పట్టరాని గాఢానురాగంతో అతని కౌగిలిలో ఒరిగి కరిగి పోయింది. దానితో రాఘవ మీద ఆమె మనుస్సు తిరిగినదనుకున్న అతని అనుమానం పూర్తిగా తొలిగిపోయింది. గత రాత్రితో తన జీవితానికంతటికి పరిపూర్ణ సాఫల్యం కలిగినదని పార్థసారథి పట్టరాని ఆనందంతో తలమునకలయినాడు.

సరోజ ఇక పూర్తిగా తనసొత్తే అయిపోయినదని నమ్మిక కలిగిన తరువాత పార్థసారథికిక అడుగులే గాలిలో తేలిపోతూన్నట్టనిపించింది. క్రమక్రమంగా తామిద్దరు దేశంలో నలువైపుల పర్యటించి గొప్పఘనత గడించుకోవచ్చునని అతడెంతో ఉవ్విళ్లూరిపోయాడు. ఆ సంగతి ఆలోచిస్తూంటే పార్థసారథికి తమ ఇద్దరి పేరులు, అనేక పట్టణాలలో చిత్రచిత్రమయిన రంగుల పెద్ద పెద్ద అక్షరాలతో ఎన్నటికి విడిపోని జంటగా సమక్షంలో సాక్షాత్కరించాయి.

కృష్ణమూర్తి వివాహానికెలాగయినా భర్తతోకలిసి వెళ్ళాలని విజయలక్ష్మి ఎంతయినా ఉబలాట పడింది. కాని ఆమె అభిలాష నెరవేరలేదు. ఆతరవాత తప్పక రాగలనని పార్థసారథి మాట ఇచ్చినపిమ్మట అతి కష్టంమీద పిల్లలతో కలిసి పెళ్ళికి వెళ్ళడాని కంగీకరించింది. వివాహం ఇంకా రెండు మూడు రోజులున్నదనగానే ముందుగా పుట్టింటికి వెళ్ళింది. తిరిగి ఆ మరునాడే బంధువులందరు బయలుదేరి బెజవాడ చేరుకున్నారు. పెళ్ళికుజాయింపు చాలావరకు వెంకటేశ్వరరావు అధ్వర్యంలో జరిగింది. మొత్తంమీద వివాహం అయిదురోజులపాటు యథావిధిగా సులక్షణంగా జరిగిపోయింది.

పార్థసారథి శుభలగ్నానికి రాలేదు. పోనీ ఆ తరువాతనయినా వస్తారేమోనని విజయలక్ష్మిఅనుక్షణము ఎంతో ఆత్రంగా ఎదురు చూసింది. కాని చిట్టచివరికామె ఆశ ఫలించలేదు. అయిదవనాటి మధ్యాహ్నం మాత్రం అతని దగ్గరనించి ఒక టెలిగ్రాం వచ్చింది. జనం కృష్ణతులాభారం బ్రహ్మాండంగా మెచ్చుకుంటున్నారు. అందుచేత తిరిగి అది ఇంకొకసారి ప్రదర్శించక తప్పలేదు. కనుక పెళ్ళికి రాలేకపోతున్నాను. ఏమి అనుకోవద్దు.—పార్థసారథి మామగారిపేర ఇచ్చిన ఆ టెలిగ్రాం సారాంశం అది.

భర్త శుభముహూర్తానికి రానప్పుడే ఆయన మరి రారని విజయలక్ష్మి నిరాశ చేసుకుంది. కాని 'వివాహం పూర్తి అయ్యేలోగానయినా ఎప్పుడో ఒకప్పుడు వచ్చి కాస్త ముఖంచూపించక పోతారా.' అని తిరిగి ఆశపడింది. మనస్సులో భర్త రాలేదే. అని అదే పనిగా మథన పడుతున్నా పైపైకి మాత్రం చాలా కులాసాగా ఉన్నట్టే పెళ్ళివేడుకలలో పాల్గొన్నది.

మగపెళ్ళివారికి విడిది వీధిగుమ్మంలో దారికడ్డంగా నిలబడి వధూవరులిద్దరిచేత పేర్లు చెప్పించింది. పెళ్ళికుమార్తె మాటలు తిన్నగా వినబడలేదని తిరిగి తిరిగి పట్టుపట్టి కృష్ణమూర్తి బావ పేరు మరింతగట్టిగా చెప్పించింది. పెళ్ళికూతురు సావిత్రికి పండుమొగలిరేకులతో బొండుమల్లెలతో జడవేసింది. చక్కగా కళ్యాణ తిలకం తీర్చిదిద్ది బుగ్గమీద చక్కనిచుక్క పెట్టింది. చిరుసిగ్గుతో శిరస్సు వంచుకున్న సావిత్రిముఖం బాగాపైకెత్తి రెండు మూడు క్షణాలపాటు ఏకాగ్ర దృష్టితో పరిశీలించింది. వెంటనే కృష్ణమూర్తి దగ్గిరికి వెళ్ళి సన్నగా కలకల నవ్వింది.



'ఎలాగయితేనేం! చాలా కష్టపడి చక్కని చుక్కనే సంపాదించుకున్నావులేబావా!'

ఉట్టిపడుతున్న ఆప్యాయతతో అభినందించింది.

కృష్ణమూర్తి లీలగా నవ్వుతున్నాడు.

'నిజంగానేనా? నువ్వే మెచ్చుకున్నావంటే అందకత్తె అన్నమాటే.'

ఒక చిన్న నిట్టూర్పు విడిచిపెట్టాడు. ఆపైన ఆమె పలోక్తులకేవిధంగాను ప్రతిసమాధానం చెప్పలేదు. అంటీఅంట నట్టు ముభావంగా మాట్లాడకూడుకున్నాడు. అంతే!

దంపతీ తాంబూలాల సమయంలో భార్యాభర్తలు జంటలు జంటలుగావచ్చి తాంబూలాలందుకున్నప్పుడు విజయలక్ష్మి ముఖం చిన్నబుచ్చుకుని అమ్మమ్మ వెనకాల నిలబడి దంపతులందరివైపు ఎంతో ఆపేక్షగా చూసి చీర చెంగుతో కళ్ళురెండు ఒత్తుకుంది. వరదమ్మ వెనక్కితిరిగిచూసి మనవరాలి మానసికవ్యథ పసికట్టి నెమ్మదిగా అక్కున చేర్చుకుని "ఏదో తొందరపనివుండి సమయానికి అందుకొనలేక పోయాడేమోనే! ఇంతమాత్రానికే ఇంత బెంబేలెందుకే వెర్రితల్లి!" అని బుజ్జగించి ఓదార్చింది.

పెళ్లి అయిన తరువాత కృష్ణమూర్తి బావతో కలిసి మను గుడుపులకి వెళ్లవలసినదని తల్లి దండ్రులు, అమ్మమ్మ విజయలక్ష్మి

నెంతో బలవంతపెట్టారు. కృష్ణమూర్తి కూడ తప్పకుండా తన వెంట రావలసినదని బ్రతిమాలుతున్నాడు. విజయలక్ష్మి మొట్ట మొదట వెళ్లాలనుకుంది. కాని మరుక్షణంలో ఆ నిశ్చయం మార్చుకుంది.

'తప్పకుండా వస్తానన్న మనిషి ఎందుచేతనో పెళ్ళికి రాలేదు. ఏ ఊళ్ళో ఉన్నారో, ఎప్పటికి తిరిగి వస్తారో! ఇల్లే మయిపోయిందో!' అని ఆదేవనిగా మథనపడి వెంటనే తిరిగి ఇంటికి వెళ్ళిపోవాలని పట్టుపట్టింది.

'నీది మరీ చిత్రమేనమ్మా! ఒక్క మూడురోజులున్నంత మాత్రంలోనే ఆ ఇల్లు ఎక్కడికి ఎగిరి పోదులే! నామాట విని మనుగుడుపులకి వెళ్ళి రామ్మా! బావకూడా నిన్ను వెంటబెట్టు కుని వెళ్లాలని ఉబలాట పడుతున్నాడు!'

ఆమెతల్లి తిరిగి బ్రతిమాలుతుంది. కాని విజయలక్ష్మి వినిపించుకోలేదు. ఒకవేళ అమ్మమ్మ తనవెంటరావడానికి వీలు పడని పక్షంలో పిల్లలతో కలసి తానే ఒంటరిగా వెళ్ళి పోగలనని భీష్మించుకుని కూర్చుంది. ఆపట్టుదలగమనించి 'బాగుందమ్మా! బాగుంది! మహచక్కగా ఉంది!' అని వర్ధనమ్మ కస్సు బుస్సు మంటు విసుక్కుంది. తిరిగి నెమ్మదిగా చెప్పిచూసింది అయినా విజయలక్ష్మి తనపట్టు విడిచిపెట్టలేదు. అమ్మమ్మ పిల్లలతో మనవరాలి నొక్కత్తిని పంపించడానికిష్టంలేక మరి గత్యంతరం లేక ఆమెతో కలసి వెళ్లాలని నిశ్చయించుకుంది.

ఆమరునాడే విజయలక్ష్మి ప్రయాణసన్నాహం జరిగింది. తప్పనిసరిగా వెడుతున్నా అంత తొందరగా వెళ్లడం వర్ధనమ్మ క్షేమాత్రము నరిపడలేదు. అందుచేత విజయలక్ష్మిని సాగనంపడానికి గుమ్మంలోనిలబడిన కుమార్తెకేసి చూసి అది ఒక నిమిషంకూడా అన్నీ విడిచి పెట్టివుండలేదే! నాకుతెలియదూ దాని సంగతి! లేకపోతే ఇంత నిలుచున్నపాటుగా బయలుదేరవలసినంత అగత్యం ఏమి వచ్చింది చెప్పు! అసలు సంగతి అది! అని. మనవరాలికి వినబడీ వినబడనట్టుగా ఆమె అంతర్యం కాస్తాబయటపెట్టింది. కాని విజయ లక్ష్మి తనకామాట లేవీ వినబడనట్టే మాట్లాడకూరుకుంది.

ఆతరువాత ఆమెతల్లిదండ్రులతోను, మిగిలిన ఆత్మీయ బంధువులతోను వెడుతున్నానని చెప్పి సెలవు తీసుకుంది. తీరా గుర్ర పుబండి ఎక్కబోయేముందు ఏదోతటాలునజ్ఞాపకంవచ్చి వెనక్కి తిరిగివెళ్ళి తొందర తొందరగా నలువైపులపరకాయించిది. అరుగు మీద ఒకమూలనిలబడి తొణికిసలాడుతున్న ఆత్మీయతతోతన వైపే చూస్తున్న కృష్ణమూర్తి దగ్గిరికివెళ్ళి ఎంతో ఆర్ద్రతతో సెలవు తీసుకుంది.

'వెళ్లివస్తానుబావా! ఎప్పుడయినా కాస్త తీరిక చేసుకుని మాఇంటికిరా! మరిచిపోకేం!'

'అలాగేవస్తాలే! అయితే నా ఉద్యోగం మీఊళ్లోనేఅవుతుం దేమోలే!'

'నిజంగానేనా! అయితే సావిత్రి అడుగు పెట్టినవేళా విశేషం చాలామంచిదన్నమాటే! ఎన్నాళ్లలో అవుతుంది ఆ ఉద్యోగం ఎప్పుడూ నాతోచెప్పావుకావే?'

'ఏదీ! ఇంకా నిశ్చయంకాలేదు! కాని మూడువంతులు అవు తుందని ఆశకలిగింది.

"ఎన్నాళ్లలో తేలుతుంది ఆ వ్యవహారం?" ఎంతో ఆత్రంగా అడిగింది విజయలక్ష్మి.

'దేవుడు మేలుచేస్తే జూన్ నెలాఖరులోగానే ఆర్డరు రావాలి మరి!'

'అలాగా! ఆ ఉద్యోగం కాగానే కాస్త ఉత్తరం ముక్క రాయడం మరచిపోకేం?'

'అదేమిటి విజయా! అలాగంటావు? ఎందుకు మరచి పోతాను! నేనలాగ మరచిపోయేవాణ్ణేనా?'

'ఏమోయ్! ఇక నా సంగతి తలపెట్టవేమోలే!'

ఆమె క్షణకాలం అలాగే నిలబడి వెల్లి విరిసిన అభిమానంతో అతని వైపు చూసి నెమ్మదిగా బండి ఎక్కింది. అంతకు మునుపే వర్ధనమ్మ, పిల్లలు, సామానులతో సహా దానిలో ఎక్కి కూర్చుని ఆమె రాక కోసం నిరీక్షిస్తున్నారు. బండి క్రమక్రమంగా చురుకుగా మున్ముందుకు సాగిపోయింది. కృష్ణమూర్తి బావ అలాగే నిలబడి కనబడినంత వరకు తనవేపే చూస్తున్నాడని విజయలక్ష్మి కనిపెట్టింది.

అమ్మమ్మతోను, పిల్లలతోను కలిసి ఆమె ఆనాటి సాయంత్రం దీపాలవేళకే ఇంటికి చేరుకోవచ్చునని ఆశించింది. కాని రైలు రావడం బాగా ఆలస్యం అయింది. మూడు గంటలకి రావలసిన రైలు ఇంచుమించుగా అయిదు గంటలదాక రాలేదు. ఆపైన మధ్య మధ్య స్టేషనులలో కూడా మరి కొంత ఆలస్యం అయింది. దానా, దీనా ఆమె ఇంటికి చేరుకునే సరికి రాత్రి తొమ్మిది గంటలు కావచ్చింది. అప్పటికయినా భర్త తిరిగి వచ్చి ఉండవచ్చునని ఆమె ఆశించింది. కాని బండి దిగి కింద అడుగు పెట్టగానే ముమ్మందుగా వీధి గుమ్మానికి వేసిన పెద్ద తాళం ప్రత్యక్షమయింది.

దానితో విజయలక్ష్మికి తన గుండెకే బీగం పడినట్టని పించింది! ఆనాటి సాయంత్రానికింటికి వస్తున్నామని ఆమె ముందు గానే భర్త పేర ఉత్తరం రాసింది. అందుచేత ఆపట్టణానికనతి దూరంలో ఉన్న స్టేషన్‌లోనే భర్త సందర్శన భాగ్యం లభించ గలదని ఉవ్విళ్లూరింది. అది జరగ లేదు సరిగదా వీధి తలుపోక పెద్ద మొద్దు తాళంతో ప్రత్యక్షమయింది. అయినా భర్త భోజనానికని ఏదయినా హోటలుకి వెళ్లి ఉండవచ్చునని అనుకుంది.

అంతలోనే పొరుగింటినించి ఒక పది పన్నెండేళ్ల అమ్మాయి అక్కడికి వచ్చి, ఆ ఇంటి తాళంచెవి విజయలక్ష్మి చేతికందించింది. నాటకంలో వేషం వెయ్యడంకోసం పార్థ సారథి ఆ ఉదయమే పెద్దాపురం వెళ్లినట్టు, ఆ తాళంచెవి తమ ఇంటిలో ఇచ్చి వెళ్ళినట్టు చెప్పింది. విజయలక్ష్మి ఎంతో ఆత్రంగా ఇంకా ఏమయినా విశేషాలడిగి తెలుసుకోవాలని ప్రయ త్నించింది కాని అవి తనకేమి తెలియవని చెప్పి వెంటనే ఆపిల్ల వెళ్ళిపోయింది.

అప్పటి కందరు బాగా అలసి పోయారు. బాబు, సీత పాప, బడలికతో, ఆకలితో, చిరాకుతో మారాముచేసి రాగాలుఅరంభించారు విజయలక్ష్మి నెమ్మదిగా పిల్లల నిద్దరిని బుజ్జగించి తాళంచెవితో తలుపుతాళం తీసి లోపల అడుగు పెట్టింది. ఇల్లంతా అంధకార బంధురమై దిగులు కలిగిస్తున్నది. ఆపైన ఎక్కడో ఒకమూల గీ యని కీచురాతిమోత వినిపించింది. అంతలోనే తనాబీని అంటిపెట్టుకుని వేళ్లాడుతున్న గబ్బిలం ఒకటి అమె కెదురుగా అటూ ఇటూ పరుగులుపెట్టి తటాలున వీధిలోకి పారిపోయింది. ఆపైన తళతళలాడుతున్న కళ్ళతో ఒక బావురుపిల్లి విజయలక్ష్మి కాళ్ళ కడ్డంపడి క్షణంలో వీధిలోకి పరుగు పెట్టింది; బావురుపిల్లి ఎదురు పడగానే విజయలక్ష్మికెంతో భయం వేసింది. అయినా గుండె చిక్కబట్టుకుని ఆ చీకటి గుయ్యారంలో అగ్గిపెట్టె కోసం వెతకడం మొదలు పెట్టింది. అది ఎక్కడా కనబడలేదు కాని అదేపనిగా ఒకటే కీచురాతిమోత; 'ఇంటిలో కీచురాతిమోత వినబడకూడ' దంటారు; శుభమల్లే ఈవేళ ఇదేమి అపశకునమో మరి;' అని అదేపనిగా మథనపడింది.

చిందర వందరగా దారికడ్డంగా పడిఉన్న ఒకటి రెండు కుర్చీలమీద తూలిపడి అతికష్టంమీద తడుముకుంటూ వెళ్ళి ఆగూటిలోను, ఈగూటిలోను, అలమారులోను అయిదారు నిమిషాలపాటు వెతికిన తరువాత పాడయిపోయిన అలారం గడియారం వెనకాల ఎట్టకేలకు ఆమెకొక అగ్గిపెట్టె కనబడింది. అయితే దానిలో రెండుమూడు పుల్లలకన్నా ఎక్కువలేవు ఒక పుల్ల గీసినంతలోనే ఇట్టేవెలిగి ఇట్టే ఆరిపొయ్యింది. విజయలక్ష్మి రెండోపుల్ల వెలిగించి, హరికెన్ లాంతరుకోసం నాలుగు వైపుల పరకాయించింది. అంతలోనే ఆపుల్ల పూర్తిగాకాలి వేళ్ళు చుర్రుమన్నాయి. ఆ పరిస్థితుల వల్ల ఆమెకెంతో వ్యధ కలిగింది.

కళ్ళమ్మట నీళ్లు పర్యంతము అయింది. అయినా గుండె దిటవు చిక్కబట్టుకుని మూడో అగ్గిపుల్ల వెలిగించింది. అదృష్టవశాత్తు హరికిన్ లాంతరు ఒకమూల బల్లకింద సాక్షాత్కరించింది; వెంటనే ఆమె అది వెలిగించింది. ఉసూరుమని నిట్టూర్చి ఆ వేళ స్టేషనులో దిగినది మొదలుకొని అప్పటిదాకా జరిగిన సంఘటనలన్నీ ఒకటొకటే తలుచుకొని ఇంకా ముందేమి ముప్పు విరుచుకుపడగలదో అని భయపడింది.

మిగిలిన దీపాలన్నీ క్రమక్రమంగా వెలిగించిన తరవాత అమ్మమ్మ త్వరగా వంట ప్రారంభించింది. తీరా అది పూర్తి అయినతరవాత విజయలక్ష్మికి బొత్తిగా అన్నంతినాలనే అనిపించలేదు. ఆమెకెటువైపుచూసినా ఇల్లంతా పూర్తిగా దుమ్ముతో నిండినట్టు కనబడింది. వస్తువులన్ని చిందర వందరగా పడివున్నాయి. విజయలక్ష్మి అవి అన్నీ సర్దుతూ ఇల్లంతా తుడవటం మొదలు పెట్టింది. ఆ పనులన్నీ తెల్లవారిన తరవాత చేసుకోవచ్చునని చెప్పి వర్ధనమ్మ మాటి మాటికి అన్నం తినవలసిందని బలవంత పెట్టింది.

విజయలక్ష్మి మరి కాదనలేక పిల్లలతో కలిసి అంటీ అంటనట్టు భోజనం ముగించింది. వాళ్లిద్దరు నిద్రపోయిన తరవాత మంచంమీద మేనువాల్చిన ఆమె కావేళ ఇల్లంతా బావురుమంటున్నట్టు కనిపించింది. ప్రయాణంవల్ల బాగా అలిసినా, మనస్సులో ఎడతెగని మథనవల్ల ఎంతగా ప్రయత్నించినా కంటికొక్క కునుకయినా పట్టలేదు;

అలాగ మూడు రోజులు గడచిపోయాయి; అయినా పార్థసారథి తిరిగి ఇంటికిరాలేదు; పోనీ అనుకుంటే అతనిదగ్గర నించి ఒక చిన్న ఉత్తరం ముక్క అయినా చేరలేదు. అందుచేత అతడు తిరిగి ఎన్నాళ్లలో ఇంటికివచ్చేదికూడా తిన్నగా తెలియలేదు; ఇరుగు పొరుగులవల్ల కృష్ణతులాభారం నాటకంకోసం భర్త పై ఊళ్లకి వెళ్లినట్టు తెలిసింది. పెళ్లి అయిదవనాడు పంపించిన టెలిగ్రాంలో అతడు పెద్దాపురం వెడుతున్నట్టు మాత్రమే తెలియజేశాడు. అంతే; ఆ తరవాత తిరిగి ఎక్కడికి వెళ్లినది తిన్నగా తెలియలేదు;; 'పెద్దాపురంలో నాటకం అయిన తరవాత ఇక మిగిలిన ఊళ్లన్నీ చుట్టబెట్టుకుని వస్తున్నారులా ఉంది;' అని అప్పటివరకు భర్త ఇంటికి తిరిగి రాకపోవడానికొక కారణం కల్పించుకుంది.

ఆ తరవాత ఇంకొక రెండురోజులు గడిచిపోయాయి; అయినా పార్థసారథి-తిరిగిరాలేదు; క్రమ క్రమంగా ఇరుగు పొరుగున ఉన్న స్నేహితురాళ్లవల్ల విజయలక్ష్మి కేవేవో కొత్త విశేషాలు కొన్ని తెలిశాయి. సరోజా పార్థసారథులమధ్య కొంత సంబంధమేదో ఉన్నట్టు ఆమెకు కంతకుమునుపే అనుమానం కలిగింది. ఇంటికి తిరిగివచ్చిన తరవాత పని మనిషి చెప్పిన మాటలనుబట్టి దానిలో మరి అనుమానమేమి లేదని, అది నిజమేనని స్పష్టపడింది; దానితో ఆమె గుండెల్లో రాయిపడింది; అతని వ్యవహారం అంతటితో ఆగలేదు; పార్థసారథి ఇటీవల అయిదెకరాల మాగాణీ పొలంకూడా తెగ నమ్మివేసినట్టు తెలిసింది. ఇంకా ఇరుగు పొరుగు అమ్మలక్కలు కొందరు ఆ ఊళ్లో ఉన్న పెంకుటిళ్లు రెండు తెగనమ్మివేసినట్టు కూడా గుస గుసలాడుకుంటున్నారని ఆమె చెవిని పడింది;

తండ్రి పోయిన తరవాత పార్థసారథి అప్పుడప్పుడు మొత్తంమీద అయిదెకరాల భూమిదాకా అమ్మివేశాడు. ఇప్పుడు తిరిగి ఇంకొక అయిదెకరాల మాగాణీ పొలం తణఖా పెట్టినట్టు పొక్కింది; నాటకం బ్రహ్మాండంగా ఉన్నదని జనంఅంతా మెచ్చుకుంటున్నప్పుడు పుష్కలంగా డబ్బు చేతికిరావాలిగదా; మరి అమాంతంగా అయిదెకరాల భూమి తణఖా పెట్టవలసినంత అగత్యం ఏమి వచ్చింది; విజయలక్ష్మికి ఆ పుకార్లలో ఎంత వరకు నిజమున్నదో తిన్నగా తెలియలేదు; కాని అవి చాలావరకు యథార్థాలే అయిఉండవచ్చునని నిశ్చయించుకుంది.

ఆ సంగతులన్నీ ఆలోచిస్తున్న కొద్ది ఆమె గుండెలో ఆరాటం బయలుదేరింది. మరి ఉండబట్టలేక తాను విన్నవన్ని అమ్మమ్మతో పూసగుచ్చినట్టు చెప్పింది. ఆమె నిలువునా నిర్ఘాంతపడి ఉసూరుమని నిట్టూర్చింది.

'ఏమోనమ్మా; నాకేమి అంతు పట్టడంలేదు; ఊరికే ఉత్త పుణ్యానికని ఇలాంటి మాటలెందుకు పుట్టుకువస్తాయి? ఏదో ఇంత కలిగినవాళ్లుకదా, అని నేనే ఈ సంబంధం చెయ్యవలిసిందని

పట్టుపట్టాను! చిట్టచివరికి ఆస్తి అంతా ఇలాగ తగలేస్తాడని అనుకోలేదు మరి!'

విజయలక్ష్మి అంతలోనే అందుకుంది.

'ఆ నాటకం చూడడంకోసం జనం విరగబడుతున్నారు కదా! అలాంటప్పుడు నిలుచున్నపాటుగా ఇళ్ళు రెండు అమ్మివేసి అయిదెకరాల భూమి ఒక్కసారిగా తణఖా పెట్టవలిసినంత అవసరం ఏమి ముంచుకువచ్చింది?'

'అయ్యో! వెర్రిదానా! నీకీమాత్రంకూడా తెలియలేదుటే! ఆ నాటకం ఖర్చులు దానిలో వేషాలు వేసేవాళ్ళు రాకపోకల ఖర్చులు, భత్యాల ఖర్చులు, అన్నీ అతడేగా భరిస్తున్నది? తేరగా సొమ్ము గుమ్మరించేవాడు దొరికినప్పుడు పైవాళ్ళు అనవసరంగా తమ డబ్బు తగలేసుకుంటారా? .: అయినా ఇదిగో పులి అంటే అదిగో తోక అంటారు! ఆమాట లెంతవరకు నిజమో మరి!'

కాని విజయలక్ష్మి కేమాత్రము ఊరటకలగలేదు. తన మనస్సులో చెలరేగుతున్న మథన అంతా ఒక్కసారి వెళ్ళబోసుకున్నది.

'అమ్మమ్మా! ఏదో గట్టి కారణం లేకపోతే ఇలాంటి విడ్డూరాలన్ని ఊరికే పుట్టుకువస్తాయా? ఆయన ఊళ్లో ఉన్న పెంకుటిళ్ళు రెండు అమ్మివేశారన్నమాటే! వాటితోబాటు అయిదెకరాల భూమి తణఖా పెట్టివేశారన్నమాటే! ఇక సందేహం లేదు! తణఖా పెడితేమాత్రం లాభమేమిటి? ఆ అప్పు తీరుస్తారా ఏమన్నానా? వెనక ఇలాగే తణఖా పెట్టి, ఆ అప్పు తీర్చలేక ఆ భూములన్నీ అయినకాడికి తెగనమ్మివెయ్యలేదూ? ఇక ఇప్పుడూ అంతే జరుగుతుంది! ఇంతకీ ఎవళ్ల కర్మ ఎలాగ ఉంటే అలాగ జరుగుతుంది, మన మేమి చెయ్యగలం?'

ఇక ఆమె నోటమాట వెలువడలేదు. గద్గదికతో కంఠం స్తంభించింది. అది గమనించి వర్ధనమ్మ నెమ్మదిగా మనవరాలి వోదార్చింది.

'ఇంతకి అతనిని తిరిగి ఇంటికి రానీ! ఈ సంగతులన్నీ అప్పుడే అడిగి కనుక్కోవచ్చును! అంతలోన ఇంత కంగారెందుకు?...ఏమోలే' అతనికి మాత్రం తన సంసార బాధ్యత తెలియదూ? ఆస్తి అనవసరంగా దుబారాచేస్తాడా? ఊరికే బాధపడితే మాత్రం పోయినభూమి తిరిగివస్తుందిటే వెర్రితల్లీ!'

విజయలక్ష్మి దానికేవిధంగాను సమాధానం చెప్పలేదు. అదేసమయములో లేచి ఏడుపు మొదలు పెట్టిన పసిపిల్లని సముదాయించడానికి లోపలికి వెళ్ళింది. ఎందుచేతనోగాని ఎంతసేపటికి సీత పాప ఊరుకోలేదు. విజయలక్ష్మికేమి పాలుపోలేదు. కడుపునొప్పిగాని వచ్చిందేమోనని కస్తూరి మాత్రవేసింది అయినా పాప ఏడుపుమానలేదు. విజయలక్ష్మికి గుండెలో మరింతగుబులు బయలుదేరింది. ఎంతో కంగారుపడి దగ్గుత్తికతో అమ్మమ్మని పిలిచింది. ఆమెవచ్చి వేణ్ణీళ్లలో గుడ్డముంచి కాపటం పెట్టిన తరవాత పసిపిల్ల క్రమక్రమంగా ఏడుపుమాని కళ్లుమూసుకుని నెమ్మదిగా నిద్రపోయింది.

ఆమరునాడు మధ్యాహ్నం మూడుగంటలు దాటినతరువాత పార్థసారథి గుఱ్ఱపు బండిదిగి, సామానులతోసహా యింట్లో ప్రవేశించాడు అతడు గుమ్మంలో కంటపడగానే ఇంటిల్లిపాది ఎంతో సంతోషించారు. బాగాబెంగటిల్లిన పిల్లలిద్దరు 'నాన్నా, నాన్నా!' అని కాళ్ళకడ్డుపడ్డారు! వంట ఇంట్లోనించి వర్ధనమ్మ ఎంతో ఆప్యాయంగా అతన్ని పలకరించింది.

'భోజనంచేశారా.'

భార్య ఆత్రంగా అడిగింది.

'ఆఁ! దారిలో హోటల్లో భోజనం చేసే వచ్చాను.'

పార్థసారథి కాఫీకూడ పుచ్చుకునివచ్చినట్టు చెప్పాడు. అయినా విజయలక్ష్మి త్వరగా కాఫీచేసి అతనికి అందించింది. ఆతరవాత పిల్లలిద్దరు ఇక అతన్ని విడిచిపెట్టలేదు! బాబు ఎన్నెన్నో చిత్రవిచిత్రమయిన ప్రశ్నలడగడం మొదలుపెట్టాడు పార్థసారథి కొంతపరధ్యాన్నంగా వాటికేవేవో సమాధానాలిచ్చాడు. ఆపైన తిరిగి ఆ పసివాడు అమ్మమ్మ దగ్గిరికి వెళ్లిపోయాడు. విజయలక్ష్మి సీతపాపని దగ్గిరకి తీసుకుని నెమ్మదిగా భర్తపక్కన కూర్చుని ప్రయాణంలో తాముపడ్డ అవస్థలసంగతి స్టేషనులో దిగినప్పటినించి ఎదురుపడ్డ ఇబ్బందులగోడు పాప కడుపునొప్పి గొడవలన్నీ పూసగుచ్చినట్టు ఏకరువుపెట్టింది. కాని పార్థసారథి ఆమాటలేవి తిన్నగా వినిపించుకోక లాల్చీ జేబులు, తన పెట్టెలో బట్టల మడతలు అన్ని ఆదరా బాదరాగా వెతకడం మొదలు పెట్టాడు.

'అదేమిటి? అలాగ కంగారుగా వెతుకుతున్నారు? ఎక్కడయినా ఏదయినా మరిచిపోయారా!'

విజయలక్ష్మి కొంచం ఆత్రపడి అడిగింది.

'పర్సు పోయిందిలా ఉంది. ఎక్కడ కనబడడంలేదుమరి!'

'బండివానికి అందులోనించేకదా ఇచ్చారు కిరాయి? ఇంతలోనేఎక్కడకిపోతుంది?'

విజయలక్ష్మి అతనితోబాటు ఆ పర్సుకోసం బట్టలన్నీ తిరగవేసింది. 'ప్రయాణాలలో ఎన్నడు ఒక్క చిల్లిగవ్వయినా పారవేసుకోలేదుమరి! ఇప్పుడింతటి పరధ్యానం ఎందుకువచ్చిందో!' అని మనస్సులో మథనపడింది. అంతలోనే ఆపర్సు అకస్మాత్తుగా కంటబడింది. అది అతని పెట్టెకిందే కనబడింది. 'ఇదిగో! ఇక్కడే ఉందండీ! అనవసరంగా కంగారుపడి దాని మీదికి పెట్టెజరిపినట్టున్నారు!'

పార్థసారథిముఖం వికసించింది. 'దానిలో అయిదారు వందలదాకా నోట్లున్నాయి. ఏమయిపోయిందా అని ఎంతో కంగారు పడుతున్నాను!'

క్రమక్రమంగా భార్యా భర్తలమధ్య పిచ్చాపాటీ ప్రారంభమయింది. పార్థసారథి తాను వివాహానికి రాలేకపోయినందుకు గల కారణాలన్నీ ఏకరువుపెట్టి కొంచెం నొచ్చుకున్నాడు. అదే సమయంలో విజయలక్ష్మి నెమ్మదిగా మాట తప్పించింది. 'ఊళ్ళోఉన్న పెంకుటిళ్లు రెండు అమ్మివేసి అయిదెకరాల భూమి తణఖాపెట్టినమాట నిజమేనా?' అని అడిగింది. (సశేషం)

# తెలుగు కవితకు వెలుగు తోరణాలు

"కులపతి"

నవ్యతకు పర్యాయ పదమైనది, యిరవయ్యో శతాబ్దం, సాహిత్యంలోని సర్వ ప్రక్రియల్లోనూ. పంధొమ్మిదో శతాబ్దపు చివరి భాగంలో మనదేశంలో రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో కలిగిన భావ విప్లవ ఫలితంగానే నవ్యకవితోద్యమం ప్రారంభమైంది. రెండు వందల ఏండ్ల బానిసత్వపు సంకెళ్ళను త్రెంచుకోవాలని భారతీయులు చేసిన పోరాటం జీవితపు సర్వరంగాలలో తన ప్రభావం ప్రసరింపజేసింది. సాహిత్యంలో కూడా సంకెలలు త్రెంచే ప్రయత్నం అనేక రీతులలో బహిర్గతమైంది. ప్రకృత వ్యాసోద్దేశము కవితా రంగములోని శృంఖలా విచ్ఛేదక ప్రయత్నముల వరకే పరిమితము.

## మార్పులకు కారకులు

సంప్రదాయానికి ఎదురు తిరిగి నవ్యసృష్టికి పూనుకోవడానికీ, సంప్రదాయపు దారులలోనే పయనిస్తూ కొత్తకోసం ప్రయత్నించడానికీ, చాలా తేడావుంటుంది. ఏనాటికైనా మొదటి మార్గము వల్లనే సంఘానికీ, సాహిత్యానికీ బహుళ ప్రయోజనము సిద్ధించడానికి అవకాశం వుంటుంది. నూటికి నూరుపాళ్ళ సంప్రదాయానికి వశుడైన కవి సాహిత్య చరిత్రలో, మన భాషలోనే కాదు; ఏ భాషలోనూ దొరకడు. ఎందుకంటే ప్రతివాడూ కొద్దో గొప్పో సంప్రదాయ సరిహద్దును దాటటానికే ప్రయత్నిస్తాడు. లేనిదే క్రొత్త పుట్టనేపుట్టదు గదా. కనీసం ఒక ప్రౌఢ ప్రయోగం చేయడంలోనైనాసరే కవి స్వతంత్రిస్తాడు. కాగా సంప్రదాయానికి ఎంత ఎక్కువగా ఎదురు తిరిగి, నూతన సృష్టికి పూనుకుంటే అంత ఎక్కువగా అతడు మార్పుకు కారకుడుగా గుర్తించబడతాడు. కందుకూరి వీరేశలింగం పంతులు, గిడుగు వేంకట రామమూర్తి, గురజాడ అప్పారావు గారలు యీవిధంగా భావ, భాషా, కవితా రంగాలలో నూతన సంప్రదాయాన్ని సృష్టించి, ఆదర్శ పురుషులై ఆధునిక యుగానికి మూలపురుషులైనారు. రాజకీయ రంగములో గట్టులు త్రెంచుకుని ప్రవహిస్తున్న సంపూర్ణ స్వాతంత్ర్య చైతన్య స్రవంతి సాహిత్య రంగంలోని భావనాక్షేత్రములను కూడా తడిపింది ఏ కాలములోనైనా సాంఘిక విప్లవ చైతన్యము జీవితములోని ఒకె, లేక కొన్ని విషయములకు మాత్రమే పరిమితమై వుండదు. తత్ప్రభావము జీవితంలోని సమస్త శాఖలను స్పృశిస్తుంది.

## జీవద్భాషా విజయం

గిడుగురామమూర్తి పంతులుగారు తెచ్చిన భాషా విప్లవము తెనుగు సాహిత్యమునకు వరప్రసాదము వంటిది. వ్యవహారిక భాషా ఉద్యమము విజయము పొందుట వల్లనే నేడు మన సాహిత్యము శాఖోపశాఖలై విస్తరించి సర్వదిశాక్రమణము చేయుటకవకాశము కలిగినది. "అతడనేక యుద్ధముల నారితేరిన ధర్మమూర్తి" యన్నట్లు పండిత సమ్రాట్టు నెందరితోనో హోరాహోరి పోరి ఆయన మన భాషా రాజ్యమును దిగంతములకు ఎల్లలు పెంచి విస్తరింప జేసినాడు. జనసామాన్యముతో సంబంధములు పూర్తిగా తెగద్రెంపులు జేసికొని పండితులను మాత్రమే వెంటబెట్టుకుని వనవాసము చేస్తున్న కావ్యభాషను బలవంతముగా పట్టి తెచ్చి జీవద్భాషతో సన్నిహిత మొనర్చినాడు. ఆయన సిద్ధాంతమును కావ్య, నాటకాది సాహిత్య రూపములతో నన్వయించి, మార్గదర్శకమైన నవీన కవితా సరస్వతి నావిర్భవింపజేయు బాధ్యత నవయుగవైతాళికులైన గురజాడ అప్పారాయ కవీంద్రులు స్వీకరించినారు.

## సందేశ కవిత

తెనుగు సాహిత్య చరిత్రను సూక్ష్మముగా పరిశీలిస్తే, గ్రాఫు పటములోని గీత పైకి, క్రిందికి మారుతున్నట్లుగా, కవిత్వము కొన్నాళ్ళు ప్రజలవద్దకు పోవుట, కొన్నాళ్ళు వారిని పూర్తిగా వదలివేయుట అను మార్పులు స్పష్టంగా కనిపిస్తాయి. మరొక విధముగా చెప్పవలెనంటే, కళకు సంబంధించినంత వరకు సాంఘిక ప్రయోజన వాదమూ, ప్రయోజన రహితవాదమూ (కళ కళ కోసమే ననుట) ఒకదానితో నొకటి పోటీపడి ఒక్కొక్కప్పుడొకటి పైచేయిగా వుంటుంది. ఇది వ్యక్తివాదమునకూ, సమాజవాదమునకూ నిరంతరం జరిగే పెనగులాట. భారతయుగము, శివకవుల యుగములలోవలె ప్రబంధయుగములో సాహిత్యమునకు సాంఘిక ప్రయోజన చైతన్యములేదు. వసుచరిత్రాదులు రాజాస్థానములలో పండిత పరీక్షలకు నిలువగలిగి, రాజు నామోదము పొందు నుద్దేశముతో వ్రాయబడినవే కాని ప్రజామోదము గడించు నుద్దేశములేదు. ఈనాడైనను పల్లెటూళ్ళలో పామర ప్రజలు సైతము భారతము పురాణముగా చెప్తే నెలరోజులు, రెండునెలలు వరుసగా వింటారు. కాని వసుచరిత్ర పురాణం చెప్తే ఎందరు వింటారు? ప్రబంధయుగమూ, తరువాత వచ్చిన మధుర నాయకుల యుగమూ కూడా నేలవిడిచి చేసినసాములే, ఈ పరిస్థితినుండి తెనుగు కవిత్వమును తప్పించి దానిని మరల ప్రజల వద్దకు తెచ్చినవాడు గురజాడ. వ్యవహారిక భాషావాద మందుకోసమే పుట్టింది కాబట్టి, జీవద్భాషా ప్రయోగములను యిముడ్చుకో గలిగిన నూతన ఛందస్సుల కోసం అన్వేషణచేసి ఆయన ముత్యాలసరము కనుగొన్నాడు. దానిద్వారా వ్యవహార భాషా ప్రయోగములు కావ్యస్థముచేసి, కవితకు సారళ్యము సాధించి, సామాన్య ప్రజల జీవిత చరిత్రలను కథావస్తువులుగా స్వీకరించి, సందేశయుతమైన నూతన కవితకు ఆయన శ్రీకారము చుట్టినాడు.

## ప్రజల కోసమంటే ?

ప్రజలకోసం కవిత్వము రాయడమంటే ప్రజలందరికీ అర్థమయ్యేట్లు రాయడమనికాదు. వారిని ఉద్దేశించి, వారి సమస్యలను గురించి, వారిని ప్రబోధితులజేయుటకై వ్రాయుటమాత్రమే. తెనుగు సాహిత్యరంగమున అప్పారాయ కవీంద్రుని యాగమనముతో, వ్యావహారిక భాషకు కావ్యగౌరవము, సామాన్యులకు నాయికా, నాయక గౌరవము, కవిభావనకు లౌకికదృక్పథమూ, కవితకు విశ్వైకకుటుంబాదర్శము దేశభక్తి, సమాజ చైతన్యము (అంటే యివన్నీ కలిసి నిజమైన విశ్వశ్రేయోదృక్పథము) లభించినవి. అలంకారాల భారానికి భరతవాక్యం పలికి ఛందశ్శృంఖలను త్రెంచడానికి తీవ్రంగా కృషిచేసి ఆధునిక కవితాయుగ ప్రవక్త అయినాడు. ఆయన పూర్ణమ్మ, కన్యకవంటి పాత్రలు సంఘంలో మన కండ్లఎదుట సాక్షాత్కరించేవేగాని కల్పనా జగత్తులోనుండి వూడిపడినవికావు. ఆయన చేసిన వర్ణనలు నిసర్గ సుందరములు, స్వభావ రమణీయములే గాని, ప్రబంధ వర్ణనలవలె భాషతో కుస్తీపట్లుకావు. నేటి ప్రజాస్వామ్య యుగధర్మమునకు అనుగుణముగా తెనుగు కవిత్వమునకు రూపురేఖలు దిద్దిన గురజాడ, అనాడు నన్నయ్యవలె, ఆధునికయుగమునకు ఆదికవి.

## నవ్య సాహిత్య పరిషత్

అనాడు సంస్థారూపమున కవితా ప్రచారమునకు పూనుకున్న వాటిలో నవ్యసాహిత్య పరిషత్తు చెప్పదగినది. వ్యావహారిక భాషావాదము నంగీకరించి, నవ్యకవిత్వమునకు ప్రతినిధిగా యీ సంస్థ కృషిచేసినది. రాయప్రోలు సుబ్బారావుగారి తృణకంకణముతో ప్రారంభమైన నవ్యకవితోద్యమము కేవలము కాల్పనిక రీతులకు అలవాటుపడి గురజాడ వేసినబాటను, కవితకు సంబంధించి నంతవరకు చాలావరకు త్రోసిపుచ్చినది. కవిత్వములో ప్రకృతి వర్ణన, అమలిన శృంగారము, విరహము, మొదలగు అంశము లధికముగా ప్రవేశించి కవిత్వమును ప్రజలకు మరల దూరముచేసినవి. ఎన్ని సిద్ధాంతములు చెప్పిననూ, ఎందరు పాశ్చాత్య కవీంద్రుల యాదర్శములను తెచ్చిచూపినను, ప్రబంధ యుగములోని శృంగార కావ్యము లెట్లు ప్రజారంజకములుకావో, అట్లే కాల్పనిక యుగములో కుప్పలు తెప్పలుగా వచ్చిన ప్రేయసీ విరహ కావ్యములుకూడా ప్రజాదరణమునకు పాత్రములు కాలేదు. అవి కేవలము పండిత, కవి, విమర్శక వర్గములకు మాత్రమే పరిమితమై పోయినవి. కాని ఆ యుగములో కవిత్వము పూర్తిగా ప్రజలను మరచిపోయినదనుట కూడా అన్యాయమే అవుతుంది.

## జాతీయ కవిత్వము

అనాటి ప్రజల ప్రధాన సమస్య దేశమునకు సంపూర్ణ స్వరాజ్య సాధనము. ఉత్తుంగ జలధి తరంగములవలె ప్రజలలో రాజకీయ స్వాతంత్ర్య చైతన్యము పరవళ్ళు త్రొక్కుచున్నది. దాని ప్రతిధ్వని కవులగుండెలలో మార్మోగక తప్పదు. వారు దానికి లోనుగాక తప్పదు. ప్రేమ కవిత్వ పరిధులకే పరిమితమైకూచున్న పెద్ద పెద్ద కవులందరూ యుగ ప్రభావప్రేరితులై జాతీయ భావ పూరితములైన పద్యములు, గేయములు రాసినారు. రాయప్రోలు, విశ్వనాథ, జాషువా, తుమ్మల, బాపిరాజు ప్రభృతులు జాతీయోద్యమమునకు దోహదకరమైన రచనలుచేసి ప్రజలలో నూతనోత్సాహమును పురిగొల్పుటకు సాయపడినారు. భాషా రాష్ట్ర సిద్ధాంతమును ప్రతిపాదించి, ప్రచారముచేయుచున్న తెనుగు ప్రజలకానాడు సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమునకునూ, ప్రత్యేక రాష్ట్ర వాంఛకునూ బేధమేలేదు. అందుచేతనే మన స్వాతంత్ర్య కవితా శంఖారావములో రాష్ట్రోద్యమ ధ్వనులుకూడా పుష్కలముగా వినిపించినవి. "ఏదేశమేగినా ఎందుకాలిడిన పొగడరా నీ తల్లి భూమి భారతిని" అనీ, "సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల యంక సీమల నిల్చినట్టి సాధ్వి ...... పచ్చి బాలెంతరాలు మా భారతమాత" అనీ భారత మాతృస్తవముద్వారానూ, "విండార బారు నఖండ గోదావరి దాగిన చాళుక్య నాగరకత, పల్లెపదాల జీవము నిల్పికొన్న పల్నాటివీరుల రక్తనాళ పటిమ" అనీ, "గోదావరీ తరంగోదార వాఃపూర మఖిలభారతము మాదన్ననాడు, పెన్నానదీ సముత్పన్న కైరవదళ శ్రేణిలో తెలుగు వాసించునాడు" అనీ ఆంధ్రీ మాతృస్తవము ద్వారానూ రాయప్రోలు, విశ్వనాథ, జాషువా ప్రభృతులైన కవి పుంగవులానాటి ప్రజల్లో జాతీయ ప్రబోధము గావించినారు.

## విశ్వనాథ

ఆంధ్రుల పురావైభవ వర్ణన తెనుగున జాతీయ కవిత్వములో స్థిరనివాస మేర్పరచుకున్నది. కేవల ప్రబోధ గేయ మార్గమును మాత్రమే అనుసరించి నడుస్తున్న యీ కవితాశాఖను పరమ రమణీయములైన కథాశ్రయ కావ్య ఖండికాసుమములతో నలంకరించిన కీర్తి శ్రీ విశ్వనాథ వారికి దక్కినది. "ఆంధ్ర ప్రశస్తి"లోని ఆంధ్ర విష్ణువు, నన్నయభట్టు, శాతవాహనుడు, మాధవవర్మ, ప్రోలరాజు కథలూ, చంద్రవంక యుద్ధమూ ఆంధ్ర చరిత్రకు మకుటాయమైన రచనలు." తెనుగు సాహిత్యములో శ్రీ విశ్వనాథ చేయి పడని ప్రక్రియ అంటూ ఏదీలేదు. నవల, నాటకము, పద్యము, గేయము, విమర్శ, కథ–సమస్త సాహిత్య రూపములను స్పృశించుటయేకాదు ; ఆయన ప్రతిభావంతముగా నిర్వహించినాడు. అనాటినుండి నేటివరకు కలమాపకుండ వ్రాయుచున్న కవి ఆయన ఒక్కడే. కవిత్వము వలననేగాక, వచన రచనా బాహుళ్యమువల్ల ఆయన తెలుగు ప్రజలకు ప్రీతిపాత్రుడైనాడు. ఆయన "సకలోహ వైభవ సనాథము, నాధకథ" అయిన "శ్రీమద్రామాయణ కల్పవృక్షము" కాలపు తాకిడికి తట్టుకుని నిలువగల మహాకావ్యము. అడివి బాపిరాజు గేయములు, కొడాలి సుబ్బారావుగారి "హంపీక్షేత్రము" మొదలగునవి యానాడు ప్రజలను ప్రబోధించిన మౌలికమైన రచనలు. శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి "రాష్ట్రగానము" ఆ రోజుల్లో మూడు కోట్ల తెనుగు హృదయాలను ఒక్క ఊపు వూపింది. అందులోని పద్యములు విని ఒడలు పొంగని తెలుగువాడు, ఒకటో రెండో పద్యములైనా కంఠస్థము చేయనివాడు లేడంటే అతిశయోక్తికాదు. కృత్రిమ కవితా దర్పము లేకుండా, అనాటి తెలుగుల జీవన్మరణ సమస్యయైన ప్రత్యేక రాష్ట్ర వాంఛను

ఆవేశ పూరితముగా, సరళంగా, సర్వ జనామోద కరంగా ప్రకటించిన యీ చిన్న పుస్తకము ఆనాడు భగవద్గీతవలె యింటింటా పారాయణ గ్రంథమైనది.

## జాషువా

ఒక విధంగాచూస్తే ఆనాటికీ యీనాటికీ నిజమైన తెలుగు కవి ఒక్క జాషువాగారే. అందరి కవిత్వమొకఎత్తు ఆయనది ఒక ఎత్తు. ఆయనకు నవ్యసాహిత్య పరిషత్ వంటి సంస్థలతో పనిలేదు అమలిన శృంగారాది నూతన కావ్య సిద్ధాంతముల ప్రసక్తి లేనేలేదు. కీట్సు, షెల్లీ, బైరను లేమిరాశారో రవీంద్రుడేమి చెప్పాడో ఆయన కవసరములేదు. ఆంగ్లభాషా సాహిత్య భావప్రక్రియలచేత ఏమాత్రము ప్రభావితము గాని నిజమైన తెలుగు కవిత్వ మాయనిది. తెలుగు పలుకుబడిలోని తీయదనము, తెనుగు శబ్దముల కులుకు ఆయనకు తెలిసినట్లు ఆ నాటికీ యీ నాటికీ మరొకరికి తెలియదు. కవికి కావలసిన ఆత్మానుభూతి, ఆవేశము ఆయనకున్నవి. కవితకు కావలసిన సారళ్యము, సాంఘిక ప్రయోజనమూ ఆయన కవితకున్నది. ఆ రోజుల్లో, శృంగార, విరహములు కవితారంగములో స్వైర విహారముచేస్తున్న సమయములో ఆయన వాటిజోలికి పోలేదు. భవభూతివలె కరుణరసమునకు పట్టము కట్టినాడు. కవితా రూపము పూర్వ సంప్రదాయానుగుణమైన పద్యచ్ఛందములో నున్నదన్న మాటేగాని, అభ్యుదయ కవులు రంగములోనికి రాకముందు, ఆయన అంగీకరించినా అంగీకరించక పోయినా, ఆయనే గురజాడకు నిజమైన వారసుడు. ఆనాటి కవులంత వ్యుత్పత్తికూడా జాషువా కవీంద్రునకు లేదనే చెప్పాలి. కేవలం స్వయం ప్రతిభమీద సర్వాంధ్ర ప్రజల యాదరణకు పాత్రుడైన ప్రజాకవి జాషువాగారు. గురజాడ కాలములోనే కవితలో వ్యుత్పత్తి బలము తగ్గిపోయి, ప్రతిభకు పట్టాభిషేకము జరిగినది. అది గురజాడలోవలె జాషువాలో కూడా సఫలమైనది.

## ఎంకిపాటలు, కిన్నెరసాని

ఆ నాటి నవ్యాంధ్ర సాహిత్యములో " ఎంకిపాటలు " ఒక గొప్ప గాలిదుమారమును రేపినది. కృష్ణశాస్త్రి ప్రభృతుల ప్రేమ కవిత్వముపై అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు తమ '' నేటి కాలపు కవిత్వములో '' ఏంత ఘాటైన విమర్శలు చేసినారో, అందుకు పదింత లెక్కువగా ఆంధ్రసాహిత్య పరిషత్పండితులు '' ఎంకిపాటలు '' పై విరుచుకు పడనాడు. "జీవద్భాషకు యింత దగ్గరగా కావ్యభాషను తీసుకువచ్చే ప్రయత్నం గొప్పదికదూ " అన్నారు కృష్ణశాస్త్రిగారు బసవరాజు అప్పారావు గారి గేయాలకు తొలిపలుకురాస్తూ. ఎంకిపాటలు, కావ్య, జీవద్భాషల సాన్నిహిత్యమును మరింతగా పోషించిన కావ్యము. సామాన్య నాయికా నాయకుల జీవిత వృత్తమగుట వల్లనూ, దాంపత్య శృంగారమును వరించుట వల్లనూ, యితరకవులు రాసిన ప్రేమ గేయాలవలెకాక దాదాపు కథాశ్రయమై వస్త్వైక్యత కలిగిన సంపూర్ణ కావ్యమగుట చేతనూ నండూరి సుబ్బారావుగారి ఎంకిపాటలు యావదాంధ్ర ప్రజల నాకర్షించినవి. పంచాగ్నుల ఆది 'రాయణశాస్త్రి, బెల్లంకొండ రాఘవరావు వంటి పండిత విమర్శకులు ఎంకి పాటలను సమర్థిస్తూ ఒక కొమ్ము కాచినారు. అంతగా వాద ప్రతి వాదములు, సాహిత్య చర్చ జరిగిన ఆధునిక కావ్యము మరొకటి లేదంటే అతిశయోక్తికాదు. అప్పటికే 'హృదయేశ్వరి' 'ఊర్వశి' వంటి ఊహాప్రేయసీ విరహంతో విసుగెత్తిన తెలుగు పాఠకులకు ఎంకి, నాయుడు బావల సంభోగశృంగారము రుచించుటలో ఆశ్చర్యములేదు. ఇటువంటిదే మరొక గేయ కావ్యము విశ్వనాథ వారి కిన్నెరసాని. కిన్నెరసాని నడకలలోని సొగసు. సోయగము, ఆమె శిలయైన పరిస్థితులలోని కరుణ రసావేశము పండిత పామరులను సమానముగా నాకర్షించినవి, ఆయనను పిలిపించుకుని కిన్నెరసాని పాటలు ఆయన నోటవినని పట్టణ మారోజులలో ఆంధ్రదేశమున లేదు. కథావస్తువులోని కాల్పనిక కవితా గుణమువల్లనేమి, ఆయన చదువుటలోని బియ్యారములవల్లనేమి యీగేయములు పరితృహృదయ క్షేత్రములలో అమృత వర్షము కురిపించినవి. అర్థానుగుణమైన ఛందో గమనమునకు కిన్నెరసాని పాటలు పెట్టినది పేరు. సంపూర్ణ వస్త్వైక్యత గల కావ్యమగుటచే విది మనసాహిత్యములో చిరస్థాయిగా నిలిచినది. ఆధునికయుగము ప్రారంభమైన తర్వాత గేయమునకు సర్వజనామోదము, కావ్య గౌరవము లభించిన ఫలితముగానే రెండు కావ్యములు వెలసినవి. ఇవి నిలువ గలుగుటకు ప్రధాన కారణములు వీనిలోని కథాశ్రయ తత్వము, వస్త్వైక్యత, నాయికల జీవిత సంఘటనలకు సామాన్య జీవితముతోగల సంబంధము మొదలగునవి. ఏనాటికైనా తెనుగు ప్రజలకు ఎంకి, కిన్నెరసాని పాత్రలు గుర్తున్నట్లుగా ఊర్వశి, వత్సల పాత్రలు గుర్తుంటాయా అని నా సందేహము.

## కృష్ణశాస్త్రి వేణుగానము

రాయప్రోలుతో ప్రారంభమైన కాల్పనిక కవితా యుగంలో ఎంతమంది కవులు ప్రేమ ప్రకృతి కవితా వస్తువులుగా స్వీకరించి వ్రాసినా కృష్ణశాస్త్రిగారు అందుకున్న ఉచ్ఛస్థితిని అందుకోలేక పోయారనే చెప్పాలి, కృష్ణశాస్త్రిగారు కాల్పనిక కవిత్వానికి ఒక సంస్థవంటివారు. అందరి కంటే మిన్నగా రాసింది ఆయన, అందరి కవితలను మోసుకు వెళ్ళి ఊరంతా తిరిగి, ముఖ్యంగా యువకుల్లో ప్రచారం చేసిం దాయన. అందుకనే ప్రజల మనస్సుల్లో ప్రేమ కవిత్వానికి ప్రతినిధిగా కృష్ణశాస్త్రిగారే కనిపిస్తారు. '' భావకవి '' అనే ఊహకు రూపకల్పన చేసింది ఆయనే. ఆరోజుల్లో వందలాదియువకులు రచనలోనేకాక కట్టూ, బొట్టులోకూడా ఆయన్ను అనుకరించారంటే ఆయన ప్రభావం వారి మీద ఎంత దట్టంగా పడిందో మనం సులభంగా వూహించవచ్చు. తన మెత్తని మనస్సు. ప్రియ భాషణము, సంభాషణా చాతుర్యము, చిరునవ్వులతో పలకరింపు మొదలగు అనేక గుణములద్వారా యువలోకము నంతయు తనవైపు ఆకర్షించుకో గలిగినారు కృష్ణశాస్త్రిగారు. భావనలోనే కాక, బాహ్య రూపములో కూడా ముసలితనమనునది ఎరుగక, నెహ్రూవలె నిత్యయౌవనుడై,

ఏండ్లుపైబడి పెద్దవాడైనప్పటికీ యువకులలో యువకునివలె మెల గుతూ, యువకులకు ప్రాతినిధ్యం వహిస్తూ జీవితమును నిత్య వసంతంగా భావించి, అనుభవించిన 'భావకవి' ఆయన. పాట రాసినా, పద్యం రాసినా వచనం రాసినా, ఉపన్యాసం చెప్పినా ఆయన భాష అనితరసాధ్యము. ఆయన పదముల కూర్పు నగిషీ చక్కినట్లుంటుంది. ఆయన శిల్ప విద్యా రహస్యజ్ఞుడో, చిత్రకారుడో స్వర్గలోకమునుండి దిగివచ్చిన (మొదట్లో "దిగిరాను దిగిరాను దివి నుండి భువికి" అన్నారు. తర్వాత అభిప్రాయం మార్చుకుని) అక్షరాల ఐంద్రజాలికుడో అనిపించింది ఆయన రచనలు చదువు తుంటే. కాల్పనికోద్యమ కవులందరిలోకీ స్వయం సంపాదిత మైన మనోహర శైలీవిన్యాసముచే ఆంధ్రుల హృదయాలను చూరగొన్నారు కృష్ణశాస్త్రిగారు. తెనుగులో విశిష్టమైన వచన రచన చేయగల శబ్దశిల్పులు యిద్దరేవున్నారు. చలం_కృష్ణశాస్త్రి. విరహ మును దుఃఖ స్థాయికి తీసుకపోయి, ఆవేశమూర్తియై ఎలుగెత్తి ఏడ్చిన ఆయన కవితా తత్వము నిలుస్తుందో లేదోగాని ఆయన శైలి మాత్రము ఆంధ్ర సాహిత్యంలో పదికాలాల పాటు చెక్కు చెదరకుండా వుంటుంది. ఆయనే ఒకచోట ధీమాగా చెప్పుకున్నాడు: "శ్రీనివాసరావు వ్రాస్తున్నది మానిషాద గీతంలో వున్నది" అని ఆయన 'మహాప్రస్థానం', తెలుగు వారికి 'మానిషాద' కావ్యం వంటిదే. ఎందుకంటే ఆయన ఊహ, శైలి క్రొత్తలన్నింటిలోకీ క్రొత్తవి. "పరువంబు చెడని వాడని" పారిజాతకుసుమాల వంటివి.

## 'మానిషాద' కావ్యం

తరువాత చెప్పుకోదగిన ఘట్టం, గిడుగులాగానే తెలుగు వారిపై విరుచుకు పడిన మరొక పిడుగు-శ్రీశ్రీ. ఆయన పేరు నిజా నికి శ్రీశ్రీ కాదు; పెనుగాలి-కాదు ఝంఝూమారుతం. ఇంతకంటే గట్టిమాట ఏదైనా వుంటే అదైనాసరే. కాల్పనికోద్యమ మార్గంలో పయనిస్తున్న కవుల్నీ, ప్రజల్నీ ఎలుగెత్తి కేకేసి 'ఆగండ్రా' అన్నాడు, అతడు ముందే జాగ్రత్తపడి తెచ్చుకున్నాడు కాబోలు, పంట్లాం జేబులో నుంచి తటాలున తీసి ఎర్రజెండా చూపించాడు. అంతటితో ఆరైలు ఆగిపోయింది. అభ్యుదయ మహాప్రస్థానం ప్రారంభమైంది. గురజాడ చెప్పిన సాంఘిక ప్రయోజనా దర్శం ఎంత త్వరగా మరిచి పోయారు ఆయన తర్వాత వచ్చిన తెనుగు కవులు. పైగా "మాకోసమే మేం రాసుకుంటున్నాం, పొండి" అని దబాయించారు ప్రజల్ని ! అందుకే శ్రీశ్రీ ఏంజేశా డంటే, వచ్చేటప్పుడు ఒంటరిగారాక వందలొందలమంది ఫ్యాక్టరీ కార్మికుల్ని కొంత మంది రైతుల్నీ వెంట తీసుకొచ్చు తున్నాడు, తనకు హంగు దార్లుగా. "పతితులార, భ్రష్టులార, బాధా సర్పదష్టులార ఏడువకండేడువకండేడువకండి" నేను న్నాను, మీకేం పర్వా లేదన్నాడు. కాల్పనికోద్యమ కవులం దరూ ఆశ్చర్యంతో, మ్రాన్పడి చూస్తూ నిలుచున్నారు. "ఏమిటి, మరేం చెప్తారు?" అన్నాడు శ్రీశ్రీ ఖచ్చితంగా. ఏం చేస్తారు? అత నెవరో తెలియదు. వెంట వచ్చిన జనాభా ఎవరో అంతకు ముందే తెలియదు, అయినా అంత మంది ఒక్కుమ్మడిగా జనాభా దొమ్మీగా వచ్చి అడిగితే ఏంజేస్తారు. "మీయిష్టం. తొలగమంటే తొలగుతాం" అన్నారు దీనంగా. వారందరినీ ప్రక్కకు నెట్టేసి అభ్యుదయ కవితా సింహాసనాన్ని అధి రోహించాడు శ్రీశ్రీ.

పదిమందినీ వెనుక వేసుకు రావడం ఒక్కటే శ్రీశ్రీ బల మనుకుంటే పొరపాటు. ఆయన శబ్దబ్రహ్మ. శబ్దంగానీ, అర్థం కానీ, ఛందస్సుకానీ, అలంకారంగానీ ఆయనకు ఊడిగం చేయ వలసిందే. తెనుగు కవిత్వంలో మార్క్సిస్టు దృక్పథమనే నూత నాంశాన్ని ఆయన ప్రవేశపెట్టాడు. రష్యా విప్లవ ప్రభావంవల్ల నేమి, యితర అంతర్జాతీయ సంఘటనల ప్రభావంచేత నేమి ఆనాడు యువకుల్లో అధిక సంఖ్యాకులు సోషలిజానికి సుముఖులై వున్నారు. సోషలిస్టు సమాజ లక్ష్యంతోనూ, ప్రస్తుత సమాజం లోని దుర్భర పరిస్థితులకు గురియై పీడితులైన ప్రజల సముద్ధ రణ లక్ష్యంతోనూ, మళ్ళీ గురజాడ చెప్పిన సమాజవాద చైతన్యం పుంజుకుని సాంఘిక ప్రయోజన పరత్వంతో శ్రీశ్రీ నాయకత్వాన తెనుగు కవిత్వంలో అభ్యుదయ యుగం ప్రారంభ మైంది.

మళ్ళీ వ్యక్తికి ప్రాధాన్యంపోయి సమాజ శ్రేయస్సు కవులలక్ష్యమై నిలిచింది. "వ్యక్తికి బహువచనం శక్తి" అని సూత్రప్రాయంగా నిర్దేశించాడు శ్రీశ్రీ. ఆయన వ్రాసిన "దేశ చరిత్రలు", "జగన్నాథ రథచక్రాలు", "మరో ప్రపంచం" వంటి గీతాలు అభ్యుదయ కవితోద్యమానికి పునాదులవంటివి. ప్రేయసిని పోగొట్టుకుని విరహవేదన పడుతున్న ప్రేమకవుల కౌగి ళ్లలో చిక్కి నలిగిపోతున్న కవితా సరస్వతిని వదిలించి, తన వెంట బెట్టుకుని వెళ్ళి ప్రపంచదేశాలన్నీ చూపించి, ఆయా సాహిత్యాలరుచి చూపించి తీసుకువచ్చాడు. ఆయన ఏ ముక్క రాసినా వేదవాక్యమంత శక్తివంతంగా వుంటుంది. వేళాకోళంగా రాసినా సభల్లో ఉదహరించడానికి వీలుగావుంటుంది. కొంచెం కోణాలు రాసినా కొట్టవచ్చినట్లుంటాయి. శ్రీశ్రీ పూర్తిగా ప్రయోగశీలి. కవిత్వంలో నిత్యనూతనాభిలాషి. కనుకనే సర్రియలిస్టు కవిత్వాన్ని తెనుగులో ప్రవేశపెట్టాలని ప్రయత్నంచేశాడు. గురజాడ కవిత్వంలోలాగానే శ్రీశ్రీలో కూడా ఏవిధమైన కవి త్వపు ముసుగులు లేకుండా చెప్పదలచింది సూటిగాచెప్పే అల వాటూ, నేర్పూవున్నాయి. అవే ఆయనకు ప్రజామోదాన్ని సమకూర్చి పెట్టాయి మరి సర్రియలిజం అంతవంకరగా చెప్తుందిగదా, ఎందుకు చేపట్టాడంటే, బహుశా తన వ్యక్తిగత ఆనందంకోసం అయివుంటుంది. నిత్యనూతన ప్రియుడు కాబట్టి.

## అభ్యుదయోద్యమం

శ్రీశ్రీ తర్వాత వచ్చిన కవులు ఆయన వేసినబాటలోనే నడుస్తూ అభ్యుదయోద్యమానికి కొంత పుష్టి చేకూర్చారు. ఈ కాలంలో తెనుగుకవిత్వం క్రొత్తగా ప్రవేశించినగుణం కవియొక్క అంతర్జాతీయ దృక్పథం. జాతీయ సరిహద్దులను దాటి, మానవ కారుణ్యవాద బలంతో అభ్యుదయకవులు కథా వస్తువుకోసము ప్రపంచంలోని అన్నిమూలలూ గాలించారు. సామాన్య ప్రజల శ్రేయస్సుకు నష్టకరంగా పాలకవర్గ ప్రతినిధులు ఎక్కడ ఏ

అన్యాయం చేసినా ఎదిరించి విలిచారు తమచుట్టూవున్న ప్రజల సమస్యలను, ఊహావేశాలను తమ కవితలో ప్రతిబింబింపజేశారు. కాని ఎంత సేపటికీ శ్రీ శ్రీ ఎంతవరకు చూపాడో, అంతవరకే చూడగలిగారు కాని ఆపైన చూడలేకపోయారు. సామాన్యుణ్ణి గురించి తీవ్రమైన వేదన పడడమేగాని, అతణ్ణి కథానాయకుడిగా చేసి, అతని కష్టసుఖాలు, మంచిచెడులను సమగ్రంగా చిత్రిస్తూ తత్కారణమైన సాంఘిక వ్యవస్థను, దానిలోపాలను చూపిస్తూ, వస్త్వైక్యత, కవితా శిల్పముగల కావ్యములను నిర్మించుటలో అభ్యుదయకవులు విఫలమైనారు. అందుకే అనతికాలంలోనే అభ్యుదయోద్యమం దెబ్బతిన్నది అవ్వాయిచువ్వలా ఆకాశానికి లేచినదల్లా మరుక్షణంలోనే భూమికి దిగివచ్చింది ఎన్నో కేకలు వేశారు, గేయాలురాశారు, సామాన్యుడిమీద జాలి ఒలకపోశారు. ఏంలాభం? మన సానుభూతికి అర్హమైన పూర్ణమ్మలాంటి పాత్రనైనా సృష్టించలేకపోయారు దువ్వూరి రామిరెడ్డిగారి "కృషీవలుడు" వంటి కావ్యమైనా బైటికి రాలేదు టెక్నిక్ విషయంలో పరిశోధనలు చేసుకుంటూ కొందరు కవులు కొత్తబాటలు తీర్చారు గాని అభ్యుదయోద్యమం ఎందుకు పుట్టిందో నిరూపించగల, శాశ్వతమైన విలువలుకల కావ్యం మాత్రం రాలేదనే చెప్పాలి శ్రీ శ్రీ తర్వాత వచ్చిన అభ్యుదయకవులు, ఆరుద్ర, అనిసెట్టి, కుందుర్తి, తిలక్ సోమసుందర్, రమణారెడ్డి ప్రభృతులలో ఏ ఒక్కరూ ఆపని చేయలేకపోయారు

## వచనకవిత

అభ్యుదయక కవిత్వము తరువాత వచ్చిన దశలో వచన గేయ ప్రక్రియ బాగా అభివృద్ధి చెందింది ఆరుద్ర, తిలక్, కుందుర్తి ప్రభృతులు దీనిని బాగా తీర్చి దిద్దారు. ఈనాడు తెనుగు సాహిత్యంలో వచనకవిత రాజ్యం చేస్తున్నదని చెప్ప వచ్చు అభ్యుదయోద్యమ కాలంలో ఒకేరకమైన వస్తువుకు పరిమితమైనట్లు కనిపించిన ఆధునిక కవిత నేడు వచనగేయంద్వారా సర్వరసములను స్పృశించడానికీ, నిర్వహించడానికీ తగిన ప్రకటన సామర్థ్యాన్నీ, అనుభవాన్నికూడ సాధించుకున్నది. శ్రీశ్రీ, శిష్లా, నారాయణబాబులు ఆద్యులుగా ఆవిర్భవించిన యీ సాంప్రదాయచ్ఛందోరహిత కవితారూపముకూడా నేటివరకు ఖండికలకు మాత్రమే పరిమితమై నడుస్తున్నది. పైగా కవిత సమాజవాదమును మళ్ళీ వదిలేసి వ్యక్తివాదమువైపు మొగ్గు జూపుతున్న సూచనలు, తత్ఫలితముగా నిష్ప్రయోజన కరములైన ప్రయోగముతో కాలము వెళ్ళబుచ్చు నలవాట్లు కనిపిస్తున్నాయి సర్వతంత్ర స్వతంత్ర స్వేచ్ఛా ప్రియత్వముచేత ఛందస్సు బంధాలనూ యమకాద్యాలంకారాలనూ, కవితలో పాండిత్య ప్రకర్షనూ, పదగుంభనా వ్యామోహమునూ వదిలించుకుని, నిరాడంబర కవితవైపు మొగ్గుజూపిన యీ కవులు, అసలు యీ లక్షణములన్నీ ఏ పరమప్రయోజన సాధనముకొరకు అలవరచుకొన్నారో, దానినే పూర్తిగా విస్మరించినట్లయితే, యీ కవులనూ, వచన కవితాప్రక్రియనుకూడా సాహిత్య చరిత్ర విస్మరిస్తుందనడంలో సందేహములేదు

## కాలమే నిర్ణేత

నవ్యకవితారంగములో యిటీవలి కాలములో యింత సంరభము జరుగుతూవుండగా, మామూలు సంప్రదాయ పద్ధతుల్లో మహాకావ్యాలూ, మంచికావ్యాలూ వస్తూనే వున్నాయి. వీటిలో ప్రథమగణ్యములు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "రామాయణ కల్పవృక్షము", శ్రీ గడియారం వేంకటశేష శాస్త్రిగారి "శివభారతము", శ్రీ మధునాపంతుల సత్యనారాయణగారి "ఆంధ్ర పురాణము" గురజాడతో ఆరంభమైన యీ నవ్యకవితోద్యమం, యిన్ని మెలికలు తిరిగి, యిన్ని సోపానములుదాటి యింతవరకు వచ్చింది ఇకముందు సంప్రదాయవాదులవలనే మంచి కావ్యములు, మహాకావ్యములు వ్రాయనుద్యమించి, విజయము సాధించి చరిత్ర కెక్కుతుందో, లేక మూన్నాళ్ళ ముచ్చటగా మురిపించి వెనుకడుగువేస్తుందో ఎవరు చెప్పగలరు! అసలు మళ్లీ సంప్రదాయచ్ఛందో మార్గమే పుంజుకోకూడదని ఎక్కడుంది? ఏమో, ఎవరు చెప్పగలరు? దీనికి జవాబు చెప్పగలిగినశక్తి కాలమే.

★

---

మానవచరిత్రలో ఇంతవరకూ అందుబాటులోలేని విద్యా సౌకర్యాలు ఈశతాబ్దంలో ఉన్నాయి పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు గ్రంథాలయాలు, ఉపాధ్యాయులు, ఆచార్యులు, వార్తా పత్రికలు ఉపన్యాసకులు, విమర్శకులు, రేడియో, సినిమా—ఇదివరకెన్నడూ లేనంతమంది విద్యావంతులు ఈ తరంలో తయారయారు. అయితే ఫలితం? ఇపుడున్నంత అశాంతి, క్రౌర్యం, యుద్ధకాంక్ష, ఇంద్రియ దౌర్బల్యం, స్వార్థపరత్వం, ఇదివరకు మానవచరిత్రలో లేవు

—నార్మన్ఏంజెల్

సొగసులేని మనిషేవుండడు. స్నేహమూ, ప్రేమా అనే అనాది అయిన్నీ, యెప్పటికీ నరికొత్తగా ఉండేరెండు వెలుగులను నరులమీదవంచి తిప్పికాంచితే వింతవింతసొగసులు బయలుదేరుతవి. అసూయఅనే అంధకారంలో అంతా ఏకనలుపే.

—గురజాడ

---

తరతరాలుగా ప్రసిద్ధిగన్న

# భారతీయ చేనేత పరిశ్రమ

కోటపాటి మురహరిరావు

అది 1701 సెప్టెంబరు 29 బ్రిటిష్ పార్లమెంటు సమావేశమైంది. సభ్యులంతా హడావుడిగా వాగ్వివాదాలు జరుపుకొంటున్నారు. కొంతమంది ఈస్టిండియా కంపెనీ వారిని, వారి డైరెక్టర్లను దుయ్యబడుతున్నారు: బల్లలు అదరుతున్నాయి. కేకలు మిన్ను ముట్టుతున్నాయి. "ఓ! ఇంగ్లండు ప్రజలారా! పరదేశస్థులు మిమ్ములను నాశనం చేస్తున్నారు, మ్రింగేస్తున్నారు. మీ మోహాలు, అనుకరణలు మిమ్ములనే మ్రింగుతున్నాయి" అని గర్జించాడొక సభ్యుడు.

ఆ కేకలు పెడబొబ్బలు యేదో గొప్ప యుద్ధ ప్రమాదాన్ని గురించి కాదు. ఒక రాజరికాన్ని, నిరంకుశత్వాన్ని మార్పు తెచ్చుటకు అసలేకాదు. భారతదేశం నుండి ఈస్టిండియా కంపెనీ వారు వ్యాపార రీత్యా బ్రిటనుకు తెచ్చిన చేనేత బట్ట ప్రజలలో కలుగ జేసిన వ్యామోహాన్ని గురించి, ఆ సున్నితమైన మృదువైన మిరుమిట్లు కొలిపే కాలికో, మస్లిన్, మఘమల్, చింట్జి, గాంగేతిక వస్త్రాలపై ఆదేశప్రజలకు, ప్రత్యేకించి స్త్రీలకు, కలిగిన వ్యామోహాన్ని గురించి, తత్ఫలితమైన ఆర్థికస్థితిని గురించి పార్లమెంటు సభ్యులు చర్చిస్తున్నారు ఆ చర్చా ఫలితమే ఆ నాడు ఒక చట్టము చేయబడినది. సారాంశం-భారత దేశం నుండి కాలికో తదితరమైన చేనేత బట్ట బ్రిటనులో ప్రవేశించ గూడదని నిర్ణయించడమైనది.

చట్టాలు, శాసనాలు ప్రజల అభిమానాన్ని, వ్యామోహాన్ని ఒక్కసారిగా మార్చలేవు శాసనం గావించబడ్డ ఒక్క సంవత్సరంలో అదివిఫలమైనట్టు గుర్తించ బడినది ప్రభుత్వ దృష్టికి రాకుండానే 9,51,109 తానుల భారతీయ చేనేత బట్ట దిగుమతి జరిగింది ప్రభుత్వం దిగ్భ్రమ చెందింది. ఆర్థికవేత్తలు విస్తుపొయ్యారు దిగుమతి నిలుపుదలకు వేరు మార్గాలు అన్వేషించబడ్డాయి. 1702లో భారతీయ బట్టపై 15% దిగుమతి సుంకం విధించబడినది అయినా ప్రజల వ్యామోహము మారలేదు. 1718లో 12,20,324 తానులు దిగుమతి జరిగింది. సుంకంవలన దిగుమతి తరుగుదల కంటె పెరుగుదల జరిగింది.

దీని పర్యవసానంగా బ్రిటను ఉన్ని నేత వృత్తులవారు సగంపైగా పనులను కోల్పోయారు పారిశ్రామికులకు నిత్య ఆహారం గడవడం కష్టమయింది కుటుంబాలు భారంగా తోచాయి ఈ వృత్తివారంతా భుక్తికొరకూ దేశసంచారం బయలుదేరి కాన్టర్బరి నుంచి లండనుకు, లండనునుంచి నార్విచ్చికి పొట్టచేత పట్టుకొని తిరగవలసి వచ్చింది దేశీయ వ్యాపారులు ఈస్టిండియా కంపెనీ వారితో తట్టుకొనలేక దివాళాస్థితికి వచ్చారు. ప్రభుత్వ ఖజానాలు ఖాళీఅయి బంగారం హరించి పోసాగింది అందువలన ఒక ఉద్యమాన్ని లేవదీయవలసి వచ్చినది అదే భారతదేశవస్తు బహిష్కరణోద్యమం అనేక కరపత్రాలు పంచబడ్డాయి పత్రికలు సంపాదకీయాలు, వ్యాసాలు ప్రకటించాయి. రాజకీయ వర్గంలో సంచలనం కలిగింది దానిఫలితం భారత దేశానికి వచ్చే బంగారం నిలుపుదలకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి

1719లో మరొకసారి భారతదేశ చేనేతబట్టల గురించి పునః పరిశీలన జరుపబడ్డది

" Which prohibited the wear and use of Indian silks and calicoes painted, strained, ordyed in England under penalty of £. 5 for each offence on the wearer and of £ 20 on the seller." ఇంగ్లండు దేశంలో భారతీయ సిల్కు కాలికో అద్దినవి, రంగువేయబడినవి ధరించుట, ఉపయోగించుట నిషేధించటమైనది. ధిక్కరించి ధరించిన వారికి పౌ. 5-లు అమ్మిన వారికి పౌ 20-లు శిక్ష విధించుటకు నిర్ణయించడమైనది

ఈ శాసనం కూడా మునుపటి దానివలెనే పేపర్లపైన మిగిలిపోయింది దొంగవ్యాపారం ప్రబలింది 1723లో 11,15,000 తానులు, 1724లో 12,91,614 తానులు కాలికోబట్ట, 1723లో 58,729 తానులు సిల్కు, 1724లో 79 602 తానుల బెంగాలి సిల్కు దిగుమతి జరిగింది. ఈ శాసన విఫలత్వాన్ని ఒక ఇంగ్లీషు పత్రిక యిట్లు వ్యాఖ్యానించింది Two things amongst us are ungovernable our passions and fashions.

భారతీయ బట్టపై ఒక్క ఇంగ్లండు మాత్రమేకాదు. ఆనాడు యూరపు దేశాలన్నీ శాసనాలను చేసాయి పన్నులు విధించాయి అట్టివి 15% నుండి 80% వరకు వుండుట కద్దు. ఫ్రాన్సులో లూయీస్ XV 1726లో భారతదేశమునుండి దొంగ దిగుమతులకు మరణశిక్ష విధించాడు.

అది 18వ శతాబ్దపు ప్రారంభములో భారతీయ చేనేత పరిశ్రమ అది చేనేత పారిశ్రామికుని కౌశల్యము, నిపుణత పాశ్చాత్యుల్లో వ్యామోహాన్ని పుట్టించి మైమరపించే బట్టను మన పారిశ్రామికుడు ఉత్పత్తిచేసాడు సిడియడ్ మహాశయుడన్నట్లు, కన్యాకుమారినుండి చైనావరకు ప్రతిస్త్రీ పురుషుడు, బాలుడు బాలిక

భారతీయ వస్త్రవ్యామోహంలో పడిపోయి వారివారి దేశసంస్కృతులను మరచిపోయారు.

## పరిశ్రమ విచ్ఛిత్తి

బౌద్ధ భిక్షువులు సింహళ, జావ, సుమిత్ర, బోర్నియో ఇండొనేసియా, చైనాదేశాలలో జ్ఞాన భిక్షపెట్టి చైతన్యాన్ని కలిగిస్తే భారతీయ చేనేత పారిశ్రామికులు ఆయాదేశాల్లో నాగరికతను సృష్టించటానికి కారణభూతులయ్యారు బౌద్ధ భిక్షువులు భట్టిప్రోలు ఘంటశాల, జగ్గియ్యపేట, అమరావతి, నాగార్జునకొండ, తక్షశిల, సాంచి ప్రాంతాలనుంచి జ్ఞానాన్ని వెదజల్లితే, చేనేత పారిశ్రామికులు చినగంజాం, చెన్నపట్టణము, చిట్టగాంగ్, కాలికట్టు, పులికట్టు సూరత్, ఢక్కా, విశాఖపట్టణం, కలకత్తాలనుండి నాగరికతకు మూలమైన బట్టను పంపారు వాటి రెంటి మిశితమే నేటి ఆ దేశాల సాంస్కృతి సాంప్రదాయాలు. బౌద్ధానికి పుట్టినిల్లు యైన భారతంలో బౌద్ధమతం నామ మాత్రమైంది తరాలనాడు ఖ్యాతి పొందిన మన నేత శిల్పి నేడు ఖ్యాతి హీనుడయ్యాడు అందుకు గల కారణాలు ఒక్కసారి సింహావలోకనం చేద్దాం.

## ఈస్టిండియా కంపెని

యూరపు దేశాలనుండి భారతదేశానికి వ్యాపారానికి వచ్చిన అనేక కంపెనీలలో ఈస్టిండియా కంపెనీ ఒకటి ఇది 1600 సం॥ లో ప్రారంభించ బడినది మిరియాలు, ఇండిగో, సుగంధ ద్రవ్యాలు మొదలైన వ్యాపారాలు భారత దేశంతో ప్రారంభంలో చేస్తుం దేది 1670 వచ్చేటప్పటికి యీ కంపెనీవారు భారతీయ చేనేత బట్టలవ్యాపారాన్ని చేపట్టారు 1688లో ఫ్రాన్సునుండి ఇంగ్లండుకు బట్ట దిగుమతి నిలుపుదల జరిగినప్పుడు దాని వ్యాపారం బహుముఖంగా పెరిగి మిరియాలు,సుగంధ ద్రవ్యాలువదలి పూర్తిగా బట్టలవ్యాపారంలో లగ్నమయ్యారు దానితో మిన్నుముట్టు లాభాలు గడించారు ఇంగ్లండు దేశంలో భారతీయ బట్టను ధరించుట, వాడుట గొప్ప నాగరికత క్రింద పరిగణించ బడ్డది

1757లో ఈస్టిండియా కంపెనీవారు బెంగాలు ప్రాంతమును తమ స్వాధీనములోనికి తీసుకున్నారు తరువాత ప్లాసీ యుద్ధంతో తూర్పు సముద్ర తీరప్రాంతమంతా వీరి రాజకీయ పాలన లోనికి వచ్చినది ఇదే భారతదేశ ప్రజ బానిసత్వమునకు నాంది ఆర్థిక విధానమునకు గొడ్డలిపెట్టు, చేనేత శిల్పి సృజనాత్మక శక్తికి వెన్నుపోటు,

## ఒకరి దారిద్ర్యం మరొకరి పెట్టుబడి

బెంగాలు రాజకీయ బానిసత్వం పొందుటతో ప్రజలు వృత్తి స్వేచ్ఛను కోల్పోయారు. ఆ ప్రాంతంలోని చేనేత పారిశ్రామికుల నందర్ని ఈస్టిండియా కంపెనీవారి గుమాస్తాల చేతుల్లో బానిసలుగా మార్చారు పారిశ్రామికులను బలవంతంగా కంపెనీ వారి కార్ఖానాలో పని చేయించేవారు ధిక్కరించి స్వయంవృత్తి స్వయం వ్యాపారాన్ని చేసుకున్న వారిని చేతులు నరకటమేగాక మరణ శిక్షలు కూడా విధించారు. సూరత్ నుండి వచ్చే ప్రత్తి నంతా కంపెనీవారు కొనుగోలు జేసి, అధిక ధరలు విర్ణయించి, పారిశ్రామికులకు అమ్మేడివారు బట్టధర పెరుగకుండా చేయుటకు వారి నేతమజూరీలను తగ్గించేవారు అందువలన యెంత కష్టపడినా పొట్టగడుచుట అసాధ్యమయ్యెడిద్ధి తయారీ బట్టను మరొకరికి అమ్మకుండా కంపెనీవారే స్వయముగా కొనుగోలుజేసి అధిక ధరలకు వారి దేశంలో విక్రయించెడివారు. మిన్నుముట్టిన లాభాలను స్వదేశంలో పరిశ్రమాభివృద్ధి కుపయోగించెడివారు

## పాశ్చాత్య దేశాల్లో పారిశ్రామిక విప్లవం

భారతదేశంలో బ్రిటిష్‌వారు రాజకీయ అధికారం సంపాదించి మూడు సంవత్సరములు గడిచినదో లేదో యింతలో 1760 లో "ఫ్లయింగ్ షటిల్" మగ్గము కనుగొనబడ్డది 1764 లో కట్టెలకు బదులు బొగ్గు వంటచెరకుస్థానం ఆక్రమించింది హార్ గ్రేవ్సు దూదిఏకుడు యంత్రం కనుగొన్నాడు 1768 నాటికి ఆవిరి యంత్రం ఉపయోగంలోకి వచ్చింది 1785 నాటికి పవరు లూము కనుగొనబడటం, పేటెంటు జేయబడటం జరిగింది. ఇదంతా 25 సంవత్సరాల మార్పిడి పాశ్చాత్యమేధావులు నవీన శక్తులను ఉపయోగంలోకి తెచ్చుచున్న దినములలో మనం సాధించిన స్వాధీన శక్తులు బానిసత్వములోనికి పోవుట ప్రారంభమయ్యాయి.

## ఒకరి దుర్బలత మరొకరి వీరత్వము

18 వ శతాబ్దపు చివరిదశలో ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవముకు నాందివేయబడ్డది అయినా భారతీయ వస్తు ఉత్పత్తిని దెబ్బ కొట్టలేకపోయింది పాశ్చాత్య దేశాల్లో భారతీయ ఎగుమతులు తగ్గలేదు పైగా యాంత్రిక ఉత్పత్తిద్వారా గిట్టుబాటైన ధరకంటె సగం ధరలో చేతి వృత్తులద్వారా తయారయిన వస్తువులను యెంతో ఆకర్షణీయంగా తయారు చేసి అందించబడవి అందుపై బ్రిటిషువారు భారతదేశంలో వారి రాజకీయ ప్రాబల్య రుజావుకు ప్రారంభించారు 1812 లో ఇంగ్లండుకు దిగుమతి చేయబడే బట్టలపై ఈ క్రింది విధంగా పన్నును విధించారు

| | పౌ 100/ కు. |
|---|---|
| కాలికో, సాదా, తెల్లవి...... | 68 పౌ. 6 షి. 8 డి, దిగుమతి పన్ను 3 పౌ 6 షి. 8 డి గోదాముపన్ను. |
| నూలు బట్టలు. | 27 పౌ 6 షి 0 డి దిగుమతి పన్ను 10 పౌ. 0 షి 0 డి గోదాముపన్ను |
| సిల్కు | పూర్తిగా నిషేధించటమైనది |

అందుచే 1795_96 లో 21, 22, 089½ తానులు భారత దేశంనుండి ఎగుమతి చేయబడితే 1829_30 వచ్చేటప్పటికి 6,95,725 తానులు మాత్రమే ఎగుమతి చేయబడ్డది

బ్రిటనువారు యింతటితో తృప్తిజెందక భారత దేశంలో దిగుమతి చేయు వారి వస్తువులపై ఎట్టి పన్నులు లేకుండా చేసిరి అంతేగాకుండా ఈస్టిండియా కంపెనీవారి ఉద్యోగులద్వారా తెచ్చిన సరుకులకు ఉచిత ప్రయాణ సౌకర్యములు కలుగజేసిరి ఇవ్విధముగా పాశ్చాత్యులు వారి రాజకీయ అధికారమును వ్యాపార స్వార్థము కొరకు తరలించిరి

## బెంగాలు పన్నులు-బ్రిటను భోగము

బెంగాలు స్వాధీనమైన ఆరు సంవత్సరములలో వారు వసూలు చేసిన మొత్తము పన్నులు పౌ 13,066,761 అందుకుగాను ఖర్చు పౌ 9,027,609 పోగా పౌ. 4,039,152 లలో బ్రిటనుకు సరుకుల రూపంలో పంపబడినవి ఇంతేగాకుండా కంపెనీ ఉద్యోగుల స్వంత ఆర్జనలు పౌ 4,686,875 కూడా సరుకుల రూపంలో పంపబడ్డాయి ఈ మూల ధనాన్నంతా బ్రిటన్‌లో పారిశ్రామిక పెట్టుబడికి ఉపయోగించబడినది

ఈ విధంగా భారతీయ చేనేత పరిశ్రమను విచ్ఛిత్తి చేసి భారతావనిని కొల్లగొట్టి మన బంగారు మణులను బ్రిటనులో మహా యాంత్రిక విప్లవాన్ని సాధించటాని కుపయోగించుకున్నారు ఆనాడే భారతావని స్వాతంత్ర్య దశలో వున్న పక్షంలో ఈ దుర్గతి మనకు పట్టియుండెడిది కాదు భారతీయ సృజనాత్మక శక్తి పాశ్చాత్య వ్యాపార దృష్టిని త్రిప్పికొట్టి యుండెడిది భారతీయ మధ్య తరగతి ధైర్యసాహసాలు నవీన యాంత్రిక విప్లవమునకు నాంది పలికి యుండెడిది భారతీయ శాస్త్రీయజ్ఞానం ప్రపంచ ప్రజను విభ్రమ చెందించి యుండెడిది ★


## ఇద్దరు లేక ముగ్గురు పిల్లలు చాలు



డాక్టరు సలహా పాటించండి 

# అడవి మల్లె

## జరిగిన కథ

చంద్రం వట్టి అడవి పువ్వువంటి గౌరిని అభిమానించడం హేమకు ఏ మాత్రం యిష్టంలేదు. తన వస్తువును గౌరి దొంగిలించేస్తోందన్న భావం హేమలో ఏర్పడిపోయింది నిజానికి గౌరి విషయంలో చంద్రం చూపిస్తూన్నది కేవలం అభిమానమే అన్న విషయాన్ని హేమ మనసు అంగీకరించడంలేదు. ప్రకాశాన్ని పోలీసులు తీసుకొని పోతున్నారన్న వార్త చెప్పడానికని వచ్చిన గౌరివెంట చంద్రం వెళ్ళిపోవడంతో హేమ కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి చంద్రంమీదకూడా ఆమెకు అసహ్యం పుట్టుకొచ్చింది.

---

కాని ఒక్క అమాయక బాలిక హృదయం ఎంత బరువై పోయిందో ఎవరూ ఆలోచించలేదు.

అందర్నీ కారు వరకూ వెళ్ళి సాగనంపారు చంద్రం, ప్రకాశం.

"ఇవ్వాళ నాకు చాలా ఆనందంగా సంతృప్తిగా వుందిరా చంద్రం '' అన్నాడు లోపలకు వస్తూ ప్రకాశం. చంద్రం జవాబు ఇవ్వ లేదు. చంద్రానికి ఇంకా తన అదృష్టం మీద నమ్మకం కలగటంలేదు,

ప్రకాశం బండికి సమయం అయిందని బయలుదేరి వెళ్ళి పోయాడు.

చంద్రం నవలను ముగింపదొరికింది

ప్రొద్దుట ఎనిమిది గంటలకు కూర్చున్న చంద్రం నవల పూర్తి చేసి లేచేటప్పటికి పన్నెండు దాటింది.

అప్పుడు గాని చంద్రానికి గౌరి జ్ఞాపకంరాలేదు. లేచి గది నుంచి బయటకు వచ్చాడు. గౌరి వంటింటి గడపకు చేరబడి శోక మూర్తిలా కూర్చొనివుంది ముఖం అంతా ఏడవటం వల్ల బాగా వుబికివుంది. చంద్రం కారణం అర్థం చేసుకున్నాడు. మనసులో ఎక్కడో కలుక్కుమంది. ఆమెను ఎలా ఓదార్చటం! ఏమని ఓదార్చటం!

"గౌరీ! భోజనం చేశావా? '' మృదువుగా ప్రశ్నించాడు చంద్రం. గౌరి బాగా వాచివున్న కనురెప్పల్ని బరువుగా ఎత్తి చంద్రం ముఖంలోకి ఓ క్షణంచూసి మళ్ళీ వాల్చేసింది.

"ఎందుకలా బాధపడతావు, నేను ఎక్కడకు పోతున్నానని. నేను రోజూవచ్చి నిన్ను చూసివెళతానుగా. వచ్చేనెలలో టుటోరియల్ కాలేజీలో చేర్పిస్తాం బాగా చదువు కుందువుగాని, ప్రకాశం చాలా మంచివాడు."

చంద్రానికి తన మాటలు తననే వెక్కిరించినట్లు అనిపించాయి. గౌరికి కావాల్సిందేమిటో తనకు తెలియదా? తెలుసు కాని తెలియనట్లు ప్రవర్తించటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని తను ఏం చెయ్యగలడు? ఎలాగయినా గౌరిని ఒప్పించి ప్రకాశాన్ని ఒక ఇంటివాణ్ణి చెయ్యాలి. ఈ మధ్య ప్రకాశంలో ఎంతో మార్పు కనిపిస్తుంది. అనుక్షణం దేనికోసమో బాధపడుతున్నట్లు ప్రకాశం నవ్వు ముఖంలో కూడా కనిపిస్తునేవుంది. ప్రకాశం గౌరిని ప్రేమిస్తున్నట్లు తనకు తెలుసు. కాని ప్రకాశం తనకంటే చాలాగొప్ప వాడు. మనస్సులోని బాధ ఒక్కనాడు కూడా బయట పెట్టలేదు. లోకంబాధను తను అనుభవిస్తాడేకాని తన బాధను లోకంమీద రుద్దడు. తను ఎలాగయినా ప్రయత్నించి గౌరి మనస్సును మార్చి ప్రకాశంను ఒక ఇంటివాణ్ణి చెయ్యాలి-తనకు తనే సర్దిచెప్పుకోన టానికి ప్రయత్నించాడు చంద్రం.

వాసిరెడ్డి సీతాదేవి

గౌరి మౌనంగా చంద్రానికి అన్నం వడ్డించింది. గౌరిని అంతర్ముఖావంగా ఏనాడూ చూడని చంద్రం కొంచెం భయపడ్డాడు మల్లెపువ్వుకంటే స్వచ్ఛమైన, శరత్కాల వెన్నెలకంటే చల్లనైన జలప్రపాతంలోని శక్తికంటే ఉత్తేజకరమైన గౌరి అకృత్రిమమైన ప్రేమను తిరస్కరించి తను తప్పు చెయ్యటం లేదు కదా! గౌరికి అన్యాయం జరుగుతుందని తనకు తెలుసుకాని తను ఏంచెయ్య గలడు! తన మనస్సు ఏనాడో మంచి మల్లె సౌందర్యానికి ముగ్ధమై దాని చుట్టూతిరుగుతుంది ఇప్పుడు ఆమనస్సును గంధ రహితమైన అడవి మల్లెవైపుకు ప్రయత్నించికూడా మరల్చలేడు. గౌరి మీద తనకున్నది ఆమె అసహాయత మీద జాలిమాత్రమే.

చంద్రం భోజనం ముగించిలేచాడు అతని మనస్సు హేమ వైపుకు పరుగెత్తింది నిన్న జరిగిందానికి హేమ తనను క్షమి స్తుందా! హేమ ఏదో ఉద్రేకంలో అలా అంది కాని తను వెళితే రావద్దన గలదా! గౌరినిచూసిన ఆమెలో స్త్రీ సహజమైన అసూయ తల ఎత్తి వుంటుంది! అందువల్ల అంత అభిమానం చూపించే హేమ నిన్న అంత బయట పడిపోయింది. హేమ పట్టుకున్న తన చేతిని చూసుకుని ముసిముసిగా నవ్వుకున్నాడు

ఈ పాటికి తను రేపు ఇంటికి వస్తున్నట్లు హేమకు తెలిసే వుంటుంది నవలకూడా పూర్తయింది, ఇది తీసుకెళ్ళి ఇప్పుడే ఇవ్వాలి అది చదువుకున్న హేమ మనస్సులో అలుముకున్న అనుమానపు కారు మేఘాలు విచ్చిపోతాయి

నవల స్క్రిప్టును పట్టుకొని బయలు దేరాడు చంద్రం ఎప్పుడూ తనదుస్తుల్ని గురించి ఆలోచించని చంద్రం ఆనాడు ముస్తాబులో చాలా శ్రద్ధతీసుకున్నాడు మనస్సు చాలా తేలిగ్గా ఉల్లాసంగా అనిపించింది

చంద్రం వచ్చేటప్పటికి హేమ, ప్రసాదరావు హాల్లో కూర్చొని మాట్లాడు కుంటున్నారు చంద్రంను చూసిన హేమ మనస్సు జుగుప్సతో నిండిపోయింది గబుక్కున లేచి వడివడిగా లోపలకు వెళ్ళి పోయింది ప్రసాదరావు ఆశ్చర్యపడకపోలేదు అలావెళ్ళి పోతున్న హేమ ముఖం స్పష్టంగా కనిపించింది చంద్రానికి, అంత కంటే స్పష్టంగా కనిపించింది ఆమె ముఖం ఏవగింపు ఏ నది వడ్డునో కూర్చొని వున్నవ్యక్తి యధాలాపంగా పక్కనవున్న చిన్న రాయిని చేత్తో తీస్తుంటే, దాంతోపాటు ఏ లద్దె పురుగో చేతి లోకివస్తే ముఖం ఎలా మారుతుందో, తనను చూసిన హేమ కూడా అలాగే చీదరించుకొని వెళ్ళిపోయింది చంద్రం అంతరాంతరాల్లో ఏదో గుచ్చుకుంది

''కూర్చో చంద్రం! అలాగే నిల్చున్నావేం " అన్నాడు ప్రసాదరావు హేమ ప్రవర్తనకు ఆయనకూడా బాధపడు తున్నట్లు ఆ స్వరమే చెప్పక చెబుతుంది.

చంద్రం యాంత్రికంగా కుర్చీలో కూలబడుతూ చేతిలోని స్క్రిప్టును టేబుల్ మీద వుంచాడు.

"ఏమిటది చంద్రం?''

"నవల రాశానండీ! అది మీకూ హేమకూ చదివి వినిపించా లని తెచ్చాను '' అన్నాడు చంద్రం బావిలోనుంచి మాట్లాడు తున్నట్లు

ప్రసాదరావు వుత్సాహంగా స్క్రిప్టును చేతిలోకి తీసు కున్నాడు ''చదివి వినిపిస్తే బాగుండదు ముందునేను చదివేస్తాను తరవాత హేమ చదువుతుంది నువ్వు పైకెళ్ళి హేమతో మాట్లాడుతుండు ఇంతలో నేను దీన్నిపూర్తిచేస్తాను '' మరో జవాబుకు ఎదురు చూడకుండానే ప్రసాదరావు స్క్రిప్టు చదవటంలో లీనమయిపోయాడు

చంద్రం లేచి నిల్చున్నాడు హేమ గదికి వెళ్ళటానికి ఓ క్షణం తటపటాయించాడు అవును! ఆమె దృష్టిలో నిన్నటి తన ప్రవర్తన క్షమించరానిదే తను ఆమెకు నచ్చజెప్పాలి గబగబా పైకి ఎక్కి హేమ గదిలో ప్రవేశించిన చంద్రం హేమ తల దిండులో దూర్చి పడుకొని వెక్కివెక్కి ఏడవటం కని పించింది చంద్రం ఓ నిముషం అలాగే నిలబడిపోయాడు

మంచం దగ్గరగా వెళ్ళి నిల్చున్నాడు తల మీద చెయ్యి వేసి నిమురుతూ ''హేమా!'' అన్నాడు చంద్రం ఆర్ద్ర కంఠంతో

తోక తొక్కిన త్రాచులా హేమ ఒక్కసారి లేచి నిల్చుంది. ఆమె కోపంతో బుసలు కొడుతుంది అంత దుఃఖం చంద్రాన్ని చూడగానే కోపంగా మారింది.

" హేమా! ఎందుకింత బాధపడుతావు? '' అంటూ రెండు చేతులు పట్టుకొన్నాడు ప్రాధేయపూర్వకంగా,

'' ఛీ! వదులు!" అంటూ తన చేతుల మీద చుట్టుకున్న ఏ విషపురుగునో విదిలించినట్లు విదిలించుకుంది తన చేతుల్ని చంద్రం చేతుల నుంచి

చంద్రంలో బాధకంటే కోపం పొంగింది కసిగా హేమను రెండు బాహువుల్లో గట్టిగా బంధించాడు ఆ నిమిషంలో హేమ ఏదో పిచ్చి ఆవేశంలో దెయ్యంబలం వచ్చింది, ఒక్క తోపు తోసింది చంద్రాన్ని తూలి పడబోయిన చంద్రం నిభా యించుకున్నాడు కాని నుదురు గోడకు కొట్టుకుని దిమ్మెర పోయాడు దెబ్బతగిలిన చోట అరచేత్తో రుద్దుకుంటూ హేమ వైపు చూశాడు

"ఫో ముందు ఇక్కడనుంచి " అంటూ గట్టిగా అరచింది అప్పటికే సగం మతిపోయిన చంద్రం హేమ మాటల్ని అర్థం చేసుకోనట్లు చూశాడు రెండడుగులు ముందుకు వేశాడు

"ఆగు! ఈసారి నన్ను ముట్టుకున్నావా అరుస్తాను జాగ్రత్త పోలీసుల్ని పిలిపించి నెట్టించాల్సిన అవసరం తెచ్చు కోకు ఛీ! అభిమానం పాడూలేని నువ్వా ఒక మగాడివే" ఏమాట మగవాడిని అనకూడదో అదే అనేసింది హేమ

చంద్రానికి తను నిల్చున్న భూమి తనను వెక్కిరిస్తున్నట్లు అనిపించింది, ప్రకృతిలోని చైతన్యం చలనాన్ని మర్చిపోయి తన వైపే హేళనగా చూస్తున్నట్లనిపించింది

"క్షమించు హేమా! చాల మొరటుగా ప్రవర్తించాను అభిమానం లేకుండా నీచుట్టూ తిరిగిన నాకు మంచి పాఠమే నేర్పించావు." అన్నాననుకున్నాడు. కాని మాటలు చంద్రం గొంతునుంచి బయట పడలేదు

మౌనంగా రెండు చేతులూ ఎత్తి హేమకు నమస్కరించాడు ఆ నమస్కారంలో ఎన్నో భావాలు ఇమిడివున్నట్లు అనిపించింది అప్పటికి కొంత ఉద్రేకంనుంచి బయట పడిన హేమ అనరాని మాట తీరా అన్నతరవాత హేమకు తను చేసిందేమిటో అర్థం అయింది

గిర్రున వెనక్కు తిరిగి ఒక్కొక్క మెట్టూ తనను ఏదో పాతాళంలోకి లాక్కుపోతున్నట్లు క్రిందకు దిగిపోతున్న చంద్రాన్ని హేమ కళ్లు అప్పగించి చూస్తూ నిల్చుంది

ప్రేమించిన హృదయం గాయపడినప్పుడు ఆ ప్రేమ ద్వేషంగా మారుతుంది ఆ ద్వేషం ప్రతీకారాన్ని కోరుతుంది. ప్రతీకారాన్ని తీర్చుకోగలిగిన ఆ ద్వేషం పశ్చాత్తాపంగా పరిణమిస్తుంది. పశ్చాత్తాపంలో దగ్ధమైన హృదయంలో మళ్ళీ మొదటి ప్రేమ తలఎత్తుతుంది ఇప్పటి ప్రేమలో ఉద్రేకం వుండదు అసూయకు తావులేదు కేవలం త్యాగం ఎలా చెయ్యటమో మాత్రమే తెలుస్తుంది తను ప్రేమిస్తున్న వాళ్లు తనకు ఏమి ఇవ్వగలుగుతున్నారనేది ఆలోచించటం మానేస్తుంది. తను ప్రేమించే వారికి తను ఏమి ఇవ్వాలి, ఏమి ఇవ్వగలదు అనే తహ తహ మాత్రమే మిగులుతుంది

చంద్రం అభిమానంమీద దెబ్బకొట్టిన హేమలోని ద్వేషం పశ్చాత్తాపంగా మారింది. అలా వెళ్ళిపోతున్న చంద్రం కాళ్లను చుట్టుకొని "నన్ను క్షమించు చంద్రం. నిన్ను నేను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు అర్థంకాదు" అనాలనిపించింది, కాని ఆమెలో చలనం గడ్డకట్టినట్లయింది కాళ్లు పెగలలేదు. అప్పటికే చంద్రం వెళ్ళిపోయాడు.

హేమ ఒక్కసారిగా మంచంమీద విరుచుకుపడిపోయి గుండెలు పగలకొట్టుకొనివస్తున్నదుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడవ సాగింది

నవలచదివడంలో మునిగిపోయి వున్నప్రసాదరావుకు ఇదేమీ తెలియదు. చంద్రం వెళ్ళిపోవటం కూడా చూడలేదు.

తనకున్న పూచిక పుల్లతో సహా సమస్తమూ వేసుకొని వస్తున్న ఓడమునిగిపోయిన వార్త విన్న వ్యాపారస్తుడిలా ఎలాగో చంద్రం ఇల్లు చేరాడు. లోతయిన గాయం తగిలినప్పుడు వెంటనే బాధ తెలియదు చంద్రం మనస్సు కూడ అలాగే బండబారిపోయినట్లయింది

తన కోసం ఎదురుచూస్తూ వరండాలో నిల్చుని వున్న గౌరిని కూడా చంద్రం చూడలేదు. లోపలకు వెళ్ళి సామాను సర్దుకోసాగాడు.

చంద్రం వాలకం చూసిన గౌరికి భయం వేసింది. జరగరానిది ఏదో జరిగింది అనుకుంది. చంద్రం చాలా బాధలోవున్నాడని అర్థం చేసుకుంది. కిక్కురు మనకుండా మౌనంగా నిల్చుని చంద్రం సామాను సర్దుకోవటం చూడసాగింది, ఏదో ఆలోచన వచ్చిన దానిలా అక్కడనుంచి కదిలి దొడ్లోకి వెళ్ళిపోయింది. అక్కడ ఆ రేసివున్న తన బట్టలు మడత పెట్టుకొని లోపలకు తెచ్చుకుంది గౌరికూడా తన సామానంతా తనకున్న ఆ చిన్న ట్రింకు పెట్టెలోకి సర్దుకోవటం మొదలు పెట్టింది

అలా సామాను సర్దుతున్న గౌరిని చంద్రం చూసి ఆశ్చర్యపోయాడు తను వెళుతున్నట్లు వూహించుకొని ఆమెకూడా అనాథాశ్రియానికి వెళ్ళిపోవటానికి నిర్ణయించుకుందేమో ననుకున్నాడు.

"ఎందుకు గౌరీ సామాను సర్దుతున్నావు?"

చంద్రం ప్రశ్నకు జవాబు ఇవ్వకుండా సర్దుకోవటంలో మునిగి పోయింది

"మాట్లాడ వేం! ఎక్కడకు వెళ్లతావు?" మళ్లీ ప్రశ్నించాడు చంద్రం

"జవాబు చెప్పవేం! శరణాలయానికేనా?" కాస్త విసుగ్గా అడిగాడు ఈసారి

"కాదు" ఖచ్చితంగా చెప్పింది గౌరి ఆమె కంఠంలోని గాంభీర్యంచూసి ఆశ్చర్యపోయాడు చంద్రం గౌరిముఖం ఎంతో గంభీరంగా వుంది. అకస్మాత్తుగా గౌరి ఓ పది సంవత్సరాలు పెద్దదయి పోయినట్లు కనిపించింది చంద్రానికి.

"మరి ఎక్కడకు వెళతావు?"

"ఏమో నాకేం తెలుసు! నువ్వు ఎక్కడకు వెళుతున్నావో అక్కడికే." ఓక్షణం తెల్లబోయి చూశాడు

"నాతోనా! నాతో నువెందుకు?" తెప్పరిల్లి ప్రశ్నించాడు

"నీకు వంట చేసిపెడతాను, నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను" ఎంతో అమాయకంగా చెప్పిన ఆ జవాబుకు చంద్రం మనస్సు జాలితో నిండిపోయింది

చంద్రం మౌనంగా కూర్చొని గౌరిని చూస్తూ ఆలోచిస్తున్నాడు పెట్టెకు తాళంవేసి తయారుగా నిల్చున్న గౌరిని చూస్తే చంద్రానికి అంత బాధలోనూ నవ్వు వచ్చింది సృష్టిలోని ఏ జీవికీ లభించని వరం మానవుడికి లభించింది అది నవ్వగలశక్తి.

'నేను తీసుకెళ్ళకపోతే?" చంద్రం ప్రశ్నించాడు

"అయినా వెళ్ళిపోతాను"

"ఎక్కడకు?"

"చెరువు దగ్గరకు!"

చంద్రం ఉలిక్కిపడ్డాడు. "చెరువు దగ్గరకా? ఎందుకూ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

''అందులో పడి చావడానికి ''

" గౌరీ !"

గౌరి నిర్లక్ష్యంగా నవ్వింది నువ్వులేని ఈ జీవితం నాకెందుకు అన్నట్లుంది ఆ నవ్వు.

'' నీకేం కష్టం కలిగించను నువ్వు చెప్పినట్లు వింటాను. ఏం చెయ్యమంటే అదిచేస్తాను. ''

'' గౌరీ !" అంటూ చంద్రం గౌరిని గాఢంగా కృతజ్ఞతతో నిండిపోయిన హృదయానికి హత్తుకున్నాడు. ఆమె తలమీద తన గడ్డాన్ని అశాంతిగా రుద్దాడు ఆక్షణంకోసమే తపించిన గౌరి చంద్రం చేతులకు పెనవేసుకు పోయింది.

'' అయితే పద వెళదాం ? '' అన్నాడు చంద్రం గౌరిని మృదువుగా వదలివేస్తూ.

గౌరి పెట్టె చేతిలోకి తీసుకుంది ఆమె కళ్లలో కోటి కాంతులు కదిలిపోవటం కనిపించింది

తను ఆశించిన ఆనందాన్ని అందుకోలేక పోయాడు. జీవితం తనను అడుగడుగునా దగా చేసింది. తనవల్ల మరో జీవితానికి ఓ అర్థం కలిగించ కలిగితే అంతేచాలు. సంతృప్తిగా నిట్టూర్చాడు చంద్రం.

తనకంటే ముందుగా తొందర పడుతున్న గౌరిని కొం[illegible] ఉడికించాలనిపించింది చంద్రానికి. ఆ విధం[illegible] తన మనస్సులోని బాధను మర్చిపోవటానికి ఒకవిధంగా ప్రయత్నమే కావచ్చు

"మరి త్రోవలో నీ చిన్నప్పటి స్నేహితుడు కనిపించి తనతో రమ్మంటే? నన్ను వదిలేసి వెళ్ళిపోతావా?"

గౌరి పని చిక్కులో పడ్డట్టయింది ఆలోచనలో పడిపోయింది.

"ఊహూ! కనిపించడు." అంది అంతకంటే ఎలా జవాబు చెప్పాలో తెలియని గౌరి.

"ఒకవేళ కనిపిస్తాడనుకో."

"కనిపించినా గుర్తుతెలవదుగా? ఇప్పుడు పెద్దయిపోయి వుంటాడు." పాలోచనగా జవాబిచ్చింది.

'' నీ నిర్మలమైన మనస్సు గుర్తించ గలదు గౌరి. నీ మనస్సు ప్రకృతి సహజమైనది. దానికి కుత్రిమత్వం పోక లేదు నువ్వు నీకు కావాల్సిన వస్తువును ఎంత మందిలోవున్నా, ఏరూపంలోవున్నా, ఎక్కడ వున్నా గుర్తించ గలవు. '' చంద్రం ఉద్రేకంగా అన్నాడు.

చంద్రం మాటలు అర్థంకాని గౌరి వింతగా చూస్తూ విన సాగింది.

'' అవును ! గౌరీ ! నువ్వు నీ చిన్ననాటి స్నేహితుణ్ణి చూడగానే గ్రహించావు. ఆ అబ్బాయినే నేను. '' అన్నాడు చంద్రం గౌరి ముఖంలోకి కుతుహలంగా చూస్తూ.

'' నిజంగా ! " ఒక్కసారిగా గౌరి చంద్రం ఒడిలో వాలిపోయింది.

'' పద ! వెళదాం తాళం వేసి తాళంచెవు ఎవరికైనా ఇచ్చిరా '' అన్నాడు చంద్రం ఆర్ద్ర స్వరంతో

గౌరి మెరుపులా క్షణంలో చంద్రం సూట్ కేసూ, తనపెట్టె వరండాలో పెట్టింది చంద్రం బెడ్డింగు తీసుకొని బయటకు నడిచాడు గౌరి ఇంటికి తాళంవేసింది తాళంచెవి తీసుకొని ఆగూడెం ఇళ్లలోకి లేడిపిల్లలాగెంతుతూపరుగిడుతున్న గౌరిని కుతూహలముతోచూస్తూ నిల్చున్నాడు చంద్రం.

'గౌరి ఆ ఒక్క నిమిషంలోనే తనకు కనిపించిన వాళ్లందరికూ చెప్పేసింది తను చంద్రం వెళ్ళి పోతున్నామనీ. పెళ్ళి చేసుకుంటామని. విన్నవాళ్లు గౌరి మాటలు అర్థం చేసుకొనేలోపలే గౌరి తిరిగి చంద్రంను చేరుకుంది.

రిక్షా స్టేషన్ చేరింది. రాత్రి 11.30 వరకు ఏబండీ దూరం పోయేది లేదని తెలిసింది 11.30 బండికి టికెట్లు కొన్నాడు.

గౌరి ప్లాటు పారం మీద తన ట్రంకుపెట్టెమీద కూర్చొని చంద్రం తెచ్చి ఇచ్చిన టిఫెన్ తిన్నది. చంద్రం కాఫీ మాత్రం [illegible] సిగరెట్టు త్రాగుతు అశాంతిగా అటూఇటూ తిరుగుతున్నాడు. [illegible]ష్సున అనేక ఆలోచనలు అలుముకుంటున్నాయి.

[illegible] అనుకున్నది ఏమిటి ! జరిగింది ఏమిటి ! ప్రకాశం కర్మ సిద్ధాంతాన్ని నమ్మకు. రెండు గంటల క్రితం వరకూ గౌరి తన జీవితంలో ఇంత ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తుందని తను వూహించుకున్నాడా? ఏదో అదృశ్య శక్తి ప్రమేయం లేకుండానే ఇలాటివి సంభవిస్తాయా ! బలపిన గుర్రంలా మనస్సు హేమవైపుకు పోవటానికి మొరాయిస్తుంది చంద్రం బలవంతంగా దాన్ని అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ అశాంతిగా ప్లాట్ఫారంమీద పచార్లు చేస్తున్నాడు.

*   *   *

తనివి తీరా ఏడ్చిన హేమ మనస్సు కొంత తేలిక పడింది. ముఖం కడుక్కొని కిందకు వచ్చింది. ప్రసాదరావు మధ్యాహ్నం ఏకుర్చీలో కూర్చున్నాడో అక్కడే కూర్చొని వుండటం చూసి హేమ ఆశ్చర్యపోయింది. తండ్రి ఏదో చాలా శ్రద్ధగా ఆదుర్దాగా చదవటం దగ్గిరగా వెళ్ళిన హేమ గమనించింది. ప్రసాదరావు చెక్కిళ్ళు కన్నీటితో తడిచి వున్నాయి. హేమ ఆశ్చర్యానికి అంతులేదు, అది చంద్రం రాసిన స్క్రిప్టు అని గ్రహించింది. చివర పేజీ చదువుతున్న ప్రసాదరావు చేతినుంచి స్క్రిప్టు జారి క్రిందపడింది. పీడ కలనుంచి లేచినట్లు లేచి నిల్చున్నాడు.

'అమా ఊనా అమ్మాయి దొరికింది' అంటూ బయటకు పిచ్చివాడిలా పరుగెత్తుతున్న ప్రసాదరావును హేమపరుగెత్తుకెళ్ళి పట్టుకుంది.

" ఏమిటి నాన్నా ఇది. పుస్తకం చదివి అలా అయిపో యావు." మందలించింది హేమ. ప్రసాదరావు హేమ ముఖంలోకి వెర్రిగా చూశాడు. తండ్రికి మతి చలించిందేమోనని హేమ భయంతో వణికిపోయింది.

"నాన్నా! నాన్నా! " అంటూ ఏడుపుస్వరంతో తండ్రిని వూపింది.

ప్రసాదరావు తెప్పరించుకుని గడపమీద కూలబడ్డాడు. భయపడకమ్మా! నాకేంకాలేదు. నేను బాగానే వున్నాను. ఒక టాక్సీకి ఫోన్ చెయ్యి." అన్నాడు ప్రసాదరావు నీరసంగా

తండ్రికి ఒంట్లోబాగా లేదేమోనని లోపలకు పరుగెత్తు కెళ్ళి టాక్సీకోసం ఫోన్ చేసింది. మళ్ళీ వచ్చి తండ్రి పక్కనే కూలబడింది.

" నీకు వంట్లో ఎలావుంది నాన్నా." ఆదుర్దాగా అడిగింది.

" నన్ను పలకరించకమ్మా." అన్నాడు ప్రసాదరావు. హేమ దిగులుగా తండ్రి పక్కన మౌనంగా కూర్చుంది.

మరో ఐదు నిముషాల్లో టాక్సీ వచ్చింది. ప్రసాదరావు లేచి తూలిపడబోయాడు. హేమ పట్టుకొని ఎక్కించి తను ఎక్కి కూర్చుంది.

"నేను అర్జంటు పనిమీద వెళుతున్నాను. నువ్వెళ్ళి పడుకోమ్మా." అన్నాడు ప్రసాదరావు

"లేదు, నేనూ వస్తాను." అందిహేమ. తండ్రికి అంత అర్జంటు పనేమిటో, అతనిలా కావటం ఏమిటో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

కృష్ణా మహల్ కంపెనీముందు టాక్సీ ఆగింది.

" చూడుబాబూ! పైన ఆ చివరి గదుల్లో అనూరాధ అనే ఒక ఆమె వుంటుంది. వెళ్ళి ప్రసాదరావు పిలుస్తున్నాడనీ, [illegible] పైకి ఎక్కగలిగే స్థితిలో లేదనిచెప్పి పిల్చుకొనిరా." అన్నాడు ప్రసాదరావు టాక్సీ డ్రయివరుతో.

హేమ అయోమయంగా చూసింది.

గాభరాగా అనూరాధ దిగివచ్చి టాక్సీలోకి చూసింది. హేమనుచూసి ఒక అడుగు వెనక్కు వేసింది.

" అనూ! త్వరగా ఎక్కు. మన అమ్మాయిదొరికింది. వెళ్ళి తీసుకొద్దాం."

అనూరాధ మరోప్రశ్న వేయకుండా టాక్సీ ఎక్కింది. ఆవార్త ఆమెకు అమిత సంతోషాన్నే కలిగించిందో దుఃఖాన్నే కలిగించిందో అర్థంకాలేదు హేమకు. ఏదో డిటెక్టివ్ సినిమా చూస్తున్నట్లుంది హేమ పరిస్థితి.

కొరిటపాడు వెళ్ళి వాకబు చెయ్యగా గౌరీ, చంద్రం వూరికి వెళ్ళటానికి స్టేషన్‌కు వెళ్ళారని తెలిసింది.

" ఏమిటీ! గౌరి నాన్నకూతురా! అంటే నాకు చెల్లెలా!" హేమకు ఏమీ అర్థంకావటంలేదు. బుర్ర పనిచెయ్యటంలేదు.

టాక్సీ స్టేషన్ వైపుకు పరుగెడుతుంది. అంతకంటే వేగంగా అందరిమనస్సులు పరుగెడుతున్నాయి.

* * *

కృష్ణారావు భోజనంచేసి వరండాలో ఈజీచైర్‌లో కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. చంద్రం గురించే ఆలోచిస్తున్నాడు. చంద్రం పెళ్ళి ఎలాచెయ్యాలో, ఎంతగొప్పగా చెయ్యాలో ప్లాను వేసుకుంటూ కూర్చున్నాడు.

గేటు తెరచుకొని భద్రయ్య గాబరగా రావటం చూశాడు కృష్ణారావు.

"ఏమిటిరా! భద్రం! ఇప్పుడొచ్చావు." అన్నాడు కృష్ణారావు సిగరెట్ పొగ వదులుతూ.

" బాబుగారూ—తొందరగా లెగవండి."

" ఏవిటరా అగాబరా నువ్వూనూ."

" మరేమో ! చంద్రంబాబు, గౌరమ్మతో స్టేషన్‌కు ఎల్లి పోయారంటండి. అది నాగేంద్రంకు తెలిసి చంద్రంబాబును చంపేత్తానని కత్తట్టుకొని స్టేషన్‌కు ఎళ్ళాడండి."

కృష్ణారావు బిగుసుకుపోయాడు.

" లెగండి దొరా! ఆలస్యం అయితె మనకు చంద్రం బాబు దక్కడు.

కృష్ణారావు గబగబా లేచి షెడ్‌నుంచి కారు బయటకు తీశాడు. భద్రం కూడా కారు ఎక్కి కూర్చున్నాడు. కారు స్టార్టయినశబ్దంవిని కాంతమ్మ వరండాలోకి వచ్చేప్పటికే కారు వేగంగా వెళ్ళిపోయింది

పదకొండు గంటలు అయింది రైల్వే గడియారంలో. బండి రావటానికి ఇంకా అర్థగంట సమయంవుంది. చంద్రానికి ఆవూరినుంచి ఎప్పుడు బయటపడదామా అన్నట్లుంది. ఆ గుంటూరు పట్నం అంతకుదించుకొని పోయినట్లూ, తను నిల్చోటానికి కూడా స్థలం చాలనట్లూ, వూపిరిసలపనట్లూ వుంది చంద్రానికి. అలసటతో బెంచీమీద కూర్చుని గౌరిని గమనించసాగాడు. గౌరి ముఖం సంతోషంతో వెలిగి పోతుంది. గౌరి తనకు కాబోయే భార్యగా వూహించుకొని చూసిన చంద్రానికి ఎంతో అందంగా కనిపించింది. ఆడవిమల్లెకు కూడా అంత ఆకర్షణ వుంటాదని మొదటిసారిగా గ్రహించాడు చంద్రం.

"ఏమేవ్ ! గౌరీ ! ఎక్కడకి ప్రయాణం" గౌరి ఉలిక్కి పడి చూసింది. నాగేంద్రం విషపు నవ్వు నవ్వుతూ పక్కగా నిల్చున్నాడు. గౌరి భయంతో పెనుగాలికి వణుకుతున్న లతలా వణుకుతూ నిలబడింది. అది చూసిన చంద్రం గబగబా లేచి గౌరి దగ్గరకు వచ్చాడు.

''ఓహో చంద్రంబాబుగారా ! మా గౌరితో ఉడాయిస్తున్నారా '' ఇంత గొప్పోళ్లకు ఇంతకంటే మంచి పిట్టదొరక లేదా ఏం" తుపుక్కున వూశాడు.

"నోరుముయ్"

''ఇదుగో మూస్తాను'' అంటూ బొడ్లోని కత్తి తీసి చెయ్యి పైకెత్తాడు వుసిగా. అంతకంటే వుసిగా, మెరుపులా ఇద్దరి మధ్యకూ వచ్చి నిల్చున్న గౌరి పొట్టలోకి దిగిపోయింది కత్తి. అది చూసి నాగేంద్రం పారిపోయాడు.

'అమ్మా!' అంటూ ఒరిగిపోతున్న గౌరిని పట్టుకొని కూలబడ్డాడు చంద్రం. గౌరితలను ఒళ్లో పెట్టుకొని ముఖంలోకి పిచ్చివాడిలా చూస్తున్నాడు.

''చంద్రం'' అంటూ గౌరి పెదవులు కదలి ఆగిపోయాయి తెరచిన కళ్లు చంద్రం ముఖం వైపు చూస్తూ ఆగిపోయాయి.

వేడిరక్తం చంద్రం ఒడినీ, చుట్టూ స్థలాన్నీ తడుపుతుంది.
'' గౌరీ ! గౌరీ '' అంటూ కదిపాడు చంద్రం. గౌరి శరీరం బరువుగా కట్టెలా కదిలింది చంద్రం చేతుల్లో.

'' గౌరీ ! వెళ్ళిపోయావా ? నన్ను వంటరివాణ్ణిచేసి వెళ్ళిపోయావా " అంటూ ఆక్రోశించాడు. కాని మాటలు బయటకు రాలేదు.

'' ఇంతసేపుగా కదిలిపోతున్న నీకళ్లలోని కలలు కరడు కట్టాయా ! జలపాతంలోని శక్తి కంటే బలమైన నీలోని పురకలు తీస్తున్న వుత్సాహం ఏమయింది ? ఎలా గడ్డకట్టింది. ఇంత సేపూ నీతలలో అల్లిబిల్లి తిరుగుతున్న తియ్యటి తలపులు ఎక్కడకు ఎగిరిపోయాయి. ప్రతి అణువులోనూ ప్రవహిస్తున్న జీవితం ఒక్కసారిగా ఎలా గడ్డకట్టింది ? ఒక్క నిమిషంకూడా విశ్రాంతిని ఇష్టపడని నీ శరీరం ఇలా బిగుసుకు పోయిందేం ! ఇదేనా జీవితం? జీవితాన్ని ఓ పెద్దకలగా నిరూపించి వెళ్ళిపోయావా ? ఈ జీవితం నీ కేం ఇచ్చింది ? జీవితంలోని వట్టి చేదు మాత్రమే రుచి చూసి ఇంక భరించ లేక అలిగి వెళ్ళిపోయావా ? సమస్త సృష్టిలోనే అతి వున్నతస్థానాన్ని ఆక్రమించుకున్న మానవుల క్రూరత్వానికి బలి అయిపోయావా !

'' దీనికేనా మానవుడు ఇన్ని కలలు కంటాడు ? చివరకు మిగిలేది ఏమిటి ? మృత్యువే. నిజం, జీవితం కేవలం నిజంలా కనిపించే కలమాత్రమేనా ! అనంతమూ, స్థిరమూ, జడమూ అయిన మహామృత్యువు నుంచి విడివడిన క్షణికమైన మెరుపులాటి చైతన్యమే జీవితమా ! జీవితాన్ని ప్రసాదించిన మరుక్షణం నుంచి నీడలా మృత్యువు అనుక్షణం వెంటాడుతూనే వుంటుందా ! ఇదే సత్యం. సత్యంలో శివం, సుందరం, దాగివున్నాయని నిరూపించి వెళ్ళిపోయావా ? ''

ప్రసాదరావు, అనూరాధ, కృష్ణారావు, హేమ చుట్టూవున్న జనాన్ని చీల్చుకుంటూ వచ్చారు.

" అమ్మా, గిరిజా ! ఒక్కసారి కళ్లుతెరిచి చూడమ్మా ! మీ అమ్మ వచ్చింది. " అంటూ ప్రసాదరావు గౌరి తలను తన ఒడిలోకి తీసుకోబోయాడు. చంద్రం ఇంకా ఈ లోకంలో లేడు. తన గౌరిని ఎవరో లాక్కుంటున్నారు తననుంచి అని మాత్రం అర్థం అయింది.

'' మీరంతా దూరంగా వుండండి. గౌరిని ముట్టుకోవద్దు. ఆమె సమాజానికి చీడపురుగు అందమైన శరీరం మీద మానని గాయం. చూడండి ఆ ముఖం ఎంత అమాయకంగా అందంగా వుందో'' అంటూ బోరున ఏడ్చాడు చంద్రం.

'' బాబూ, చంద్రం ! నేను పాపిష్టివాణ్ణి. గౌరి నాబిడ్డ ! '' అంటూ గౌరి మీద తల ఆనించి వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. ప్రసాదరావు. అంత వరకూ స్థాణువులా నిల్చున్న అనూరాధ పక్కనే కూర్చుని చంద్రం బడినుంచి గౌరితలను చిన్నగా తీసి తన ఒడిలో పెట్టుకొంది. ఆమె ముఖంలోకి తనివితీరా చూస్తూ కూర్చుంది. ఆమె కంట్లో నీటి చుక్కకూడా లేదు.

'' చూడమ్మా ! మీ అమ్మా నాన్నా వచ్చారు. ఒక్కసారి కళ్లు తెరువు.'' అంటూ ఆక్రోశించాడు ప్రసాదరావు.

చంద్రం పిచ్చివాడిలా చుట్టూవున్న వాళ్లను చూశాడు.

'' కళ్లు తెరిచి ఒక్కసారి చూడు గౌరీ ! నువ్వు చూడగలిగినన్నాళ్లు వీళ్లంతా కళ్ళు మూసుకుని నిన్ను చీదరించుకున్నారు. తీరా నీవు కళ్ళు మూసుకున్న తరవాత వీళ్లంతా నీ మీద ప్రేమ వర్షం కురిపించటానికి వచ్చారు." చంద్రం పిచ్చివాడిలా నవ్వాడు.

* * *

ఆరోజు గౌరి బాలికా శరణాలయానికి శంఖుస్థాపన జరిగింది. చంద్రం తన ఆస్తినంతా అనాధాశ్రయానికి రాసిఇచ్చాడు. ప్రకాశాన్ని అధికారిగా నిర్ణయించాడు. గౌరి ఆత్మశాంతికి అంతకంటె తను చెయ్యగలిగిందేమీ లేదని చెప్పాడు చంద్రం.

అనూరాధ ఆ శరణాలయంలో వుండిపోవటానికి నిశ్చయించుకుంది. హేమా, ప్రసాదరావులు ఎంత బతిమాలినా ఒప్పుకోలేదు.

"ఇంతకాలం నాబిడ్డకోసం జీవించివున్నాను. ఇప్పుడు నా బిడ్డలాటి బిడ్డలకోసం జీవించివుంటాను. తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని, సంఘంలో గౌరవానికి అస్కారంలేని నా బిడ్డలాటి అనాధ బిడ్డల్లో అనుక్షణం నాబిడ్డను చూసుకుంటూ జీవిస్తాను. నా హృదయంలో ఇంతకాలం పదిలంగా నాబిడ్డకోసం దాచుకున్న వాత్సల్యాన్ని అందరికీ పంచిపెడతాను. అదిచాలు నాకు ఈ మిగిలిన జీవితానికి" అంది అనూరాధ.

ఎవరూ మాట్లాడలేకపోయారు.

స్టేషన్‌లో రైలు కదలటానికి సిద్ధంగావుంది. చంద్రం మొదటి తరగతి రైలుపెట్టె వాకిలిముందు నిల్చొని వున్నాడు. చుట్టూ కృష్ణారావు, కాంతమ్మా, రజనీ, ప్రకాశం, ప్రసాదరావు నిల్చొని వున్నారు. హేమ కొంచెందూరంగా నిల్చొని వుంది.

అందరి మనస్సులో చంద్రం ఆఖరు నిముషంలోనైనా మనస్సు మార్చుకుంటే బాగుండునని వుంది. కాని అతన్ని ఆపే శక్తి ఎవర్లోనూ ఇప్పుడు లేదని తెలుసు అందరికీ.

రజని వెక్కి వెక్కి ఏడుస్తుంది. "ఎందుకమ్మా ఏడుస్తావు? మళ్ళీ త్వరలోనే వస్తాగా! నీ పెళ్ళి నేను లేకుండా జరుగుతుందా! తప్పకవస్తాను. అమ్మా నాన్న చెప్పినట్లు విను." అంటూ దగ్గిరకు తీసుకొని ఓదార్చాడు చంద్రం రజనిని.

అందరూ కళ్లు తుడుచుకున్నారు. బండి కూతకూసింది చంద్రం వదినకు నమస్కరించాడు. ప్రసాదరావుకు కూడా నమస్కరించాడు. అన్న ముఖంలోకి కళ్ల నీళ్లతో ఓ క్షణం చూశాడు. ప్రకాశాన్ని కౌగలించుకున్నాడు. పెట్టెలోకి ఎక్కబోతూ హేమ ముఖం ఒక్కసారి చూడాలని గంపెడాశతో ఆమె కేసి చూశాడు. ఆమె తన ముఖాన్ని మరోవైపు తిప్పుకొని వుంది.

చంద్రం బాధగా నిట్టూర్చుతూ పెట్టెలోకి ఎక్కి కిటికీ దగ్గిరకువచ్చి నిల్చున్నాడు. కిటికీనుంచి ముఖం బయటపెట్టి అందర్నీ చివరిసారిగా చూస్తున్నాడు. అందరూ బరువు గుండెలతో మౌనంగా చంద్రం ముఖంలోకి చూస్తూనిల్చున్నారు. బండి కదిలింది. చంద్రం తల బయటకుపెట్టి హేమ కనిపిస్తుందేమోనని చూశాడు. కాని కనిపించలేదు. బండి ప్లాటుఫారందాటి వెళ్ళిపోయింది.

చంద్రం నిట్టూర్చుతూ బర్త్ మీద కూర్చుంటూ ఉలిక్కిపడి నిల్చున్నాడు. ఎదురుగా హేమ తలవంచుకొని నిల్చునివుంది. చంద్రానికి తను చూస్తున్నది నిజం అని నమ్మకం కలగటం లేదు.

హేమ ఒక్కసారిగా చంద్రం కాళ్ళమీద పడిపోయింది.

"నన్ను క్షమించు చంద్రం, నీహృదయంలో స్థానాన్ని నేను చేతులారా పోగొట్టుకున్నాను కనీసం ఈ పాదాలలో నాకు ఆశ్రయం కావాలి."

చంద్రం వంగి హేమనుపైకెత్తాడు. "ఛ ఏమిటిది? నువ్వు అందరి ఆడపిల్లల్లా కాళ్ళు పట్టుకోవటం ఏమిటి?" అన్నాడు.

"అయితే జుట్టే పట్టుకుంటాను అంటూ చంద్రం నొక్కుల జుట్టును చేతినిండుగా పట్టుకొని కొంటెగా నవ్వుతూ వూపింది. చంద్రం హేమను హృదయానికి హత్తుకున్నాడు. హేమ చేతి నుంచి ఏదో కిందపడింది.

చంద్రం వంగి తీశాడు. తను రాసిన నవల స్క్రిప్టు ఆశ్చర్యంగా హేమ ముఖంలోకి చూశాడు. హేమ హాయిగా నవ్వింది

"చదివావా?" అడిగాడు చంద్రం కూర్చుంటూ.

"చదివాను. అందువల్లనే నాకళ్లు తెరచుకున్నాయి." చంద్రం పక్కనే కూర్చుంటూ అంది.

"పేరు ఏం పెట్టమంటావు?"

ఓ క్షణం ఆలోచించి "అడవిమల్లె" అంది చిన్నగా ఏదోగుర్తు తెచ్చుకుంటూ.



చంద్రం వులిక్కి పడ్డాడు. "అడవిమల్లె" నీరసంగా వల్లించాడు. చంద్రం కళ్లముందు గౌరి ముఖం కదిలింది. కిటికీ నుంచి బయటకుచూశాడు. ప్రకృతి దృశ్యం దూరంగా కొండలు దట్టమైన అడవి నిర్మలాకాశం. పిండారబోసినట్లు వెన్నెల. గౌరి ప్రకృతిలోని ప్రతివస్తువులో ఇమిడివున్నట్లనిపించింది. గౌరే ప్రకృతి. ప్రకృతేగౌరి.

హేమ ముఖంలోకి చూశాడు. మానవుడు తన విజ్ఞానంతో సృష్టించుకున్న సభ్యతా, నాగరికతా, హేమలో కనిపించాయి. "మంచి......మల్లె అడవిమల్లె" అనుకున్నాడు చంద్రం.

హేమ తన రెండు నాజూకైనా బాహువుల్ని మాలలా చంద్రం మెడకు చుట్టేసింది.

సమాప్తం

# పంటకు పట్టిన
# చీడ క్రిములను నాశనము చెయ్యండి...




అమెరికన్ స్ప్రింగ్ అండ్
ప్రెస్సింగ్ వర్క్స్ ప్రైవేట్ లి.
మార్వే రోడ్, మలాడ్,
బొంబాయి-64.
టెలిఫోన్ నం. 692331,
టెలిగ్రామ్: కిర్లోకస్ట్.




W TL-33

మీ పంటలకు హాని కలుగకుండా వుండుటకు, గటోర్ రాకింగ్ స్ప్రేయర్ అస్పీ బోలో మిస్ట్-బ్లోయర్ మరియు మోకా ఫుట్ స్ప్రేయర్‌తో. చీడ క్రిములను నాశనము చెయ్యండి. గటోర్ రాకింగ్ స్ప్రేయర్. అస్పీ బోలో మిస్ట్ బ్లోయర్ మరియు మోకా ఫుట్ స్ప్రేయర్‌తో. గుణకరంగాను, తక్కువ ఖర్చుతోను, అతి వేగంగాను, రసాయనములను (కెమికల్సును) స్ప్రే చెయ్యండి మరియు పొడి చల్లండి. ఈ ఉపకరణములు మీ పంట సమృద్ధికి అవశ్యకమైనవి.

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు:
గుంటి అండ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, పోస్టు బాక్సు నెం. 39, 128 మహాత్మా గాంధీ రోడ్, సికందరాబాద్, టెలిగ్రామ్: గుంటి కం; టెలిఫోన్ నెం. 74400, 73720
శ్రీరామ కార్పొరేషన్, పోస్టు బాక్సు నెం. 32, ఫోర్టుగేట్, రాజమండ్రి, టెలిగ్రామ్: రామ్‌కోర్, టెలిఫోన్: 9,
శ్రీరామ కార్పొరేషన్,
పోస్టు బాక్సు నెం. 303, ఏలూరు రోడ్, విజయవాడ_2, టెలిగ్రామ్: రామ్‌కోర్, టెలిఫోన్ 3598.

# రోడ్డుమీద యమకింకరులు

మాడా కృష్ణమూర్తి

మన దేశంలో ప్రతిరోజూ నూటఏనభై రోడ్డు ప్రమాదాలు జరుగుతున్నాయి. వీటివల్ల పదహారు వందలమంది చనిపోతున్నారు. నూరుమంది గాయపడుతున్నారు. జనాభా పెరిగిపోతున్నది. మోటారు బండ్లు ఎక్కువగానే యేటేటా రోడ్డెక్కుతున్నాయి. ప్రమాదవృద్ధి మాత్రము, పోల్చిచూస్తే, విపరీతంగా వుంది.

ఇతర దేశాలలో సమాన పరిస్థితులున్నాయా అంటే–లేవు. మోటారు బండ్లు అమెరికాలో పుట్టలు పుట్టలుగా ఉత్పత్తై చీమల బారుల్లాగా రాత్రీ పగలూ రోడ్డు మీద తిరుగుతుంటాయి. అమెరికాలోని వంద మోటార్లకు మనకు పూర్తిగా ఒక్కటైనా వుందని చెప్పలేము. ఇంత తక్కువగా వాహన సంఖ్య వుండినా మనకు రోడ్డు ప్రమాదాల రేటు జాస్తిగా వుందంటే యితర దేశాలవారు ప్రమాద నివారణకై చేసే కార్యాచరణ, క్రమశిక్షణ, రోడ్డు ట్రాఫిక్ విజ్ఞానం మనకు లేదన్నమాటేగా. ఎవరిది తప్పు ?–చేతగాని డ్రైవర్లదా ? రోడ్డు నిర్మాణలోపమా ? అవసరమైన శాసన పటిష్ఠము లేకనా ? అమలు జరిపే ట్రాన్స్‌పోర్టు, పోలీసు ఉద్యోగుల ధ్యాస? లేక ప్రజలలో 'రోడ్డు తెలివి' లేకపోవడమా?

ఒకమాటగా పై వర్గాల వారందరి తప్పే అనడం అతిశయోక్తి కాదు. "నడివీధిలో నడిచిపోవద్దు.' రోడ్డుకు ఎడమవైపు బండ్లు పోవలెను' 'పాదచారులు రోడ్డుకు యిరుప్రక్కల కట్టిన నడవలలో నడవవలెను' అనే నినాదాలు, సభలు, ఊరేగింపులతో ఏడాదికి ఒకవారం రోజులు ట్రాఫిక్ వీక్ జరిపినంత మాత్రం చేత సరిపోతుందా ? ప్రజలలో రోడ్డు తెలివి స్వాభావికంగా వుండేటట్టు చేయాలి. నిరంతరం ప్రచారం చేసే సదుపాయాలు ఏర్పరచవలెను. పిల్లలకు ఉగ్గుపాలతో పోసినట్టుగా రక్షణ యివ్వాలి. ఈ విషయంగా ఎదురుతగిలే సమస్యలను వితర్కించి పరిష్కారం చేసేందుకు, వివిధ వర్గాల వారికి అవసర సలహాలు యిచ్చేందుకున్ను ప్రత్యేకంగా పరిశోధనా కేంద్రాన్నొక గాన్ని రాష్ట్ర స్థాయిలో నెలకొల్పాలి. రోడ్డుభద్రతా సంఘాలు అధికార, అనధికార వర్గీయులతో ప్రతి నగరంలో వుండాలి.

## ప్రమాద కారణాలు

ప్రమాదాలు ఎందుకు జరుగుతాయన్న విషయాలను పరిశీలిద్దాం. వార్తాపత్రికలద్వారా వివరాలు తెలుసుకొంటున్నాము. ప్రమాదాలకు నూటికి డెబ్బయిపాళ్ళు డ్రైవరుదే తప్పు అని నిర్ణయించారు. ఇక వయస్సు వచ్చిన పురుషుడుగానీ, స్త్రీ గాని డ్రైవింగ్ లైసెన్స్ పుచ్చుకునేందుకు అర్హులే. కాని మొదట లెర్నర్ లైసెన్స్ తాత్కాలికంగా ఆరునెలల పరిమితిలో యిస్తారు. ఆరితేరిన డ్రైవర్ పక్కన వుంటేనే బండి నడిపించడానికి వారికి అనుమతి. తదనంతరం లైసెన్సింగ్ ఆఫీసరు వద్దకు వెళ్ళి సారథ్యశక్తి తృప్తికరంగా వుందని నిరూపిస్తేనే పక్కా లైసెన్సు వస్తుంది.

భారీమోటారు బండ్లు నడిపేందుకు అనుభవం, ఆరోగ్యం చక్కగా వుంటేనే లైసెన్సు యివ్వబడుతుంది. కానీ చట్టములు, నిబంధనలు వుండినా వాటిని సక్రమంగా అనుసరించడం వుండాలి గదా ? తప్పినడవడానికి తోవలు తొంభై వుండనే వుంటాయి. వృత్తిగా నడిపేవారికి అదుపులు ఎక్కువవున్నా తప్పించుకొని తిరుగుతూనే వుంటారు. పది రూపాయలు నమ్మి ఒకరి చేతికి యివ్వను సందేహిస్తాము కానీ యిరవై వేలు ఖరీదు చేయగల మోటారుకారు గాని, అంతకన్నా యెక్కువ వెలగల భారీబండ్లు గాని డ్రైవరు చేతికి యజమాని యిచ్చి కూర్చుంటాడు. ప్రమాదాలు జరిగితే దైవాధీనంగా డ్రైవరుకు ప్రాణహాని గాని, గాయాలుగాని తప్పితే వస్తునష్టమును గురించి చింత వారికెందుకు? విధిగా చేయవలసిన భీమా—third party risk—అంటే బండివల్ల కలిగిన ఎదుటివాని అపాయము నష్టము పరిహరించేది–మాత్రమే చేస్తారు. అసలుదారుకు కలిగే నష్టముగూడా Comprehensive policy గా చేయని వారెందరో వున్నారు. ఇట్టి పరిస్థితులలో వృత్తి డ్రైవరుకు దిగులేమిటి? చక్రంచేత బట్టిన లారీ డ్రైవరుకు తన ప్రపంచమే వేరుగా వుంటుంది. మోయలేనంత భారంతో మూలే పిశాచి వెనకవుంది. రోడ్డు వంపులలో, అడ్డదారులు కలిసేచోట ఏమాత్రం పొరబాటైనా ప్రమాదం తప్పదు. నగర శివార్లు దాటేవరకు పోలీసువారు ఎదురౌతారేమో అన్న జంకైనావుంటుంది. అవల ధాకకు ఎదురు లేదు. వేగంగా దాటిపోదలచిన చిన్న కారులవారు 'మొర్రో–మొర్రో' అని బాకావూదినా, ఎలక్ట్రిక్ హారన్‌మీట నొక్కినా వినిపించుకోడు. తొలగింగి వేగాన్ని తగ్గించి దాటిపొమ్మని చెప్పడు. మరింత వేగంగా దుమ్మెత్తిపోసి తెరగట్టి సాగిపోతుంటాడు. దేవుడు మేలుచేసి రైల్వేలెవెల్ క్రాసింగ్ గేటన్నా రావాలి, ఎదురుగా మరో లారీగాని, బస్సుగాని రావాలి–అప్పుడే వెనక వచ్చిన వారికి విమోచనం. ఈ లోపుగా ప్రమాదం జరిగే అవకాశం ఎంతో వుంది. దూర ప్రయాణాలు రాత్రి వేళల్లో వెళ్ళేటప్పుడు నిద్ర లేక పోవడం మూలంగా మత్తుగా వుండి మెళుకువ లేకపోవడం కూడా ఈలారీ ప్రమాదాలకు కారణ మౌతుంది. ఈవిషయమై కట్టుదిట్టాలు, పనిచేసే కాలనిర్ణయం–రెండోడ్రైవరు సరఫరా లాంటివి లేక పోలేదు. పాటించేది పూజ్యం. బస్సుడ్రైవర్లు, టాక్సీడ్రైవర్లు ఈవిషయంలో ఎంతోమేలు అనవలసి వుంటుంది. సామాన్యంగా జరిగే ప్రమాదాలలో మూడింట రెండు లారీల వల్లనే అవి తెలుస్తూంది. తెల్సినంత మాత్రం చాలునా ? చూస్తూ కూర్చోవడమా ? రోజురోజుకు లారీల సంఖ్య, రోడ్లమీద వస్తువుల రవాణా అధిక మౌతున్నాయి. వర్షాకాలంలో అపాయం

ఎక్కువ. రోడ్డుకంట్రాక్టు దారులు కక్కుర్తిపడి రోడ్డుకు యిరుపార్శ్వములలో రాళ్ళు తగ్గించి మట్టితో నింపుతారు. భారీ బండ్ల చక్రాలు బురదలో దిగబడి బండ్లు బోల్తాపడుతాయి. లేక స్టీరింగు కంట్రోలు తప్పి చక్రాల పట్టులేక ఒక ప్రక్కకు, గుంజేస్తుంది. దిగుడులోకి జారి పోతుంది. రోడ్డు తనిఖీ యింజనీర్లు వున్నారను కోండి. వాళ్ళు మాత్రం అడుగడుగు పరీక్షిస్తారా? కనుక యిలాంటివి అదుపుకూడా వుండడం అవసరం.

## పాతమీద మోజు

మరొక ముఖ్యకారణం— లారీలజోడింపులోని అవకతవక. మోటారు పరికరాలు, యంత్రభాగాలు పాతవో, కుప్పలోంచి ఏరినవో ఏవైనా చాలునని—కొత్తవి, మంచివి అయితే ఖర్చు జాస్తి అని—కొని బిగిస్తారు. టైర్లు కాన్వాసుదాకా అరిగినా వాడుతారు. చౌకబారు రీట్రేడ్స్ వాడుతారు. వేగంగా వెళ్ళుతున్న లారీకి టైరు బరస్టు గాని, కీలకమైన చోట యంత్రభాగము విరగడముగాని జరిగితే ఎంతో ప్రమాదము. గొప్పగొప్ప ట్రాన్స్‌పోర్టు కంపెనీలు జాగ్రత్తపడి అప్పటి కప్పుడు స్వంత మెకానిక్కు ద్వారా సరిచేయించి ప్రయాణానికి సిద్ధం చేయిస్తుంటాయి. కాని చిన్న చిన్న ఆసాములకది పట్టింపులేదు. ఏ వేలంలోనో చౌకగా కొని రంగులు, పైకప్పులతో అప్పటికి నడిపించగల శక్తితో తనిఖీకి హాజరు పెట్టి 'ఫిట్‌సర్టిఫికెట్టు' పొందిన తర్వాత ఎంతశీఘ్ర కాలంలో పెట్టుబడి, లాభము ఆర్జించగలమా అన్నదే వుద్దేశంగా వుంటారు. ఈ విషయంలో కూడా యితోధిక శ్రద్ధ వహించవలసి యున్నది.

లారీల తర్వాత ఎక్కువగా ప్రమాదాలకు గురిఅయ్యేవి మోటారు స్కూటర్లు. మోటరు సైకిళ్ళవల్ల యిన్ని ప్రమాదాలు జరగడం లేదు. నడిపేందుకు నాలుగు గంటలలో నేర్చుకుంటారు. మైదానములలో గాని, బండ్ల రాపిడిలని రస్తాలలో గాని అభ్యాసము లేకుండానే బస్తీ బండ్ల ప్రవాహంలోకి దూకుతారు. చిన్న చిన్న చక్రాలు వుండడంవల్ల ఏ మాత్రం నిదానము తప్పినా బండి బోల్తా పడుతుంది.

## అడ్డదారి పిశాచాలు

మోటారు కార్ల విషయం గమనిస్తే లారీలు, స్కూటర్ల లాగా హెచ్చు ప్రమాదాలు వుండడంలేదు. నాలుగు చక్రాలు గలిగి మూలపీఠముండబట్టి, సాగుతున్న బండికి భూమ్యాకర్షణ శక్తి పీఠము మధ్యనే వుంటుంది. గట్టిగా ఢీకొన్నాగాని, అతి వేగంగా మలుపు తిరిగిన గాని ఆ శక్తిగీత వెలుపలికిపడి బండి బోర్లాపడిపోతుంది. ఢీకొనడముగాని జరగనంత వరకు ఘోరమైన ప్రమాదము జరుగదు. బండి నిర్మాణములోనే దాని నియమిత వేగశక్తి యింతఅని ఏర్పడివుంటుంది. శక్తికి మించిన వేగము, బండ్ల రద్దీ, వంపులు గమనించి సరియైన వేగంతో బండి నడిపించాలి. 'రివ్వునపోయి' అదటున బ్రేకువేయడం, సూటిగా పోనీక యిటుఅటు స్టీరింగు చక్రం తిప్పడం, బలమంతటనీ స్టీరింగు చక్రంపై మోపి మొరటుగా ప్రవర్తించడం తగు జాగ్రత్తగా అడ్డంకులను గమనించక పరధ్యానము, సంభాషణ, సిగరెటు కాల్చడం, ఏకమేనా నద్వితీయం అన్నట్టు ముందున్న బండిని తప్పనిసరి దాటిపోవలెనన్న పట్టుదల లాంటివి—యింకాయెన్నో అవలక్షణాలవల్ల ప్రమాదాలు జరుగుతున్నాయి. డ్రైవింగులోపాలు, కిటుకులు తెలియజేసే పుస్తకాలు విరివిగానే వున్నాయి. వాటిని చదివితేనేగాదు—అనుభవం, నిదానం, ఏకాగ్రత ముఖ్యం. బండి నడిపేవానికి బండికూడా తన దేహ విశేషమన్న భావం కలగాలి. నిర్ణీతమైన చోట బండి ఆపాలంటే ఎంతదూరం నుండి వేగం తగ్గించి బ్రేకు నొక్కాలో అలవాటుంటే గాని కుదరదు. నడిపే చాకచక్యం అందరికీ సమానంగా వుండదు. కానీ అభ్యాసముంటే కొంత నేర్పు స్వాభావికమైపోతుంది. వంటచేసే వారు త్రాసు, తక్కెడపెట్టి తూచిచేస్తారా? అలవాటువల్ల ఎంతెంత వేయాలో తెలుస్తుంది. అట్టి మెలకువ వుండాలి. ఇంతకూ తానెంత నేర్పరి అయినా ఎదటివాడి స్థితినీ మనస్తత్వాన్నీ తెలుసుకోవడం కష్టమే. లండన్ బస్‌డ్రైవర్ డ్రైవింగును గూర్చి ఏమన్నాడంటే నీకు శక్తి సామర్థ్యాలు వుండవచ్చు. అడ్డ దారిలో అమాంతం బ్రద్దలు కొట్టగల లారీ పిశాచి నీకోసమే వేచియున్నది అన్న భావము ఎప్పటికీ నీకుంటే—నీవు తగు జాగ్రత్తలో వెళ్తావు అన్నాడు.

మద్య నిషేధం లేనిచోట్లలో త్రాగుడువల్లకూడా కొన్ని మోటారు కారు ప్రమాదాలు జరుగుతాయి. త్రాగిన దశలో బండినడపడం శిక్షార్హమే కానీ ఉల్లంఘనను కనిపెట్టే అవకాశము తక్కువ—లేదా తత్పూర్వమే ప్రమాదం జరిగి పోతుంది.

మరొక లోటు—తృటిలో సరియైన నిర్ణయం చేయుట అనునది లేక పోవడమే. కంగారు పడితే లాభముండదు కారు కింద పడనున్న వ్యక్తికి ప్రాణాపాయము తప్పించడమే కర్తవ్యము. అట్లు చేయడంలో మరొకళ్ళకు స్వల్పహాని కాని, వస్తు నాశనం గాని అయినా ఫరవాలేదు.

## పాదచారుల అజాగ్రత్త

అన్నిటికీ డ్రైవర్లదే తప్పని చెప్పడం సరికాదు. పాదచారుల అజాగ్రత్త ముప్పు తెస్తే డ్రైవరేమి చేస్తాడు. వాహన స్తోమం యెక్కువగా వుండే కాలంలో దాటడానికి ప్రయత్నించే వ్యక్తి భ్రమసిపోయి ముందుకి వెనుకకు తిరుగాడాడంటే ఏకారు కిందనో పడక తప్పదు. వాహన ప్రవాహము వచ్చేదిశను కనిపెట్టి, అవసరమైతే మానులాగా నిలబడుతూ అదను చూచుకొని మెలకువగా దాటగలరు. అట్లు చేయనివారు పాదచారులు దాటేందుకై నిర్దేశింపబడిన చోటనే ట్రాఫిక్ పోలీసుల దర్శకత్వాన్ని చూస్తూ సురక్షితంగా దాటవచ్చును.

మోటారు బస్సులవల్ల జరిగే ప్రమాదాలు, కార్లవల్ల జరిగే వాటికన్నా తక్కువే—వారి యిబ్బందులు వేరే—బస్తీలుకాక పల్లెల పక్కనుండి గాని, లోనుండిగానీ బస్సు పోవలసివుంటే రోడ్డంతా ఆక్రమించుకొని పోతున్న పశువుల మందలు—రెండెడ్లబండి సరాలు-కదలనని రోడ్డు మధ్యలో ఆరామం చేస్తున్న వీధికుక్కలు,

యిటుఅటు పరుగిడే పిల్లలు, సందులనుండి మెరుపుతీగెలా అడ్డం తగిలే సైకిలిస్టులు—వారికి ఎదురౌతాయి. ప్రైవేట్ బస్సులున్నచోట పోటీల వల్లగూడా ప్రమాదాలు జరుగుతుంటాయి.

చట్టాలకు, నిబంధనలకు తక్కువేమిలేవు. నాల్గుపేజీల మోటారు బండ్ల చట్టానికి నలభై పేజీల నిబంధనలు—అన్ని వందల పేజీలు గల "కేసులా" టిప్పణము తయారుగానేవుంది.

1965 హైవేస్ నివేదిక ప్రకారము మన రాష్ట్రంలో 13,600 మైళ్ళ రోడ్లున్నాయి. సిమెంటు కాంక్రీటువి 301, బ్లాక్ టాప్‌వి 7,618 మైళ్ళు. కేవలం రాళ్ళు మాత్రం దిట్టించినవి 4,228 మైళ్ళు మూడవ రకంలో తగ్గింపు, రెండవ రకంలో హెచ్చింపు క్రమేపీ జరుగుతున్నాయి. రోడ్ల నిర్మాణ దోషము వల్ల రోడ్డు ప్రమాదాలు జరిగినవెన్ని అనిగాని, వాటినిగూర్చి తీసుకున్న చర్యయిదనిగాని సూచింపనందున నిర్మాణ లోపమున్న దని చెప్పగలమా?

## రోడ్డురక్కసి పలాయన మంత్రం

నివారణోపాయాలు అమలులోవున్న వాటిని సూచించాను. రద్దీ తగ్గించడానికి 'ఏకమార్గ నియమము' (one way traffic) మంచిదే. అవసరం లేకపోయినా పట్టణ వీధులగుండా పోయే 'తూ్రటా్రఫిక్' ఉపయోగార్థం బైపాస్ రోడ్లు, ఫీడర్ రోడ్లు ఉపకరిస్తాయి. భారీబండ్లు తిరగడం, కొన్ని చోట్లలో కొన్ని కాలాలలో కూడదని నివారించాం. పాదచారులు దాటే వసతులు కల్గించాలి. పిల్లలకేగాక ప్రజలకుకూడా 'రోడ్డు తెలివి' (Road sence) కల్గించాలి. రోడ్డు ప్రమాదాల భోగట్ట నెలకొకసారైనా వివిధ శాఖలు, సంస్థలు ఏమి తెలుసున్నారన్న విషయాన్ని సేకరించి వితర్కించి వార్తా పత్రికల ద్వారాగాని, కరపత్రాలద్వారా గాని ప్రజా బాహుళ్యానికి తెలపడానికి పూనుకొనే సంస్థవుండాలి. కొత్తగా లేవదీసిన 'టా్రఫిక్ సేఫ్టీ కోరు' వారైనా పూనుకుంటారని ఆశిద్దాము.

రోడ్డురక్కసి బారినుండి సురక్షితంగా వుండాలంటే ఒక్కటే మూలమంత్రం. జాగృతి—జాగృతి—మరీ జాగృతి. వేరే కవచమేమీలేదు. రెండో పక్షంగా ఆరక్కసి తీవ్రతతగ్గించే కట్టుదిట్టాలు, క్రమశిక్షణ రోడ్డు నిర్మాణ కుశలత — వాహన చోదకుల తర్ఫీయతు—ప్రమాదభీమాలో అవసర సవరింపులు — వాహన నిర్మాతల సహకారము—వివిధ అధికార వర్గాల ఏకాగ్రత —ఎంతేని అవసరం. *

(ఆకాశవాణి సౌజన్యంతో)

---

# కొత్త చిగురు

శశాంక

కొత్తదారి ప్రక్కనిలచి కొత్త ఆశ చిగుర్చు
ఆకాశాన్నందుకునే నిచ్చెన సృష్టించు
శుభోదర్కమైననేటి సూర్యరశ్మినిలిచి
చీకటిచీకాకులన్ని ఒక్కటిగారాల్చు!

నీజీవిత పరమావధి చేయిజారిపోయినదా
ఇదిగో చేయూతగొనుము గమ్యముకై సేయుము
బ్రతుకుపందెమందుఓడి నేలగూలిపోయితివా
నేడే యీనాడె తిరిగి భవితవ్యముఒడ్డుము!

ఈ విశాల వసుంధరను సుఖములగని కలదు
ఈ ప్రమోద మేదినిపై బ్రదుకుపంటకలదు
సమ్మతిపైవ్రాసి ఇచ్చె సమత ఒక్కవిల్లు
జనులెల్లరు సమానముగ అనుభవింపచెల్లు!

స్వాతంత్ర్యము నీకునాకు సంక్రమించుహక్కు
నినదించుము దశదిశలా ఇదేనరునిబుక్కు
సంతసాల వసంతాల సవరించుముగొంతు
స్వాదుగీతమాలపించు చేరినాతొవంతు!




Coal is the Base of Industry



*For quality and service*

THE SINGARENI COLLIERIES CO., LTD.

"MEHER MANZIL", RED HILLS, HYDERABAD A. P.

TELEGRAMS: COALMINES · TELEPHONES: 32766, 32271 & 34775

# స్వస్తిశ్రీ చాంద్రమాన

ఉషశ్రీ పురాణపండ

మల్లిమొగ్గ తొడిగె
మాలతి హసియించె
కన్నెజాజి తారకలను రాల్చె
గున్నమావి కొమ్మ
కోకిల స్వనముల
పుల్లముఖుల హృదులు పులకరించె.

అతివిచిత్రమయిన అంశం యేవిటీ అంటే అలనాడు నన్నయ కానీ, అనంతరం అల్లసాని పెద్దన్న కానీ, నిన్న మొన్నటి నాగరక కవి కానీ తెలుగువాడి సంవత్సరాదికి చెరగని అక్షరముద్ర వెయ్యలేదు. సంవత్సరాదికే కాదు దాని అక్కగారు సంక్రాంతికి సముచిత స్థానం లేదు సాహితీ సంస్థానంలో. ఏవో ఒకటి రెండు వర్ణనాత్మక సీసాలున్నా ఈ రెండు పండగల్లోనూ మన జీవితంలో ఎంతో ప్రముఖంగా నిలబడే అల్లుడు, ఆ అల్లుడిని ఆడించి, ఆడిపించుకునే మరదలు పిల్లా మహామహు లెవరినీ కదిలించినట్లు లేదు. కదిలించినా కరిగించలేకపోయారో .... ఏమయితేనేం పండగొచ్చేసరికి గృహస్థుని గుండె పులకిస్తూనే గుండెలో గులాబి ముల్లులా గుచ్చుకునే అల్లుడి విషయం ఏ కవిగారు పట్టించుకోక పోవడం అంతబావులేదు సుమండీ – అంటే నిత్య జీవితంలో అనుభవించే యాతన చాలక వాడికీ సాహితీ సామ్రాజ్యంలో సామంతత్వమూ, భావనా జగత్తులో బంగారు పీటా వెయ్యడం దేనికనుకున్నట్టున్నారు – అని సరిపెట్టుకుందాం, అంతకంటె మంచికారణం కనిపించే వరకూ. అయితే ఈ ప్లవంగ ప్రారంభానికి ముందు కళ్యాణ తిలకం దిద్దుకున్న కన్యాకుమారి కంట ఈ సంచిక పడితే భయంలేదు కాని ఆ అమ్మాయి భర్త యిది చదవరాదని మనవి.

అది పీఠిక

ఇక నాయొనర్పంబూనిన లేఖా ప్రబంధంబునకు కథాక్రమంబెట్లు సాగునన నావుడు దశమ గ్రహంబు వ్రాయు చుండె –

మహారాజశ్రీ, గంగాభాగీరథు సమానులయిన, ఎన్ని కల్లో ఓడిపోయిన వర్గం వారితో చేతులు కలిపి తిరిగిన, నాభార్యయొక్క తండ్రిగారయిన మామగారికి మీ అల్లుడు రత్నశిరోమణి వచసా నమస్కరించి, శిరసా తలవంచి, వాచా ఆశీర్వదించి, శీర్షా పైకెత్తి వ్రాయునది యేమనగా –

మీ అయిదవ కుమార్తె శివసుందర రాజ్యలక్ష్మి సత్యవరప్రసాద పార్వతీదేవి భర్తనయిన నేను వ్రాయు ఈ అమూల్య లేఖను ముందుగా మీరు ఏకాంతంబున పఠించి – మరువరాదు.

ఈ ఉత్తర రాజమును మీరొక్కరే ముందు చదువుకొని, యందేమయిన దొసగులున్నచో వాటిని నిఘంటు సహాయమున నర్థము చేసుకొని, అనంతరంబు వ్యాకరణ విశేషములను అలంకార శాస్త్రార్థముతో మేళవించి వ్రాసికొని, యితర ప్రకరణార్థములు పెద్దలవలన నెరింగి తగువారి సమక్షమున దీనిని బహిర్గతముగా (అనగా స్వగతము కానిది) చదువునది. (ఇది షరా ! ఇట్టి షరాలు ఎడనెడ తగులగలవు. వాటి బారి నుండి మీరు తప్పించుకొన నుంకించుట చట్ట విరుద్ధము.)

అది సరియ –

ఇటీవల నేనొక పత్రికయందు గాంచిన అమూల్య వార్తను గురించి ప్రప్రథమమే ప్రస్తావించుటకు-పక్రమించెద. అది యెట్లంటేని –

ఇటీవల ఏర్పడిన జాతీయ జామాతృ బాధిత సంఘానికి (అనగా నాకర్థ మెరుక పడక యొక భిషగర్వ నడుగ అల్లుళ్ళ వలన బాధపడు మామల సంఘమనెను) ఆంధ్రదేశ్ సంఘాన్ని కూడా జతపరిచారట. (కోప మధికమగుటంజేసి, దానిం దెలుపగోరి భాషను అస్తవ్యస్తముగా వాడెదన్.

అల్లుళ్ళబాధ మామగారల కేమిటో బోధపడరాదాయె...

దేశంలోని మామలందరూ పడే బాధ నాకెందుకు ! నా వలన మీరింతవరకూ పడిన బాధ యేమి ఉండదనీ ఉండకూడదనీ నాభావం. అసలు నా వివాహం వల్ల, అనగా మీ అయిదవ కుమార్తె కంఠసీమలో నేను మూడు ముళ్ళూ వెయ్యకపోతే ఈ రెండు సంవత్సరాలుగా మీరు ఎంతబాధపడి ఉండేవారో ఆ బాధా నివారణకు నేను మీదగ్గరనుండి తీసుకున్నది ఆరువేల రూపాయలున్నూ, లాంఛనాల రూపంలో నాలుగువేల అయిదువందలున్నూ, యింకా, నా వివాహం తిరుపతికొండమీద జరగవలసి రావడంవల్ల అందుకు నా తంపు బంధువుల కయిన దారిఖర్చులు, మన ఒడంబడిక ననుసరించి, పన్నెండువందల రూపాయలు మాత్రమే మీకయిన ఖర్చు.

అయితేనేం! పద్దెనిమిది సంవత్సరాలుగా మీ యింట్లో మీకు బాధగా పడిఉన్న ఒక యువతీ రత్నాన్ని నేను పెళ్ళి చేసేసుకొని మీకా బాధ తప్పించాను కదండీ. అది మీకు బ్రహ్మానంద జనకమే అని మీరు నమ్ముచుండ గలరు.

ఇక ఈ ప్రస్తావన ముగించి, అసలు నాటక రచనకు కడంగెద!

వెనకటి పరాభవ ఉగాదిలానే, ఈ ప్లవంగ సంవత్సరాది పండుగకు కూడా నాకు మీనుంచి ఆహ్వాన శుభలేఖ రాగలదని ఆశించితిని. అది నేటివరకూ రాకపోగా, ఈ క్షణము సకు అయినా మీనుండి తంతివార్త కూడా చేరనందున నేనీ జాబు రాయుచున్నాను.

వెనుకటి ఉగాదివలెనే ఈయేడుకూడా నా షడ్రకులు-అనగా నాభార్య అక్కగార్ల నలుగురు భర్తలు తప్పక రాగలరనియు, వారందరితోపాటే నన్నుకూడ చూడగలరు. కాని నాకు ప్రత్యేక ప్రతిపత్తి యుండదనియు, అది నా మానసంబునకెంతయో బాధ కలిగింప గలదనియు మీకు తెలిసినను మీరా దశమ గ్రహరాజములు నాలుగింటిని రాకుండ జేయలేరు. అందునూ, మీ పెద్దమ్మాయి రత్నావళి తన ఎనమండుగురు బిడ్డలతోనూ, రెండవయామె యిద్దరు పిల్లలతోనూ, మూడవ ముద్దులబిడ్డ అయిదుగురు బిడ్డలకుతోడు కవలపిల్లల కడుపుతోనూ, మూడు కాన్పులలో ఏడుగురు బిడ్డలనుకన్న మీ నాల్గవ అమ్మాయి తన ఆడబడుచు తోడుతోనూ వచ్చినప్పుడు మీయింటనుండు నాకు శరీరమంతయు తేళ్ళు, జెర్రులు ప్రాకినట్లుండును.

కారణ మెరుంగ గోరుదురేని,
దారుణమని లోకపు కాకులనినను,
రాసెదగాక!

అందరు మనుషులున్నచోట నుండుట నావంటి ధీమంతునకు శ్రేయంబు గాదని యిటీవలనే యిట్టి కారణముననే తన భార్యను విడిచిపెట్టిన నా మిత్రుడు గోపాలశేఖరుడు నాకు ఉచితముగా సలహా యిచ్చెను.

మరి యొండేమన-

మీరికముందు వేయు వార్షిక ప్రణాళిక లెట్లుండవలెనన్న-సావధాన చిత్తులరై చదువుడు-ఇప్పుడొక్క పొడుము పట్టుపట్టిన మీకు నాసూచనలు బాగుగా నసాళమున కంటగలవు.

చదువుడు—ముక్కుపొడు ము పీల్చి తీరికగా—

సరి, సరి....

ఇక ఈ ప్రణాళిక

సంవత్సరమునకు మన దేశములో నెలకొక పండుగకు తక్కువగాక వచ్చుచుండ గలదు. అట్టియెడ, ఈ పండగలన్నిటికీ మీరు మీ అల్లుండ్రందర నాహ్వానింపం బనిలేదు. మరి యెట్లన—

ముందుగా పండగలను అయిదు విభాగములు చేయుడు. చేసితిరా!

లేదు. ఆ విభాగము నేనే తెలిపెద—దీని ప్రారంభము సంవత్సరాది చేయరాదు. మన పండగలు వినాయక చవితితో ఆరంభింపవలెను. ఆడంద్రముల పండుగకు మీ పెద్దమ్మాయి తన సంతానములో చివరి సగము బిడ్డలతో రావలెను. దాని అనంతరము వచ్చు దసరా పండుగలకు మీ రెండవ అల్లుడుగారు తన కుటుంబ సమేతముగా రావచ్చును. ఆయన తర్వాత వెళ్ళుట అవసరము.

ఏలయన—

అనంతరమతిత్వరితగతించనుదెంచు దీపావళి-తెలియుగదా!

దీపావళికి నేనును, నాభార్యా మణియును రాగలవారము. అప్పుడు మేము మాసము రోజులున్నను మీకు బాధ యుండదు.

మరల పుష్యమాసమువరకు సంక్రాంతి రాదుకదా! ఆ సమయమునకు మీ నాలుగవబిడ్డ తన సంతానముతో విచ్చేసి వెళ్ళిన అనంతరము సంవత్సరాది విచ్చేయును. ఈ సంవత్సరాదికి మీ పెద్దమ్మాయి భర్త, అనగా నా పెద్ద తోడల్లుడు తన మిగిలిన బిడ్డలతోవచ్చి నాలుగు రోజులుండి వెళ్ళగలడు. ఇట్లు మీరు పండుగలను ప్రణాళికా బద్ధముగా, ఆయా అమ్మాయిల రాకపోకలకు కేటాయించినచో సంవత్సరమంతయు మీ అమ్మాయిలతో (అదేనండీ, వివాహాలయిన అమ్మాయిలందరూ) ఒక్కొక్కరు తమ సంతానముతో మీ యింటనుండి మీకానందము కలిగించినవారు కాగలరు.

పైగా ఒక్కసారిగా మీకు పెద్ద ఖర్చు కాదు. ఇందువల్ల భారీ ప్రణాళికను అయిదు దశలలో లఘు పరిశ్రమల వలె నిర్వహించు నైపుణి మీకు లభించుటయు, అది మీ యిరుగుపొరుగువారు గ్రహించి మిమ్మభినందించుచుండ విని మా అత్తగారగు మీభార్యారత్నము కడుంగడు బాష్పవర్షమున తేలగలరు.

ముఖ్యాంశమును విస్మరింపలేదు.
ఈసరికి మీకు తెలిసియే యుండును.
తెలిసినను తెలియజెప్పుట నా విధియగు.
విధి నిర్వహణ క్రమం బెట్లనిన—

నా వివాహమైన దాది నేటిదనుక గతించిన రెండు సంక్రాంతులు, రెండు దీపావళిలు, రెండు విజయదశములు, వచ్చుచున్న ఉగాదితో కలిపి రెండు సంవత్సరాదులు ...... ఇవికాక యితర లఘు పర్వదినములు మొత్తము నా లెక్కకు పదిహేను తేలినవి. ఈ పదిహేను పండుగలకు నేను వచ్చియున్నచో మీరమందానందమున నన్ను నూతన వస్త్రములతో, దారి ఖర్చులతో సత్కరించి యుండెడివారు. అట్టి అవకాశము

నాకు లభింపకయే, ఆ అదృష్టము మీకుచేకూర జేయలేనందుకు నేనెంతయు విచార సంతసడోలిన ఊగిసలాటల, తూగుచుంటిని. ఈ ఊపులు, తూగులు ఎంతవరకని! కానీ-

ఈ పదిహేను పర్వదినములకు నాకు వెచ్చించవలసిన మొత్తము పదిహేను వందల పదిహేను రూపాయలు, దారి ఖర్చులు నూట యేబదియేడు రూప్యముల పైచిలుకు పైసలు ...ఇవికాక ఈ రెండేళ్ళలో మీ అమ్మాయి మీ యింటికి వచ్చి, తిరిగి నన్ను చేరుటకైన ఖర్చులలో సగము మాత్రమే భరించు ఆచారము మీరు యింతదనుక ఆచరించుటం జేసి, ఆ తక్కుంగల సగం ఖర్చును మీరు భరింపవలసి యున్నందున, —జాగ్రత్తగా చదువుడు—ఇంత స్వల్పవాంఛతో నున్నాడే! మన అయిదవ అల్లుడని విచారింపకుడు!

నేను అత్యాశలకు పోవువాడనుకాను. దురాశ దుఃఖమునకు చేటు - అని నీతి సూక్తిని నేను వీధిబడి గోడలమీద చదివియు, అధికమైన ఆశలకు పోదునా! దానంజేసి ఆ యీ మొత్తములను కలిపి, వాటికి ఉచితరీతిని, అనగా, నెలకు నూటికి రూపాయి మూడణాల వడ్డీ మాత్రమే వేసినను ఐదు వేలకు చేరలేదు. చేరకపోయినను ఐదువేలకు మీరు చెక్కు పంపగలరని నే నెరుంగుదును. అదియునుంగాక,

మీ పెద్దమ్మాయి వివాహము జరిగిన దశాబ్దికి కాని నా పరిణయము జరగలేదు. ఈ పదేండ్లుగా ఆ దంపతులు, అనగా, సదరు నా తోడల్లుడు, ఆయన భార్య, మీనుండి పొందిన వస్త్రములు, యితర సొమ్ములు, వారి సంతానముల కొరకు మీకయిన ఖర్చులు లెక్కజూపినచో నాకు రావలసిన మొత్తము ఈ అయిదు వేలకుపై బడుననుట నిర్వివాదము కదా!

కాదందురా!
అనలేరు.

మీ ఔదార్యము, మీ సౌజన్యము, మీ ఔచితి నేనెరుగనివికావు. ఇన్నిటిని దృష్టిలో ఉంచుకొని నాకు చేరవలసిన పైకము చెక్కు రూపమునకాని, వ్యక్తిద్వారా కాని పంపనిచో మీ అమ్మాయిని టికెట్ కొనకుండ రైలెక్కించ గలనని సవినయముగా అజ్ఞాపన. నా యీలేఖలో అనేకదోషము లుండవచ్చును. భాషా, వ్యాకరణ, ఛందోఽలంకారములు నాకంతగా తెలియవని తమ రెరుగనది కాదని నే నెరిగినట్లు మీ రెరుగకున్నను జరుగునది, మీ అమ్మాయి మీ యింటికి వచ్చుటయే. అది మీకు మర్యాద కానందున ......... చుక్కల భావము గ్రహించి పంపునది.

*

భవత్ -
—అయిదో అల్లుడు.


# శారదా
## డీసెల్ ఇంజిన్

సేద్యంలో రైతుల నీటిసమస్యను తీర్చే "జలదేవత." కర్షకుల పాలిటి భాగ్య దేవత. నాలుగు రకాల వ్యవసాయపు పంపులను నడుపుతుంది. "శారద" ఇంజను తోడ్పడిన రైతు కర్షకవిశారదుడై అధికోత్పత్తిని సాధించగలడు.




Kiron

శారద ఇంజనీరింగు కంపెనీ ముషీరాబాద్, హైదరాబాదు-20

# ట్రాంబే

## నైట్రో ఫాస్ఫేటు (16N : 13P)

పుష్కలమైన పంటలకు అత్యుత్తమము

ఈ ఎరువులో పంటలకు అత్యవసరమగు రెండు సత్తువనిచ్చు

పధార్థములు (N : P) రసాయనికంగా కలుపబడినవి. అన్నిరకముల

పంటలకు, భూములకు ఈ ఎరువు యుక్తమైనది.

ఎక్కువ పంట పండించే వ్యవసాయ దారులందరూ

ట్రాంబే నైట్రో ఫాస్ఫేటునే ఉపయోగింతురు.

తయారు చేయువారు-

**ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఇండియా లిమిటెడ్**

ట్రాంబే యూనిట్, బొంబే 74 A. S.

సీరియల్



# భాగ్యచక్రం

ఆరికెపూడి కౌసల్యాదేవి

పగటి నిద్రానంతరం లేచి ముఖం కడుక్కుని కూర్చుని కుమారుడు శ్రీధర్‌తో ఆడుకుంటూ కూర్చున్న శ్రీ నగేష్ గదిలోనికి తల్లి వచ్చింది కాఫీ ఫలహారాలతో.

"అక్కడుంచమ్మా. నేను తీసుకుంటానులే. పాపం, మంగమ్మ లేక నువ్వు చాలా శ్రమ పడ్తున్నట్లుంది"

నీరసంగా నవ్వి చేరువలోనే కూర్చున్నది శ్రీదేవి. "అమ్మ శ్రమ పడ్తున్నదని తెల్సుకొని, ఆ శ్రమను ఎవరు తగ్గించగలరో నీకు తెలియదా బాబూ? బాగా ఆలోచించు—పనిమనిషి మంగమ్మ నా శ్రమనేం తగ్గించగలదు? నాకేం ఆనందం కలిగించగలదు?"

శ్రీ నగేష్ మాట్లాడలేదు కాని, అతడి హృదయ భారాన్నంతా వ్యక్త పరుస్తూన్న బరువునిశ్వాసం మాత్రం వెలువడింది. మౌనంగా ఫలహారం భుజించసాగాడు.

"నువ్వు పోయి బయట ఆడుకో బాబూ" అని మనుమడిని అక్కడినుంచి పంపేసింది శ్రీదేవి.

## జరిగిన కథ

కారు ఏక్సిడెంట్‌లో శ్రీపతి చిక్కుకుని మతి స్థిమితాన్ని కోల్పోతాడు. అతని కూతురు జయశ్రీ మినహా మిగిలిన వారంతా ఆ ఏక్సిడెంట్‌లో చనిపోతారు. శ్రీపతి మేనల్లుడు శ్రీనగేష్ ఆయనకు చికిత్స చేస్తుంటాడు. జయశ్రీ గర్వం, ఆడంబరం శ్రీ నగేష్‌కు నచ్చదు.

"చూడు బాబూ," సానునయంగా ప్రారంభించింది శ్రీదేవి కుమారునితో. "నీ వివాహం చూడనిదే నా మనస్సు శాంతించదు. నువ్వు నా మాట తీసివేయకూడదు. నేను ఛాందసంగా అనడం లేదు. నీ భార్యవచ్చి నిన్నే కాదు—అత్తగారినైన నన్ను కూడా సుఖపెడుతుంది. పోనీ నాకోసమైనా అంగీకరించు."

"హుం! ఎంత అమాయకురాలవమ్మా!" శ్రీ నగేష్ చిరుహాసంలో లోకంలోని విషాదమంతా ఒలికింది. "సుఖపడాలనే ఆశ మనకు వుండగానే సరా? సుఖపడే గీత వుండవద్దూమననొసట? ఆ అదృష్ట పరీక్షలన్నీ అయిపోయాయమ్మా. ఇక నాపై అటువంటి ఆశలేమీ పెట్టుకోకు."

"అదుగో. ఆ మాటే వద్దన్నాను. కనీసం ఈ తల్లికోరికనైనా మన్నించవా నగేష్?"

"..................."

"చూడుబాబు. తల్లిగా నాపై నీకెటువంటి అభిప్రాయం?"

అదరిపడ్డాడు శ్రీ నగేష్. "అదేం మాటమ్మా? మరే విషయాన్ని మన సంబంధంతో పోల్చకు. నీవంటి తల్లికి పుత్రుడనైనందుకు నేను గర్వపడని క్షణంలేదు. ఇంతకంటె చెప్పడానికి నాకు మాటలు దొరకవు. కవిత్వం రాదు."

"సంతోషం. అయితే ఒక మాట చెప్తున్నాను విను. ఈ నీ తల్లి చేతితో చేసినపని సత్ఫలితాన్నిస్తుందని నమ్మిక వుంచగలవా?"

"ఎందుకమ్మా నన్నిలా అన్నివైపుల నుండీ బంధించుకొస్తావ్?"

"ఇక ఆతర్కం వద్దు నగేష్. అసలైన మాట, పనే కావలసింది. నా ప్రశ్నకు సమాధానం చెప్పు."

"నీ మాటను నేను త్రోసివేయటం లేదమ్మా. నాకు పూర్తిగా ఆలోచించుకోవడానికి కొంత వ్యవధి యియ్యి."

"సరే. ఎంతకాలం పట్టగలదు?"

"చెప్పలేనమ్మా. కాని తొందరలోనే నా అభిప్రాయాన్ని నీకు వ్యక్తం చేయగలను. అంతవఱకూ శాంతం వహించు."

" సరే కాని, చూడు నగేష్ ! ఆ మాటపైననే నిలబడు. నన్ను మరపించుదామని చూడకు. కాస్త పసివాడు శ్రీధర్ నూ, ముసలిదాన్ని నన్నూ దృష్టిలో వుంచుకొని ఆలోచించి నిర్ణయించుకో.''

వెళ్ళిపోతున్న శ్రీ దేవిని వెనక్కు పిలిచాడు శ్రీ నగేష్. '' శ్రీలక్ష్మి నీకు నమస్కారాలు చెప్పమన్నదమ్మా. "

" ఊఁ ''  ముక్తసరిగా వూకొట్టి తిరిగి పోబోయింది శ్రీదేవి.

'' అమ్మా !'' మెల్లగా సంబోధించాడు శ్రీనగేష్.

''ఏమిటి ?''

"మాట, ఒకసారి యిలా కూర్చో."

దగ్గరగా వచ్చి కూర్చున్నది శ్రీ దేవి.

'' శ్రీ లక్ష్మి పై నీకింత ఉదాసీనత ఎప్పుడేర్పడిందమ్మా? జయ అలా ప్రవర్తించినా అర్థమున్నది కాని నాకేమవసరం ఆమెను నిర్లక్ష్యంచేయడానికి ?''

శ్రీ దేవి సూటిగా చూచింది కుమారుని. "లక్ష్యపెట్టవలసిన అవసరంమాత్రమేమున్నది మనకు ?''

'' అదేమమ్మా అలాగంటావు ? ఆ రోజున అంత మర్యాదలు చేసి పంపలేక పంపలేక పంపావే మనింటి నుండి ? ఇంతలో యింతటి అల్పభావ మెలా ఏర్పడింది ? 'మీ అమ్మగారికెందుకో నాపై కోపం వచ్చిం దంటూ' లక్ష్మి చాలా బాధ పడింది తర్వాత."

శ్రీదేవి వదనం అప్రసన్నమై పోయింది. " ఆ పిల్లపై నాకేమీ ఆగ్రహమైతే లేదు కాని, ఆ నష్ట జాతకురాలితో ఇక మీదట పొత్తుమాత్రం పనికిరాదు." అంటూనే చరచరా నడిచింది.

పోతూన్న తల్లినే చూస్తూ నిస్సహాయంగా నిట్టూర్చాడు శ్రీనగేష్. 'ఇదా అమ్మ కోపకారణం ? ఎన్ని అనుభవాలు జీర్ణించుకుపోయినా, ఎన్ని ఏళ్ళుపై బడినా ఆపదలంటే ఎంత భయం మానవులకు ! అందరిలాగే శ్రీలక్ష్మి కూడా మానవ మాత్ర కాదా ? పాపం, దైవఘటనలకు ఆమె ఏంచేస్తుంది?'

అడుగడుగునా శ్రీలక్ష్మి మాటలూ, అమాయక సరళ స్వభావమూ ముగ్ధమోహన రూపమూ గుర్తుకు రాసాగాయి శ్రీనగేష్‌కు. ఒక వంక జయ నిర్లక్ష్య నిర్మొగ మాట ప్రవర్తనా, మరొక వంక తల్లి శ్రీదేవి అప్రసన్నతా వదనం, ఆగ్రహధోరణీ మనో ఫలకంపై శల్యాలై గ్రుచ్చుకు బాధించసాగాయి. 'అయినా ఏమిటి శ్రీలక్ష్మిపై నాకింత అభిమానం? పోనీ, మధ్యన ఆవిడ గురించి నాకుబాధ దేనికి?' అనుకున్నాడు. కాని ఆభావం అల్ప వ్యవధిలోనే తొలగి పోయింది. 'మంచిని ప్రేమించడం మానవ స్వభావం. మంచివైపు మొగ్గడం మనసున కలవాటు!'

ఆలోచనలతోనే లేచి స్నానం చేసి దుస్తులువేసు కుంటూంటే శ్రీధర్ వచ్చాడు. "డాడీ! నేనూ నీతోవస్తాను.'' అంటూ.

"అలాగే రా."

శ్రీదేవి కలుగజేసు కొన్నది. "ఎక్కడికి? నీతో ఆ పసివాడు దేనికి? వద్దు ఆరోగుల మధ్యకు.''

"ఆసుపత్రికి కాదమ్మా. అక్కడ శ్రీకాంత్ ఉన్నాడు చూడడానికి. నేను రాత్రి వెళ్తాను, ప్రస్తుతం మామయ్య విషయమై జయతో కొంత మాట్లాడాలి. అందుకు వెళ్తున్నాను.''

శ్రీదేవి వదనంలో వర్ణాలు త్వర త్వరగా మారిపోయాయి, "అక్కడికైతే అసలు వద్దు. నా బంగారు తండ్రిని ఎవరూ చిన్నచూపు చూడడం, కించ పరచడం నేను సహించలేను." అంటూనే అక్కడినుండి నిష్క్ర మించింది శ్రీదేవి.

శ్రీనగేష్ గ్రహించ గలిగాడు. 'అయితే, ఆ తొలినాడు కారులో వస్తూ జయశ్రీ అమ్మతో చాలా అప్రియంగా ప్రవర్తించి వుంటుంది! అవును. నాతోనే అంత నిష్కర్షగా మాట్లాడినది బాబును చూడగానే మరింత మండిపడి వుంటుంది! అయితే అమ్మ అటువంటి విషయాలను స్వయంగా నోటితో చెప్పదు. అందువల్ల వివరంగా తెలుసుకొనగల అవకాశంలేదు!'

అయితే, అతడి సందేహాలను శ్రీధర్ అడగకుండానే తేల్చివేసాడు. "ఓ! అయితే, నిన్న మన కారులో వచ్చిన అమ్మాయి యింటికా డాడీ? ఛ, ఆవిడ ఏమీ మంచిదికాదు. మన కార్లోవస్తూ, పైగా నన్నే 'నువ్వెవరు?' అనడిగింది. మా నాన్నగారు డాక్టర్ శ్రీనగేష్ అనగానే నాతో మాటలు మానేసింది. ఇంకెప్పుడూ మన కారులో ఎక్కనీయకు. అసలు నువ్వింక వాళ్ళయింటికి వెళ్ళనేవద్దు."

"తప్పు నాన్నా. నువ్వటువంటి పెద్ద విషయాలు కలుగ జేసుకో కూడదు. నువ్వు మన నాగన్నతో మన తోటలోకి వెళ్ళు. నాకూ పనులైన తర్వాత అలా వస్తాను," అంటూ కుమారుని ఎత్తుకు ముద్దాడి వెళ్ళిపోయాడు శ్రీనగేష్.

జయశ్రీ యింటికి వెళ్ళిన అతడు, ఒంటరిగా జయ షికారుకు వెళ్ళిపోయినట్లు తెల్సుకొని లోలోన ఆశ్చర్యపడుతూ తిరుగు ముఖం పట్టాడు. కాని కుమారునికి మాట యిచ్చిన సంగతి గుర్తుకు వచ్చి తిరిగి పొలాలవైపు నడక సాగించాడు. పరధ్యానంగా ప్రకృతిని తిలకిస్తూ నడుస్తూన్న అతడి కాళ్ళు నది ఒడ్డున కూర్చున్న జయశ్రీ హఠాత్తుగా కళ్ళపడగానే ఆగిపోయాయి.

సాయంత్రపు నీ రెండలో, చలిగాలులచక్కిలి గింతలతో పరవశమై పరుగుపెట్టం మఱచిపోయినట్లు నిశ్చలంగా నిలబడింది సెలయేరు. ఆ యేటి ఒడ్డున తనను తాను మఱచిపోయి కూర్చుని వున్నది జయశ్రీ.

"జయా! ఏమిటిలా ఒక్కతెవూ వచ్చావు? మామయ్యను కూడా తీసుకురాకపోయావా?'' అనిప్రశ్నించాడు మెల్లని స్వరాన, ఆమెను సమీపించి.

పరధ్యానంగా వున్న జయ అదరిపాటుతో తలెత్తి అంతలోనే సర్దుకున్నది. ''ఒక్కతెనే వచ్చాను. నాన్నగా రెప్పుడే ఆర్భాటం చేస్తారో తెలియదు. 'ఎందుకులె' మ్మని రమ్మనలేదు.'

కొద్దిక్షణాలు పోయాక నగేష్ తనంత తానే కూర్చున్నాడు. ఆమెకు సమీపంలో ఒక చెట్టు నానుకుని.

"ఒంటరిగా యిలా వచ్చానని ఆశ్చర్య పోతున్నట్లున్నావు బావా నువ్వు. ఇవాళ నర్సురావడంతో నాకు బందిఖానా విముక్తి అయినంత ఆనందంగా వున్నది. నర్సు చంద్రం చాలా నేర్పుగానే మసలు కొంటున్నారు."

తాను అడగనిదే చెప్పుకొన్న ఆ సంజాయిషీని విని ఊరు కున్నాడు శ్రీనగేష్.

"నువ్విలా వచ్చావేం? ఏమీ పనిలేదా"? అనడిగింది జయ తిరిగి. నవ్వాడు శ్రీనగేష్. "పనులు లేకుండా వుంటాయా? బ్రతికినంత కాలం వుండేవే కొద్దిసేపు ఏదో ఈచల్లగాలికి వచ్చాను."

"ఎంత హాయిగా వున్నదో నా ప్రాణం యివ్వాళ! వైజాగ్ లో రోజూ సముద్రతీరానికి వెళ్ళేదాన్ని. కాని ఇక్కడ ఒక అవాం తరంవున్నది. అందరూ వింత జంతువును చూచినట్టు చూస్తారు. అయినా నాకులెఖ్ఖలేదనుకో, ఎప్పుడో ఒకప్పుడు మళ్ళీ ఇక్కడి నుండి వెళ్ళి పోతానుకదా? అంచేత యిక్కడి జనాన్ని అంతగా లెఖ్ఖ జేయ వలసిన అగత్యం లేదునాకు."

జయశ్రీ ఎప్పటి మాదిరిగా నిశ్చింతగా నిబ్బరంగా మాట్లాడు తూన్నందుకు లోలోన సంతోషించాడు శ్రీనగేష్. 'తన విషయంలో ఆమెకు ఆగ్రహమైతే కలిగింది కాని, మనసును నిరాశ మాత్రం ఆవరించలేదు. అది అదృష్టమే'! ఆ విషయాన్నే అతడు మాటల సందర్భంలో పైకివెల్లడించేశాడు కానీ. జయఅదేదో అనవసర ప్రస్తావనలాగా మౌనం వహించింది.

బొత్తిగా మాటలు జరగక విసుగన్పించి తిరిగి తానే అడిగాడు; "మామయ్య ఉదయం ఉత్తరం వ్రాశారా?"

నవ్వింది జయ. "లేదు. చంద్రం ఏదో చెప్పి మరిపిం చేశాడు."

"అయితే..........జయా! మీ నాన్నగారికి ఈ మతి చాంచల్యం కలిగిన తర్వాత శ్రీలక్ష్మి ఎప్పుడైనా వారికి కన్పిం చారా?"

"ఏం, ఎందుకిలా అడుగుతున్నావ్ ?" ముఖం చిట్లిం చింది జయశ్రీ "అహా. ఊరికేనే. ఆమెనుచూస్తే ఆయన హృదయగత భావాలేలావుంటాయోనని !"

జయశ్రీ ముఖం జేవురించింది. శ్రీలక్ష్మి మీకు అన్నీ చెప్పిందన్నమాట నిన్న ?"

నివ్వెంపోయాడు శ్రీనగేష్ ఈ అనుకోని అభియోగానికి. "లేదుజయా. భగవత్సాక్షిగా నీగురించి నాకేమీ చెప్పలేదు. ఏమిటలా మాట్లాడ్తున్నావ్ ?"

"చెప్పినా నాకేమీ భయంలేదనుకో, ఈ వూరు రాకముందు రెండుసార్లు వచ్చింది. హాస్పిటల్‌లో వుండగా చూడడానికి. ఒక సారి తల్లిదండ్రులతో కలిసే వచ్చింది."

"అయితే అప్పుడు మామయ్య ఏమన్నారు ?" కుతూహ లంగా ప్రశ్నించాడు శ్రీనగేష్.

తిరస్కారంగా, నిర్లక్ష్యంగా అన్నది జయశ్రీ. "ఏమ న్నారా ? అంతవరకు నేను రానివ్వలేదు. 'ఏమౌతా'రని నేనాలో చించాను. దాన్ని చూస్తే ఆవేశం, శోకం అధికమై అసలు ఆయన మనగలరా అనే సందేహం వచ్చింది."

శ్రీనగేష్ అలాగే మౌనంగా వినసాగాడు.

సగర్వంగా చెప్పేసింది జయశ్రీ. "అసలామెను నాన్న గారిని చూడనీయలేదునేను. ఇక వాళ్ళతో ఎటువంటి పరిచయం నాకిష్టంలేదు !"

శ్రీనగేష్ ఏమీ మాట్లాడలేదు. తానామెను అడగవలసిన విషయం, ఇక అడగనవసరం లేనట్లేతోచింది.

ఎవరి ఆలోచనలలో వారు లీనమైపోయి కూర్చున్న యిద్దరూ ఒక్కసారిగా జీప్ హారనువిని. చకితులై అటుచూచారు. బాటవెంబడి సాగిపోతున్న జీప్ నది ఒడ్డున వున్నవారిని చూచి ఆగింది.

"హల్లో ! గుడీవెనింగ్ !" అంటూ బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరూ, డాక్టరూ శ్రీకాంత్ దానినుండి దిగివచ్చారు.

శ్రీనగేష్, జయశ్రీ లిరువురూ ప్రత్యభివాదం చేశాక అందరూ తిరిగి ఏటి ఒడ్డున ఆసీనులయ్యారు. కాలువలో పశు వులను కడిగి ఇళ్ళకు తోలుకుపోతూన్న పశుల కాపరులు తమను వింతగా, విస్మయ నేత్రాలతో తిలకించడం చూచిన ఆఫీసర్," "కంట్రీ బ్రూట్స్" అన్నాడు నవ్వుతూ జయశ్రీతో.

"ఎగ్జాక్ట్లీ." అన్నది జయశ్రీ తిరిగి నవ్వుతూ సమా ధానంగా.

శ్రీకాంత్ నవ్వుటూ, "మా డాక్టర్‌గారి కిటువంటి సంభా షణలు రుచించవు." అన్నాడు శ్రీనగేష్‌ను సూచించుతూ.

అందరూ అటు చూచారు.

గంభీరత్వం చెందిన స్వరంతో అన్నాడు శ్రీనగేష్ : "అవును. ఏతావున-ఏ నీడన బ్రతుకుతున్నామో ఆ స్థలాన్ని, ప్రజలనూ చేతనైతే సరిదిద్దాలేకాని. అధిక్షేపించి అమర్యాదగా మాట్లాడడంలో మన ఆధిక్యత కన్పించదు."

శ్రోతల అందరి వదనాలూ మాడిపోయాయి.

బీడీవో ప్రయత్నపూర్వకంగా సంభాషణను మార్చివేశాడు. "పాపం, మీకిక్కడ ప్రొద్దుపోవడం చాలాకష్టమే !" అన్నాడు జయశ్రీతో.

"ఏంచేస్తాను ? ఖర్మ !" అన్నది జయశ్రీ ముఖం కొట్టు కుంటూ.

"అన్నట్టు మీ నాన్నగారు ఉదయం బాగానిద్రలేచారా ? మళ్ళీ ఏగొడవాలేదా ?"

''లేదు. బాగానే వున్నారు ''

''ప్చ్. వెరీ పిటీయబుల్ కేస్ !'' అంటూ తనసానుభూతిని ప్రకటించాడు.

ఇక సంభాషణ లోతుకు పోతున్నట్లు గ్రహించిన శ్రీనగేష్ తొందరగా లేచాడు కూర్చున్న తావునుండి, ''ఇక వెళ్దామా? చీకటి పడవచ్చింది.''

''ఆఁ. నడవండి.'' శ్రీకాంత్ శ్రీనగేష్‌కు క్రిందివాడు కావటాన, ఇష్టమున్నా లేకున్నా తప్పనిసరిగా లేచాడు. కాని జయశ్రీ, బ్లాక్ ఆఫీసర్ మాత్రం కదలలేదు.

''వెళ్ళొచ్చును లెద్దూ. కాస్సేపు కూర్చుందాం.'' అన్నది జయశ్రీ.

''మామయ్యను పూర్తిగా నర్సుపై వదిలి పెట్టడం యిప్పుడే అంతమంచిదికాదు జయా. రా వెళ్దాం.'' అన్నాడు శ్రీనగేష్ నచ్చజెప్తూన్నట్టు.

అతడి మాటను తేలికగా తీసేసింది జయశ్రీ.''ఫర్వాలేదు లెద్దూ బావా, ఏమున్నది ఇంటికి వెళ్ళిన దగ్గర్నుంచి ఆ పిచ్చి గొడవా, ఒంటరితనమే కదా"?

''సరే.''. అయితే నేనువెళ్తున్నాను. శ్రీనగేష్ నడక సాగించాడు, శ్రీకాంత్ అతడి ననుసరించాడు.

"నేను మిమ్మల్ని జీప్‌లోదిగ బెడతానులెండి.'' జయశ్రీతో ఆఫీసరు అనడం నగేష్‌కు స్పష్టంగా విన్పించింది.

''మీమఱదలు చాలా దైర్యస్థురాలే,'' అన్నాడు శ్రీకాంత్ గుంభనంగా నవ్వుతూ శ్రీనగేష్‌తో,

శ్రీనగేష్ గాత్రంలో కోపం ప్రతిధ్వనించింది. "ధైర్యంకాదు అమాయకత్వం, లోకజ్ఞానం కొరవడిన అటువంటి వారిని చూచి హేళన చేయడం కంటె జాలిపడడం నేర్చుకుంటె బాగుంటుందేమో"

ఆ మాటలలోని అయిష్టతను గ్రహించిన శ్రీకాంత్ మరి మాట్లాడలేదు.

హఠాత్తుగా అన్నాడు శ్రీనగేష్. అయితే మిస్టర్ శ్రీకాంత్ ''హాస్పిటల్‌లో మీరూ, నేనూ యిద్దరం లేకపోతే అక్కడ పేషెంట్ల గతేంకాను ?''

అపరాధిలాగా శ్రీకాంత్ మౌనందాల్చాడు.

ఖరారుగా అన్నాడు శ్రీనగేష్ : "మరొకసారి ఇట్లా జరుగకూడదు.

"హాస్పిటల్‌కు అది చెడ్డపేరు. పేరుసంగతి అటుంచి మన బాధ్యతనుకూడా గుర్తుంచుకోవాలి, రోగుల ప్రాణాలు మనచేతిలో వుంటాయి. మీరెక్కడికైనా వెళ్ళదలచుకుంటే, నాతో చెప్ప వలసింది, హాస్పిటల్‌లో నేనేవుండేవాడిని.''

ఆ మందలింపు అంతటితో ఆపాలన్పించిన శ్రీకాంత్ బల వంతంగా అనగలిగాడు : "సారీ, ఇంకెప్పుడూ అలా జరగ నీయను.''

* * *

''ఎన్నిసార్లు కబురంపినా జయశ్రీ ఈ వారం రోజుల నుండీ మన యింటికి రావడంలేదు.'' అన్నది శ్రీదేవి ఒకనాడు కుమారునితో.

''పోనీ. నువ్వు కబురంపడం దేనికీ? తేలిగ్గా అనేశాడు శ్రీనగేష్.

''అయ్యో. అంత తేలికగా వదులుకోగలమా? ఏదో చిన్న తనం. తొందర పడిందనుకో.''

"ఏమిటో నీకు పిచ్చి! ఇక కబురంపకు......అయినా, పాపం పూర్తిగా ఆ జయను అనేందుకుకూడా వీలులేదు. పాపం. పిచ్చి తండ్రితో ఒంటరితనం భరించడం ఎంతకష్టం!''

''అదీ నిజమే.'' అంగీకరించింది శ్రీదేవి. ''అందుకే నేను మళ్ళీ కబురంపాను. ఏదో చిన్నపిల్ల కదా, తొందరపాటు సహజం. బండి పంపించాను.''

అంతలోన బండివచ్చి ఆగడం, జయశ్రీ అందులోనుంచి దిగి లోనికి ప్రవేశించడమూ జరగనే జరిగింది.

"రా జయా, ఏం రావడం మానేశావ్?" అంటూ ఆహ్వా నించాడు శ్రీ నగేష్.

"రామ్మా. ఏకళనున్నావో- ఇన్నాళ్ళకు వచ్చావ్," అన్నది శ్రీదేవి.

జయశ్రీ ముఖంలో దరహాస వికాసాలేమీ కన్పించలేదు.

"అసలు నేనే రావాలనుకుంటున్నానులే ఇవ్వాళ. మీ మంగమ్మ వచ్చిందా ఊరునుంచి?"

"ఆ ఎందుకు?" శ్రీదేవి ప్రశ్న.

"ఆమెను రేపు ఒక్కసారి మా యింటికి పంపించగలవా, అత్తయ్యా! రేపు చిన్న విందు చేయాలని సంకల్పం."

తల్లీ కుమారు లిరువురూ లోలోన ఆశ్చర్యం పొందారు,

"ఎందుకమ్మా నీకంత గొడవ? మీ నాన్నచూస్తే ఆ వరస. నీకు మరో ఆసరాలేదు." శ్రీదేవి చనవుగా అన్నది.

"గొడవేమున్నదిలే. కాస్త ఏదో విధంగా సందడి కల్పించుకుని నలుగురితో మసలదామని.''

''సరే,'' శ్రీదేవి తప్పనిసరిగా అంగీకరించింది, "అలాగే పంపిస్తానులే, రేపు ఉదయమే పంపించెయ్యనా?''

"ఏం బావా? రేపు ఉదయం నీకు తీరికేనా? వీలుం టుందా?''

జయశ్రీ ప్రశ్నకు శ్రీ నగేష్ కలవర పడ్డట్టు నటించాడు రెండు క్షణాలు. "ఎందుకూ? నేనుకూడా వచ్చి వంట చేయాలా మీ విందుకు?"

జయశ్రీతో పాటు శ్రీదేవికూడా పకపకా నవ్వేసింది. తర్వాత నవ్వును కట్టివేసుకుని చెప్పింది జయశ్రీ. "నీకు ఒకవేళ ఉదయం తీరికలేని పనులేమైనా వుంటే విందు రాత్రి ఏర్పాటు చేద్దామని. అంతే."

"ఎప్పుడైనా ఒకటేలే."

"సరే అయితే ఉదయం పది గంటలకు వచ్చేయాలి నువ్వూ అత్తయ్యాకూడా."

"అబ్బాయి వస్తాడు లేమ్మా," అన్నది శ్రీదేవి.

"అవును. నువ్వెందు కొస్తావు? పిలవడం నాదేతప్పు." అంటూన్న జయశ్రీ నేత్రాలకు అప్పుడే అటుగా వచ్చిన శ్రీధర్ కన్పించాడు. వెంటనే బుసలు కొడ్తూన్నట్లు లేచి, విసవిసా వెళ్ళిపోయింది.

తల్లీ కుమారు లిద్దరూ ముఖ ముఖాలు చూచుకున్నారు.

కొలది క్షణాల నిశ్శబ్దం అనంతరం శ్రీదేవి నోటినుండి అప్రయత్నంగా ఆమెకు తెలియకుండానే మాటలు వెలువడ్డాయి.

"ఏమిటో ఆడపిల్లకు ఈ విందులూ, గొడవా ఎందుకు? నాకేం నచ్చలేదు."

శ్రీ నగేష్ ఆ విషయం తనకనవసరమన్నట్లు తూష్ణీ భావంతో ఎటో చూస్తూ కూర్చున్నాడు.

"మాట్లాడవేం అబ్బాయ్?" రెట్టించింది శ్రీదేవి.

"ఎందుకు మాట్లాడాలమ్మా? అది ఆవిడ యిష్టం. మనకేం?"

"అదేంమాట?

"అంతేనమ్మా. ఆ అమ్మాయితో మనకేం సంబంధం? ఆమెపై మనకేమధికారమున్నది గనుక విమర్శించడానికి? ఆవిడ కలవాటైన తీరులో ఆవిడ నడచుకుంటూంది. మనకేం బాధ మధ్యన?"

"ఏదో చిన్నతనం. పాపం తెలియక!" శ్రీదేవికి ఆమెపై ఏమో తెలియరాని అభిమానానురాగాలు లోలోన. అందుకే ఆమెను అడుగడుగునా సమర్థించుకోనిదే తృప్తివుండదు.

శ్రీ నగేష్ గంభీరంగా అన్నాడు: "నువ్వన్నది నిజమే లేమ్మా. చిన్నతనం వల్ల తెలిసీ తెలియని ప్రవర్తనే అనుకో. కాని చూడు—పెద్దవాళ్ళు, శ్రేయోభిలాషులు ఇచ్చే సలహాలను కూడ గ్రహింపలేనంత చిన్నతనమూ తెలివితక్కువా లేవుగా? అదొక విధమైన అహంభావ స్వభావం. అంతే. మన కనవసరం, ఆ విమర్శ."

"ఏం, ఏం జరిగిందేమిటి?"

"ఏం లేదులే. ఊరికే మాట మాత్రంగా అన్నాను."

"చెప్పూ."

మరి గోప్యంగా వుంచలేకపోయాడు శ్రీనగేష్ "మొన్న ఒకనాడు సాయంత్రం ఒంటరిగా షికారు బయలుదేరి, వెళ్తే అక్కడ జయ ఊరవతల కాలవ ఒడ్డున కూర్చునివుంది నేను స్నేహాన చెప్పబోయాను, 'ఇలా ఒంటరి షికార్లు మంచిది కాదని. తేలికగా తీసి పారేసింది. మేము అక్కడ వుండగానే బీడీవో వచ్చాడు. చీకటి పడబో తున్నదని నేను లేచి వచ్చేస్తూ ఆమెనుకూడా రమ్మంటే రాలేదు. ఒంటరిగా ఆ సమయాన అతడితో కబుర్లు వేసుక్కూర్చుంది."

వింటూన్న శ్రీదేవి మాట్లాడలేకపోయింది.

"ఎదుటి మనిషి విలువా, మాట విలువా ఆమెకు బొత్తిగా తెలియదమ్మా! తండ్రిదొక పిచ్చి ధోరణి! ఈమెదొక మంకు పట్టు. అంతే!"

చాలా సేపటికి కాని తేరుకోలేకపోయింది శ్రీదేవి. కడకు, నెమ్మదిగా లోపలికి పోబోతూ అన్నది; "ఆ శ్రీలక్ష్మి తిరగడం లేదూ అంత విచ్చలవిడిగా? అయినా ఈ కాలపు పిల్లలే అంత కాబోలు! చదువుకున్న వాళ్ళాయె!"

"కాదమ్మా!" ఖండితంగా అన్నాడు శ్రీ నగేష్. "అంత మాత్రంకాదు. శ్రీలక్ష్మి చొరవలో వివేకం, ప్రవర్తనలో ధైర్యం, విచక్షణా జ్ఞానం, ఎదుటివారిపై గౌరవం వున్నాయి. ఆ యిద్దరికి నీవు పోలికపెట్టకు. శ్రీలక్ష్మి తీరే వేరు, నడవడేవేరు. నిండు పాత్ర, సహజగంభీర."

శ్రీదేవి సమాధాన మివ్వకుండా లోపలికి పోవ ఉద్యుక్తురాలైంది.

"అమ్మా! ఒక్కమాట."

"ఏమిటి?"

"ఒక్క కోరిక మన్నిస్తావా?"

"బాగుంది. చెప్పు నాయనా. నీమాట నేను కాదనడమా?

"అయితే విను. శ్రీలక్ష్మి ఎప్పుడు ఏ కారణాన మనింటికి రావడం సంభవించినా ఆమెకు మర్యాద లోపం చేయకుండా, చిన్న బుచ్చకుండా వుండగలవా?"

కొద్ది క్షణాల మౌనానంతరం అడిగింది శ్రీదేవి; "అయితే ఆమె మళ్ళీ తానే ఎప్పుడైనా వస్తానన్నదా? నువ్వు రమ్మన్నావా?"

ఆ ప్రశ్నకు శ్రీ నగేష్ సమాధానమివ్వలేదు. కొద్దిసేపటికి లేచి తన గదిలోకి పోబోతూన్న అతడితో, సాధ్యమైనంతవఱకూ తన స్వరాన్ని శాంతంగా మలుస్తూ అన్నది శ్రీదేవి; "ఆమెను చిన్నబుచ్చవలసినపని మనకేమున్నది బాబూ? ఇంటికి అనుదినం అనేక మంది వచ్చి వెళ్తున్నారు. నేనెన్నడూ ఎవ్వరికీ మర్యాద లోపం జరుగనీయలేదు." అంటూనే నిష్క్రమించింది.

అతడి అర్థయుక్తమైన ప్రశ్నకు ఆమె భావయుక్తంగా జవాబిచ్చింది!

* * *

విందు ముగిసింది. శ్రీనగేష్, శ్రీకాంత్, బీడీవోలు ముగ్గురు మాత్రమే అతిథులు. శ్రీపతి కూడ చాల ఉల్లాసంగా సంతోషంగా ప్రవర్తించాడు. అతడిని ఆ సమయంలో చూచిన వారెవరూ మతి చాంచల్యం గల వాడని ఎంతమాత్రం అనుకోరు. జయశ్రీ సంగతి చెప్పనే అవసరం లేదు; ప్రకృతమంతా మరచి పోయి చాలా హుషారుగా తిరిగింది—కబుర్లు చెప్తూ, చకచకా పనులు చేస్తూ.

ఎవ్వరూ వినకుండా ప్రత్యేకంగా అడిగాడు శ్రీనగేష్ శ్రీకాంత్‌ను, "శ్రీపతిగారి స్థితి ఏమైనా కాస్త మెరుగైనట్టు గానీ, మారినట్టు గానీ మీరు గుర్తించారా?"

తేలికగా తీసిపారేశాడు శ్రీకాంత్ "ఇక ఆ ముసిలాయనకు బాగేమిటి? ఆయనకిక ఏంచేసినా వ్యర్థమేనని నా ఉద్దేశ్యం"

శ్రీనగేష్‌కు ఆ మాటలకు కోపం కలిగినా పైకి వ్యక్తం కానీయలేదు.

ఉన్నట్లుండి శ్రీపతి అన్నాడు, "చూడమ్మాయ్. ఈ పల్లెలోవుండి మనమే ఇంతిలా వుంటే ఇంక సిటీస్‌లో ఉన్న వాళ్ళెలా వుంటారంటావ్? నిత్యం పార్టీలూ, వినోదాలూ—అసలు మనం గుర్తుండ గల అవకాశాలే వుండవ్ కానా?"

అందరూ సంభాషణ ఆపేసి, హఠాత్తుగా మారిపోతున్న అతడి ధోరణిని వింతగా తిలకించసాగారు.

"చూడమ్మా ఢిల్లీలో ఎంత హడావుడీ, ఎంతగొడవా! ఆ అమ్మాయ్ ఏమంటావ్? అందుకే మనం గుర్తులేకుండా, ఓ ఉత్తరం ముక్కైనా రాయకుండా అలావుండ గల్గుతున్నారు అబ్బాయిలు—ఏమంటావ్?"

ఆ మాటలు వింటూనే శ్రీకాంత్, ఆఫీసరూ ముఖముఖాలు చూచుకుని హేళనాపూర్వకంగా ముసిముసి నవ్వులు నవ్వుకోవడం గమనించిన శ్రీనగేష్ మనస్సు కలుక్కు మన్నది. అతడి చూపులు అప్రయత్నంగానే జయశ్రీ పైకి మరలాయి. ఆమెకు వారి మాటలతీరు ఏమీకలత కలిగించినట్లు కన్పించలేదు కానీ, తన ఆనందాన్నంతనూ ఎవరో లాగివేసుకొంటూన్నంత అసంతృప్తి వదనాన్ని ఆక్రమించుకోవడం స్పష్టమయ్యింది.

"చంద్రం ఎక్కడా?" అన్నాడు శ్రీనగేష్ అధికారంగా సిద్ధంగా వచ్చి నిల్చున్నాడు చంద్రం. శ్రీపతి వెపుచూపి సైగ చేశాడు శ్రీనగేష్.

సమయస్ఫూర్తిగల నర్సు చంద్రం వెంటనే తన బాధ్యతను గుర్తించాడు "చదరంగం ఆడుకోవటానికన్నీ సిద్ధం చేశాను రండి ఈ గొడవలో మనం కూర్చోలేం. వీరంతా హడావుడి రాయుళ్ళు" అన్నాడు శ్రీపతికి చేతి కర్ర అందిస్తూ.

"ఓ! పదపద, మరినేను వెళ్తున్నా." అంటూ అతిథుల దగ్గర సరిగా సెలవు తీసుకోకుండానే మేడమీదకు వెళ్ళిపోయాడు. చదరంగంపై అతిమక్కువగల శ్రీపతి.

'హమ్మయ్య!" గుండెలపై చేయి పెట్టుకుని తేలికగా ఊపిరి వదిలింది జయశ్రీ "నీ పుణ్యమా అని ఈ నాల్గు రోజుల నుంచి కాస్త నిశ్చింతగా ఉండగల్గుతున్నాను బావా" అని నగేష్‌ను ఉద్దేశించి చెప్తూ, పేక తీసుకు కలపసాగింది.

"అదికాదు క్యారమ్స్ ఆడదాం" అన్నాడు బ్లాక్ ఆఫీసర్.

'పేకే బాగుంటుంది." శ్రీకాంత్ అభిప్రాయం చెప్పాడు.

"పేకే ఆడదాం. రెండు సెట్లుకలిపి సీక్వెన్స్ ఆడితే సరదాగా వుంటుంది" జయశ్రీ మాటలివి. "ఏం బావా నువ్వేమంటావ్?"

"నేను వెళ్తున్నాను. పనుంది" హఠాత్తుగా లేచాడు శ్రీనగేష్.

"మీకు ఇష్టమైనది ఆడుకోండి. మరి నేను వెళ్తున్నాను. నమస్కారం."

"ఓకే! వెళ్ళిరండి." అన్నారు శ్రీకాంత్, ఆఫీసరూ ఒకేసారి.

"ఏం బావా? అప్పుడే వెళ్ళడమేం?" అంటూ తానూ లేచింది జయశ్రీ వెనుకనే అడుగులు వేస్తూ వీధి ద్వారం వరకు వెళ్ళింది.

శ్రీనగేశ్ సమాధానంచెప్పలేదు.

"ఏంబావా? నీకేదో కోపం వచ్చినట్టుంది?" మళ్ళీ అడిగింది.

నడక ఆపి, వెనుదిరిగాడు శ్రీనగేష్." విందుకు వచ్చిన వాళ్ళం విందు పూర్తికాగానే వెళ్ళడం మాధర్మం, వెళ్ళనివ్వడం నీకు క్షేమకరం."

అప్రతిభురాలై చూడసాగింది జయశ్రీ.

"చూడు జయా, నేను నీహితం కోరేవాడిని గనుక చెప్తున్నాను, మనుషులంతా చెడ్డవాళ్ళని నేననను, మనకు ఆ మీమాంస అనవసరంకూడ. మనకు కావలసినది మన హద్దు లేమిటో ఆలోచించుకోవలసిన అవసరం."

"అంటే?" కొంచెం అభిమానంగానే ప్రశ్నించింది జయశ్రీ.

"నువ్వు ఈ ఊరునుంచి తర్వాత వెళ్ళిపోయేదానవైనా, ప్రస్తుతం యిక్కడ వున్నంత కాలం యిక్కడి ప్రజలను సరకు జేస్తూ, వీరి మాటలు పాటించ వలసిన అవసరం వున్నది. అందునా ఘరానా యింటి స్త్రీలు కొన్ని హద్దులలో మెలిగితేకాని ఆ ఘనతా గౌరవాలు దక్కవు."

క్రోధాభిమానాలు ముప్పిరిగొని, అరుణిమ దాల్చిన వదనంతో మాటలు దక్క నిశ్చేష్టయై నిలబడ్డ జయశ్రీని ఒక్క క్షణం పరిశీలనగా చూచాడు శ్రీనగేష్. "అంత కంటె వివరంగా చెప్పవలసిన ఆవసరం లేదనుకుంటాను; నువ్వే గ్రహించగలవు హితైషిగా చెప్పిన ఈ మాటలకు ఆగ్రహం చెందక, సావధానంగా ఆలోచించుకో. నువ్వు నీ తండ్రి మన స్థిమితం కోసం ఇక్కడికి వచ్చావ్. నీగురించి అన్ని విషయాలూ నువ్వే ఆలోచించుకుని, నేర్పుగా ప్రవర్తించాలే కాని, నీ గురించి జాగ్రత్తలు తీసుకొనేవారెవరూ నీయింట లేరు ఈ రెండు విషయాలనూ నువ్వు ఒక్క క్షణంకూడా విస్మరించరాదు "

అవనత శిరస్కయై మౌనంగా వింటూన్న జయశ్రీ ముఖభంగిమల నుండి ఎటువంటి భావమూ గ్రహించ వీలు కాలేదతడికి.

మరో రెండడుగులువేసి ఆగిపోయాడు శ్రీనగేష్ ''అన్నట్టు జయా! రేపు అత్యవసరమైన విషయం మామయ్య గురించి నీతో చాలా మాట్లాడాలి ''

" అలాగే. ఏ టైముకు వస్తావు "

'' నేను రాను. ఒక పెద్ద కారణంవుంది బండి పంపిస్తాను. రేపు మధ్యాహ్నం సరిగా మూడు గంటలకు నువ్వూ, మామయ్యా, చంద్రిం తప్పనిసరిగా రావాలి ''

జయముఖంలో అయిష్టత కన్పించింది. "తప్పదంటావా?''

శ్రీనగేష్ స్వరం కఠినంగా పలికింది. '' తప్పేదీ, తప్పవలసిందీ కాదు. ఇదికూడా వైద్యంలో ఒక భాగమే. ఈ విషయంలో ముఖ్యులైన కొందరు వ్యక్తులు రేపు మాయింటి కొస్తారు. వారి సమక్షంలో మామయ్యను నేను పరీక్షించాలి."

'' సరే. "

హుందాగా నడుస్తూ అంత కంతకు దూరమై పోతూన్న అతడిని అలాచూస్తూ నిలబడిన జయశ్రీ మదిలో అనేక ఆలోచనా తరంగాలు మెదిలాయి. ఒక్కసారిగా అతడి ప్రక్కన తనను తాను ఊహించుకుని కలలు కనబోతుంది. అంతలో మధ్యన శ్రీధర్ వచ్చి నిల్చుంటాడు. మనస్సు రోషంతో అవమానంతో మండి పడ్తుంది ద్వైదీ భావాలతో సతమత మౌతుంది అంతలోనే. ఎందుకాబాధ? నేనున్నాను రమ్మన్నట్లుగా శ్రీకాంత్ రూపం నిలుస్తుంది.

శ్రీనగేష్ కనుమరుగైన తర్వాత మెల్లగా లోనికి తిరిగి వచ్చిన జయశ్రీని, నగేష్ వెళ్ళి పోయాడా?'' అని ప్రశ్నించాడు బ్లాక్ ఆఫీసర్.

'' వెళ్ళారు '' అన్నది ముక్తసరిగా. ఆట దగ్గర కూర్చుంటూ.

'' మరీ బడాయి. ఒక్క ఆరగంట మనతో గడిపినంత మాత్రాన అతడి రాచ కార్యాలన్నీ పాడైపోతాయా? " అన్నాడు శ్రీకాంత్.

అఫీసర్ పగలబడి నవ్వాడు. ' అంత అహంభావమన్న మాట! ''

'' ఆఁ. " నిరసనగా అన్నాడు శ్రీకాంత్. '' నగేష్ విషయాలు మీకేం తెల్సు. నాకు తెలుసు. మేం కొంత కాలం సహాధ్యాయులం అతి సౌందర్య వంతుడు కావడంతో అహంభావం కలగడం సహజం. అయితే. ఇతడికి అది అందరిలాగా ప్రదర్శించకుండా చక్కగా నటించడం కూడా తెల్సు "

కబుర్లలో పడడంతో ఆట మరి సాగలేదు.

' అనిర్వచనీయమైన అశాంతితో బాధపడ్తూన్న జయశ్రీ మౌనంగా వినడమే కాని ఎటూ మాట్లాడలేదు. కాని నగేష్‌ను గురించి చెడుగా వినడానికి ఆమె మనస్సెందుకో బాధపడింది

హేళనగా నవ్వాడు శ్రీకాంత్ '' నగేష్ భార్య బెంగతో గ్రిగ్గుళ్ళి చచ్చిపోయిందని వాడుక. ఆమె నాకు దూరపు బంధువులెండి. కారణం ఏమంటంటారు? గోపికాలోలుడనేగా?'' మళ్ళీ నవ్వాడు.

'' అంతటివాడన్నమాట!' బ్లాక్ ఆఫీసర్ ఏవో మహాద్భుత విషయం పరిశోధించినట్లు తృప్తిపడ్డాడు

ఉలిక్కిపడింది జయశ్రీ మేను తల వేయి వ్రక్కలైనట్లుంది. నగేష్‌ను గురించిన అటువంటి మాటలు వినడానికి ' ఎంతటి అప్రియమైన విషయాలు! నిజంగా బావ అటువంటివాడా! యావత్ శరీరాన్ని నీరసం ఆవరించేసింది. మనస్సు కుత కుతలాడి పోయింది.

బాధతో కంతలు రుద్దుకొంటూన్న ఆమె మనోస్థితిని గ్రహించిన శ్రీకాంత్, ''మీకు సంగీతమేమైనా వచ్చా జయశ్రీగారూ? ఒక్క పాట పాడండి '' అని అభ్యర్థించాడు. స్త్రీల మనోరీతులూ, వారిని ఆకట్టుకొనే విధమూ అతడికి తెలుసు!

సంభాషణ మారడంతో జయశ్రీ మనస్సు తాత్కాలికోపశమనాన్ని పొందింది ''నాకు రాదు. మీకువస్తే పాడండి '' అన్నది శ్రీకాంత్‌ను తిరిగి.

నిజానికి శ్రీకాంత్ కోరుకొన్నదే అది! తన ప్రావీణ్యాన్నీ, ప్రత్యేకతనూ యువతులముందు ప్రదర్శించి, ప్రత్యేకతను సంపాదించడానికే సతతం అతడి తాపత్రయం. ఏ పూర్వ జన్మ సుకృతమో, ఏ దేవత వరమో—గంధర్వగానం అతడిసొత్తు రూపు రేఖలకూ, సంభాషణా చతురతకూ కూడ ఏమీ లోపంలేదు. అందువల్లనే ఆదినాన—సుదినమో, దుర్దినమో నిర్ణయించలేని ఆరోజున—శ్రీనగేష్‌పై అనిర్వచనీయమైన క్రోధాసహ్యాలతో మనసు మండిపోతూన్న జయశ్రీ హృదయంలో శ్రీకాంత్ స్థిరమైన స్థానాన్ని సంపాదించుకో గలిగాడు అతడు సెలవు తీసుకు వెళ్ళిపోయిన తర్వాతకూడ పదే పదే అతడి చిలిపి మాటలూ, మోహనగానమూ ఆమెను వెన్నాడుతూనే వున్నాయి.

జయశ్రీ సాధారణ యువతి, గొప్ప ఆదర్శాలూ, నిశిత విమర్శనా ఆమెకులేవు. ఆమె యౌవన దేహమూ, మనసూ ఏదో తగుమాత్రం చదువూ, అందమూ, చురుకుదనమూ వున్న తోడు కోసం తహతహ లాడుతున్నాయి. అందుకు శ్రీకాంత్ అనుగుణంగానే వున్నాడు! డబ్బు సంగతి ఆలోచించవలసిన అవసరం ఆమెకులేదు; తానే ధనవంతురాలు! ఇక మిగిలినది సంస్కారం. అది ఆమెకే లేదు అసలటువంటి విషయం ఆమె ఎప్పుడూ ఆలోచించదు. అందుకే తన భాగస్వామి ఎన్నిక విషయంలో కూడా ఆమె కా పదం గుర్తుకురాలేదు నిజానికి ఆ 'సంస్కారం' ఉన్న వ్యక్తులను ఆమె భరించలేదేమో కూడ! అందుకే శ్రీలక్ష్మిని సమర్థించి ఆదరించిన శ్రీనగేష్ చేదు అయ్యాడు; శ్రీనగేష్‌ను విమర్శించి వ్యాఖ్యానాలు సలిపిన శ్రీకాంత్ ఆత్మీయుడుగా తోచాడు! ఒక్క మాటలో—జయశ్రీ మనోఫలకంపై అస్థిరంగా నాట్యమాడుతూన్న శ్రీనగేష్ ప్రతిమను త్రోసిరాజని శ్రీకాంత్ విగ్రహం సుస్థిరంగా నిలచింది.

కాని ఒకవంక మనసున శ్రీనగేష్ ప్రతిమను కూడ త్రోసివేయులేకపోయింది జయశ్రీ.

అతిథులు నిష్క్రమించిన పిమ్మట, ఏమో తనకే తెలియని బాధాక్రోశాలతో సతమతమౌతూ శయ్యపై అటు యిటు దొర్లుతూన్న జయశ్రీ చెవులకు ప్రక్కగదిలో చదరంగం ఆడుతూ శ్రీపతీ చంద్రాలు మాట్లాడుకుంటూన్న మాటలు చికాకెత్తింగ సాగాయి. 'నోరు మూసుకొమ్మని గట్టిగా అరవాలనిపించింది.'

"అమ్మాయిగారూ! నేను వెళ్తున్నానండి, పనంతా అయ్యింది సామాను సర్దించేశాను." అని చెప్పవచ్చిన మంగమ్మను నోటికొచ్చినట్లల్లా తిట్టాలనిపించింది. "సరే, వెళ్ళు" అనేసింది విసుగ్గా.

మంగమ్మ కదలలేదు. కొద్దిసేపు తటపటాయిస్తూ నిల్చుని, చరకు సాహసించి, దగ్గరగా వెళ్ళింది. (సశేషం)


# ప్రధానమంత్రి కరువు సహాయకనిధికి ఉదారంగా విరాళమివ్వండి

ఇప్పుడే మీ సహాయం అవసరం

"మనమందరమూ ఒకే జాతికి చెందినవారము. మనమంతా ఒకే ప్రజ. బీహారు, ఉత్తరప్రదేశ్, ఇతర అనావృష్టి ప్రాంతాలలో వచ్చిన ఆపద యావద్భారతదేశానికే వచ్చిన ఆపద. మనమంతా కలిసి అనావృష్టి పరిస్థితుల్ని ఎదుర్కోనాలి. కష్టసుఖాలను మనమంతా కలిసి పంచుకోవాలి. ఉజ్జ్వల భవిష్యత్తుకు మనం ఐక్యంగా కృషిచేయాలి."

ప్రధాన మంత్రి

విరాళాలను నగదు రూపంలోకానీ, వస్తురూపంలోకానీ

ప్రధానమంత్రి కరువు సహాయకనిధి
క్యాబినెట్ సెక్రటేరియట్, రాష్ట్రపతిభవన్, న్యూఢిల్లీ–4కు పంపండి.

వ్యవసాయదారులకు
అవసరమైన
ఫాక్టంఫోస్
(అమోనియం ఫోస్ఫేటు 16:20)
అల్ట్రాఫోస్
(పొడి చేసిన ఖనిజ ఫాస్ఫేటు)
అమోనియం సల్ఫేటు
సూపర్ ఫాస్ఫేటు
ఎన్‌పికె ఎరువుల మిశ్రమం

**FACT**
*first in the field!*

పారిశ్రామిక వేత్తలకు
అవసరమైన
అన్‌హైడ్రస్ అమోనియా
సల్ఫ్యూరిక్ ఏసిడు
సల్ఫర్ డయాక్సైడు
అమోనియం క్లోరైడు
సోడియం ఫ్లోరైడు
—మా వద్ద లభించును.

# ది ఫెర్టిలైజర్ అండ్ కెమికల్స్ ట్రావన్కూర్ లి.

రిజిష్టర్డ్ కార్యాలయం: ఎల్లూర్, ఉద్యోగ మండల్, పి. ఒ. కేరళ

# భరతనాట్య సంప్రదాయంలో

# అరంగేట్రం

> గురువువద్ద నృత్య శిక్షణ పూర్తిచేసిన తర్వాత తొలిసారిగా సరస్వతీదేవిని ఆరాధించి, గురువును సత్కరించి నృత్య ప్రదర్శన యివ్వడమే అరంగేట్రం అంటారు.

గుహామానవుడు తన ఆహారంగురించి ప్రాణాలకు సైతం తెగించి భయంకర అటవీ మృగాలతో పోరాడి, విజయుడై, ఆనందాన్ని ప్రకటించుకోవడానికి గంతులు వేయడం ప్రారంభించిననాడే నృత్య కళ ఆవిర్భావానికి అంకురార్పణ జరిగింది. కాకతాళీయంగా సంభవించే యీ ఆనందాభివ్యక్తీకరణ క్రమశః ఆనందానుభూతి ప్రకటనకు ఒక సంకేతంగామారి అమలులోనికి వచ్చింది. సంతోషసమయాలలో పదుగురూచేరి గెంతులు వేసేవారు. మానవుడు నాగరికత సంతరించుకొని మొహంజొదారో హరప్పాలలోవలె గ్రామీణ, పట్టణ జీవితానికి అలవాటుపడిన అనంతరం యిది జానపద కళగా వృద్ధి చెందింది. మొహంజొదారో శిథిలాలలో దొరికిన ఎర్రమట్టి బొమ్మను—నృత్య భంగిమలో స్త్రీమూర్తిని—చూసినప్పుడు క్రీస్తుకుపూర్వమే నృత్యం సామాజిక జీవితంలోనికి ప్రవేశించినట్టు అర్థమౌతుంది. ఆపైన రాచరికపు వ్యవస్థలు నెలకొనడంతో నృత్యానికికూడా విశేషమైన ఆదరణలభించింది. సామాజిక జీవితంలోంచి రాజగృహంలోనికి ప్రవేశించిననృత్యం మరింత నాజూకు, సొగసులను సంతరించుకొని క్రమబద్ధమైంది. అయితే సామాజిక జీవితాన్ని సుస్థిరపరచడానికి వర్ణవ్యవస్థ ఏర్పడి ఒకొక్క కులానికి ఒకొక్క ప్రత్యేకమైన వృత్తి ఆచరణీయమైంది. నృత్యకళను దేవదాసిస్త్రీలు ఆరాధిస్తుండేవారు. ఆదిలో కళలన్నీ భగవంతుని లీలావిశేషాలను, జీవితగాథలను ఉగ్గడిస్తూ భగవంతునికే అంకితమై పోయేవి. నృత్యకళకూడా అంతే. దేవదాసీలు భగవన్నిలయాలైన ఆలయాలలో భగవంతుని సన్నిధిని నృత్యం చేస్తుండేవారు. భగవత్ సేవయే వారి పరమావధిగా భావించి జీవించేవారు. కాలగతిలో ఈ దేవదాసీలు మానవ సహజమైన బలహీనతలకు లోనై తొల్లిటి పరిశుద్ధతను, గౌరవాన్ని, అప్హాతను పోగొట్టుకుని, ఐహిక సుఖాలపై ఆసక్తితో రాజాస్థానాలలో ఆస్థాన నర్తకిలుగా ప్రవేశించారు. దేవదాసీ ఆలయ నృత్య పద్ధతి మృగ్యమై పోయింది. రాజాదరణతో నృత్యం బహుభంగుల వికసించి అనేక చేర్పులు, కూర్పులతో నాజూకును సంతరించుకుంది. రాచరికపు వ్యవస్థలో రాజులు, రాజాస్థానాలలో ఉన్నత పదవులలోని వారూ నాట్యకళ వికాసానికి ఎంతగానో తోడ్పడ్డారు. దేశీయాలైన నట్టువమేళం, గొల్లకలాపంవంటి నృత్యరీతుల పరిపూర్ణ వికాసమే కూచిపూడి నృత్యం.

విజయనగర సామ్రాజ్య పతనంతో ఆంధ్ర నృత్య సరస్వతి తంజావూరికి తరలి వెళ్ళిపోయింది. తంజావూరు నేలిన నాయక రాజులు, ఆతర్వాత మహారాష్ట్రరాజులు నృత్యకళ వికాసానికి ఎంతగానో తోడ్పడ్డారు. ఆంధ్రదేశంలో ఆదరణ కరువై పరసీమకు వలసపోయిన కూచిపూడి నృత్యం ఆనాడే సర్వాలంకార శోభితయై, ఆంగిక, సాత్వికాభినయ పరిపుష్టియై మెరుపువంటివేగాన్ని సంతరించుకొని, హృదయంలోని సున్నితమైన అనుభవాన్ని సైతం ప్రకటించగలిగే స్పష్టతను అలవరచుకొని భరతనాట్యంగా రూపురేఖలు తీర్చి దిద్దుకుంది. భరతనాట్య సంప్రదాయాన్ని పరిరక్షించుకొంటూ ఉత్తర భారతదేశపు మిశ్రమనాట్య పద్ధతుల ప్రభావానికి దూరంగా వుంచి సంప్రదాయాన్ని కాపాడుకుంటూ ప్రపంచానికంతటికి భరతనాట్య ప్రతిభా విశేషాలను చాటి చెప్పుతున్న ఘనత ప్రధానంగా దాక్షిణాత్యులదే. ఇటీవలి కాలంలో తంజావూరు బాలసరస్వతి, వైజయంతిమాల, యామినీ కృష్ణమూర్తి వంటివారు భరతనాట్య వైభవ విశేషాలను ప్రపంచానికి చాటి చెప్పుతున్నారు.

స్వాతంత్ర్యానంతరం గతకాలపు ప్రాభవ వైశిష్ట్యాలను, సంస్కృతిని పునరుద్ధరించడానికి విశేషంగా కృషి జరుగుతున్నది. వివిధ లలితకళలకు సంబంధించిన అకాడమీలను ప్రభుత్వం ఏర్పాటుచేసి ఆయా కళలను ప్రోత్సహిస్తోంది. ఒకవైపు ప్రభుత్వం మన సాంప్రదాయ శాస్త్రీయ నృత్య వికాసానికి దోహదం కల్పిస్తుండగా ప్రజలు తగినంతగా ఆ సౌకర్యాలను వినియోగించుకోవడం లేదనుకోవలసి వస్తోంది. ప్రతిభావ్యుత్పత్తులను ప్రదర్శించగలిగే స్థితికి చేరుకోవాలన్న చిత్తశుద్ధిలేక కేవలం సినిమాలలో ప్రవేశించాలన్న లక్ష్యానికి నిచ్చెనగా భావించడం ఎంతయినా శోచనీయం. ఈ ధోరణి మారాలి. ప్రభుత్వం అందజేస్తున్న సౌకర్యాలను, కల్పిస్తున్న అవకాశాలను వినియోగించుకోవాలి.

ఇటీవలి కాలంలో రవీంద్రభారతి కళలకు కాణాచి అవుతున్నది. నెలపొడుగునా ఏదో ఒక ప్రదర్శన జరుగుతున్నది. ఆంధ్రుల కళాభిరుచికి యిదొక తార్కాణం.

ఈ మధ్య రాజధానిలో చి॥ బి. రమాదేవి అరంగేట్రం జరిగింది. దీనికే గజ్జెలపూజ అని మరొక పేరు. ఈ ఆచారం తమిళదేశంలో బాగా ప్రచారంలో వుంది. చి॥ రమాదేవి ప్రసిద్ధ నాట్యాచారులు నటరాజ రామకృష్ణగారివద్ద భరతనాట్యం, కూచిపూడి నృత్యాలలో శిక్షణపొంది, తొలిసారి రంగస్థలం ఎక్కింది. పుష్పాంజలి, గణపతి కవుతం, పదవర్ణము, జావళీలను హృద్యంగమంగ, అతి చాకచక్యంతో సమర్థురాలైన నర్తకివలె ప్రదర్శించి కళాభిమానుల ప్రశంసలను అందుకుంది. ఈ సందర్భంలో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తిగారు నర్తకిని, ఆమె గురువుగారిని ప్రశంసిస్తూ ప్రసంగించారు.

# శ్రీరంగం దేవాలయాలు

—ఎస్. రమేశన్

(గతసంచిక తరువాయి)

శ్రీనారాయణుడు ఏతెంచిన విమానం ప్రణవానికి, చతుర్వేదాలకు చిహ్నం. రంగనాథుడు విశ్రమించిన సర్పరాజు ఆదిశేషుడు బ్రాహ్మణానికి చిహ్నం. ఆ విధంగా దైవదత్తమైన ఆ విమానాన్ని దేవలోకంనుంచి ఇక్ష్వాకుడు అయోధ్యకు తీసుకొచ్చి పూజా పునస్కారాలతో అర్చిస్తుండేవాడు. ఈ విమానాన్ని శ్రీరాముడు రావణాసురుని తమ్ముడైన విభీషణునికి యివ్వగా దానిని లంకాపురానికి తీసుకొని వెళ్తూ మధ్యేమార్గంలో శ్రీరంగదీవిలో దిగగా అది భూమికి అంటుకుపోయిందని ఒక ప్రతీతి. రథంమాదిరిగా వుండే ఈ దేవాలయంలోని రంగవిమానం బంగారంతో చేయబడి పైభాగాన వేదమూర్తులు అంతర్భాగాన రంగనాథుడు రూపాలు గలిగివున్నది.

పధ్నాలుగవ శతాబ్దంలో అటు ఉత్తర హిందూదేశం నుంచి దక్షిణాదికి దండెత్తివచ్చి విజయలక్ష్మిని వరించిన అనేక ముసల్మాను రాజులు మతావేశంతో దక్షిణాది హిందూదేవాలయాలను ధ్వంసం చేస్తుండేవారు. అందుకని ఈ దేవాలయంలోని రంగనాథుని విగ్రహాన్ని వేరేచోటికి తరలించి దాచడంవల్ల కొంతకాలంపాటు తాత్కాలికంగా ఈ దేవాలయాన్ని మూసివేయడం జరిగింది. మాలిక్ కాఫర్ నాయకత్వం క్రింద ముసల్మానులు దక్షిణాదిలో హిందూ దేవాలయాలను నాశనం చేస్తున్న తరుణంలో రంగనాథుని విగ్రహాన్ని ఆలయ అర్చకుడు తిరుపతికి తీసుకొని పోయినట్టు ఆలయ ద్వితీయ ప్రాకారం మీద చెక్కబడిన శాసనంద్వారా, వైష్ణవ ఆళ్వారులకు సంబంధించిన "గురుపరంపర ప్రభావం" ద్వారా తెలుస్తున్నది. అంతేగాకుండా ఈ అర్చకుడు దేవతా విగ్రహాన్ని బిళ్వపత్రాలతో మరుగుపరచి రహస్య ప్రదేశంలో దాచివుంచాడట. ఈ దేవాలయ సింహద్వారము, దక్షిణగోపురము రాళ్ళతో మూసి వేయబడివుంటాయి.

ఆ తర్వాత విజయనగర సామ్రాజ్యానికి చెందిన రెండవ కంప రాజువద్ద గల బ్రాహ్మణ అమాత్యుడు గోపన్నరాయుడు ఈ విగ్రహాన్ని తిరుపతినుంచి సింగవరానికి తీసుకొనివచ్చి ఆరాధించాడని, ఆ తరువాత దానిని తిరిగి శ్రీరంగానికి కొనిపోయి లక్ష్మిదేవి, భూదేవిలతోపాటు పునః ప్రతిష్ట కావించాడని ప్రతీతి. ఈ విగ్రహాన్ని తీసుకొని వెళ్ళిన మార్గంకూడా కొన్ని నిదర్శనాలద్వారా తెలియ వస్తున్నది. మొట్టమొదట ఈ విగ్రహాన్ని మైసూరు రాష్ట్రంలోని తిరునారాయణ పురానికి తీసుకొని వెళ్ళారని, అంతలో యిటువైపు దండెత్తి వచ్చిన ముసల్మాను ప్రభువు పాండ్యరాజ్యాన్ని కొల్లగొట్టడానికై తిరుచునాపల్లి వైపు కదిలిరాగా, అక్కడినుండి దానిని తిరుపతికి తీసుకొని పోయారని, పాండ్య రాజ్యపు ముఖ్యపట్టణమైన మధుర పతనంకాగా విజయనగర సామ్రాజ్యానికి సంబంధించిన గోపన్న ఈ విగ్రహాన్ని భద్రపరిచి క్రీ. శ. 1371లో దీనిని అక్కడ ప్రతిష్ఠించాడని చెప్తారు. అటుపిమ్మట పరితాపి గ్రహణ సంవత్సరం వైశాఖ మాసంలో పదునేడవదిసాన ఈ విగ్రహానికి భారీఎత్తున పూజా పునస్కారాలు జరిపించి శ్రీరంగంలో ప్రతిష్ఠించాడు. శ్రీరంగంలోని ఒకానొక అర్చకుడిని గూర్చికూడా ఒక కథ ప్రచారంలో వుంది. ఈ అర్చకుడు అక్కడ తిష్టవేసిన ముసల్మాను సేనానాయకుడి వద్దకు బాగా పేరుపడిన నర్తకిని ఒకామెను పంపించాడని, ఆమె తన అందచందాలతో ఆ సేనానాయకుడ్ని వశపరచుకొని తనవెంట వెల్లాళ గోపురంవరకు అతడిని తీసుకొనివచ్చి అక్కడనుంచి అతనిని కిందకు తోసి చంపివేసిందని, నాయకుడి మరణంతో తురుష్క సైన్యం దారంతెగిన గాలిపటమై ఢిల్లీనగరానికి వెడలిపోయారని చెప్తుంటారు. ఈ నర్తకి రంగనాథస్వామి భక్తురాలు. ఆమె చేసిన ఈ సాహస కార్యానికి ఆమె మరణ సమయంలో చితిని మండించడానికై రంగనాథస్వామి ఆలయ పెరటి ఉద్యానవనం నుండి పవిత్రమైన అగ్నిని తీసుకొని వెళ్ళారు. ఈనాటికి కూడా ఈ సంప్రదాయం ఈమె అనంతర వంశీయుల విషయంలో కొనసాగింప బడుతూ వస్తున్నది.

వైష్ణవ ఆళ్వారులకు పవిత్రమైన యాత్రాస్థలాలలో అత్యంత ప్రధానమైనది శ్రీరంగం. ఇంచు మించు ఆళ్వారులందరూ, వైష్ణవాలయాలలో అర్చింప బడుతున్న ప్రసిద్ధ వైష్ణవ గురువు లందరూ శ్రీరంగం యొక్క ప్రాశస్త్యాన్నిగూర్చి ఉగ్గడించిన వారే. ఆళ్వారులలో ప్రతి ఒక్కరూ ఈ వైష్ణవ ఆలయాన్నిగూర్చి ప్రస్తుతించారు. అందుకే శ్రీరంగం రంగనాథ ఆలయం శ్రీవైష్ణవులకు పరమ పవిత్రమైన యాత్రాస్థలం.

శాసనాల దృష్ట్యాకూడా ఈ దేవాలయానికి అత్యంత ప్రాధాన్యత ఉన్నది. ఈ దేవాలయంలో క్రీ. శ 9_16 శతాబ్దాల మధ్య దక్షిణావనిని ఏలిన చోళ, పాండ్య, హోయసల, విజయనగర సామ్రాజ్యాలకు చెందిన శాసనాలు వున్నాయి అందువల్ల ఈ దేవాలయం గత వెయ్యి సంవత్సరాలుగా వైష్ణవభక్తులకు పవిత్ర యాత్రాస్థలమై విలసిల్లుతున్నదనడానికి యిక్కడి శాసనాలే చక్కటి నిదర్శనాలు మనకు.

క్రీ. శ 1070 నుంచి క్రీ. శ 1118 వరకు పరిపాలించిన ఒకటవ కుళోత్తుంగ చోళుని శాసనానికి ఒకప్రత్యేక ప్రాధాన్యత

వున్నది. వైష్ణవ ఆళ్వారులను గూర్చిన విషయాలు చారిత్రికంగా తెలుసుకోవడానికి యిది తోడ్పడుతుంది. మొదటివైష్ణవ ఆళ్వారులనుగూర్చి ఈ శాసనంలో ప్రస్తావించ బడివుంది. పరమ పవిత్రమైన కులశేఖర మంత్రిల ద్వితీయ 'అధ్యాయాన్ని దేవునిఎదుట ఒకానొక ప్రసిద్ధ ఆళ్వారు పఠించగా ఆ సందర్భంలో మూడు రాత్రులపాటు జరిగిన ఆరాధ నోత్సవాలనుగూర్చి ఈ శాసనంలో ఉటంకించబడినది. ఇదేవిధంగా, క్రీ.శ. 1178వ సంవత్సరం నుంచి 1215వ సంవత్సరంవరకు పరిపాలించిన మూడవ కులోత్తుంగ చోళుడు, క్రీ.శ. 1246వ సంవత్సరం నుంచి 1267వ సంవత్సరం వరకు పరిపాలించిన రాజేంద్రచోళలనాటి శాసనాలుకూడా వున్నాయి. రాజకేసరివర్మ, పరకేసరివర్మ, మొదటి పరాంతకుల నాటి తొలిశాసనాలుసైతం కలవు. పాండ్యులకు సంబంధించినంత వరకు, క్రీ.శ. 1216వ సంవత్సరంలో సింహాసనా న్నధిష్టించిన మొదటి సుందర పాండ్యునినాటి శాసనం, ఈ దేవాలయందృష్ట్యా చాలాముఖ్యమైంది. దేవాలయానికి సంబంధించిన వివిధ వ్యక్తులు రాజమహేంద్ర తిరువిత్తి అనే వీధిలో సమావేశమై దేవాలయ ఆస్తులను దుర్వినియోగం చేస్తున్నటువంటి వ్యక్తులనుంచి ఆలయ నిర్వహణ బాధ్యతను స్వీకరించడానికై నిశ్చయించడానికి సంబంధించిన విషయాలు ఈ శాసనంలో వ్రాయబడినాయి.

క్రీ. శ. 1250వ సంవత్సరంలో సింహాసనాన్నధిష్టించిన జటవర్మపాండ్య అనే మొదటి సుందరపాండ్యనాటి శాసనంకూడా ముఖ్యమైనదే. ఆయన దేవాలయానికి ఇచ్చిన అనేకమైన కానుకలను గురించి ఈ శాసనంలో సంస్కృత భాషలో పద్యంలో వర్ణించబడింది. ఆయన ఒక కర్నాటక రాజునుంచి శ్రీరంగాన్ని తీసుకున్నట్లుకూడా ఇందులో పేర్కొనబడింది. ఇది హోయసల రాజు వీరసోమేశ్వరుని ప్రసక్తి అయినట్లు విదితమవుతున్నది. మైసూరులోని ద్వారసముద్రాన్ని పరిపాలించిన హోయసల రాజులు దక్షిణ దేశంలో జరిగిన అనేక యుద్ధాలలో కూడా పాల్గొన్నారు. ఈ దేవాలయంలో ఇదే రాజవంశానికి చెందిన రెండవ నరసింహుని శాసనంకూడా లభిస్తున్నది. చోళరాజుల సామ్రాజ్యంపై ఆయన దండయాత్ర చేసినట్లు ఈ శాసనంలో వుంది. ఆయన పుత్రుడు సోమేశ్వరుని శాసనం ఒక దానిలో దేవాలయంలోని పూలతోట కొరకు ఆయన ధనం ఇచ్చినట్లు తెలుపబడింది. ఈ వంశానికి చెందిన తరువాత రాజు రామనాథ దేవ రెండు శాసనాలు వ్రాయించాడు. ఈ దేవాలయానికి కొన్ని ఆభరణాలను కానుకగా సమర్పించినట్లూ, రెండు ఉద్యానఖండాలు, స్వామి కార్తికేయ ఉత్సవాలకు సంబంధించిన ప్రస్తావనలు కూడా ఈ శాసనంలో వున్నాయి.

విజయనగర సామ్రాజ్యానికి చెందిన రెండవ హరిహర రాయల నాటి శాసనంలో, హరిహరుని అమాత్య శేఖరుడు ముద్దయ దండనాయకుని ఘనతగురించి పేర్కొనబడింది. ఇక రెండవది 1293 వ శకం లేక క్రీ.శ. 1371 నాటిది. ఇది గోపన్నకు చెందినది. దీనిని గూర్చి లోగడనే ప్రస్తావించడం జరిగింది. తరువాత శాసనం 1385 శకం లేక క్రీ.శ 1463 నాటిది. తిరుమల దేవుని కాలానిది. నిర్దుష్టమైన అనేక గ్రామాల నుంచి పన్ను వసూలుచేసి శ్రీరంగరాజ దేవాలయానికి సమర్పించడానికి సంబంధించిన ప్రస్తావన దీనిలో వుంది. కేరళకు చెందిన రవి వర్మకు సంబధించిన ఒక శాసనంకూడా వుంది. ఈ రాజు తమ కులదేవత విష్ణువును శ్రీరంగంలో ఆరాధించినట్లూ, అచ్చట ఒక విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లూ, స్వామి గౌరవార్థం దీపోత్సవం జరిపినట్లు, పదిహేనుమంది విద్వాంసులకు ఏటాఒక్కొక్కరికి 100 పణముల చొప్పున ఇచ్చినట్లు ఈశాసనం వెల్లడిస్తుంది. ఈరాజుకు సంగ్రామ ధీరుడు, కుల శేఖరుడు అనే మరో రెండు పేర్లు కూడా కలవు. ఈయన వీర పాండ్యుని రెండు పర్యాయాలు ఓడించి చోళులను, పాండ్యులను తనకు సామంతులను చేసుకున్నట్లు ప్రతీతి.

శ్రీరంగం అంటే భూలోకవైకుంఠం అని అర్థం. ఇచ్చట సంవత్సరం పొడవునా వసంతోత్సవం, నవరాత్రి, గరుడోత్సవం, బ్రహ్మోత్సవం వంటి ఏదో ఒక ఉత్సవం జరుగుతుంటుంది.

ఈదేవాలయం దైనికకార్యక్రమాలు రాజసౌధం, రాజ దర్బారు వలె నిర్వహించ బడుతాయి. ప్రతి రోజు ప్రాతః కాలాన విశ్వరూప సందర్శనం జరుగుతుంది దానితో ఆలయ కార్యకలాపాలు ప్రారంభమవుతాయి. దేవాలయం నేటికీ గొప్ప ఆరాధనా కేంద్రంగా భాసిల్లుతున్నది. భారతదేశంలో ప్రాచీనకాలంలోను, మధ్యయుగంలోనూ దేవాలయాలకు చుట్టూర గ్రామాలను, పట్టణాలను నిర్మించి ఏవిధంగా అభివృద్ధి పరచినదీ తెలుసుకోవడానికి ఇది నిదర్శనంగా నిలచివున్నది. ఈదేవాలయం సమాజజీవితానికి కేంద్రస్థానంగా అలరారింది. ఇది వస్తు ప్రదర్శనశాలగాను, పూజాపునస్కారాలకూ, వినోదానికీ, ఉత్సవాలకూ స్థావరంగానూ గణతికెక్కింది. ప్రాచీనకాలంలో దేవాలయాలు ప్రజానీకంపై ఏలుబడి సాగించాయనే మరుపురాని సత్యాన్ని శ్రీరంగం దేవాలయం చాటుతున్నది.

(సమాప్తం)

---

మన సంస్కృతి, మన నాగరికత, మన స్వరాజ్యం—ఇవి మన జీవితావసరాలని ఎక్కువ చేసుకోవడంవల్ల కాపాడుకోలేము. అవసరాన్ని తగ్గించుకుని, స్వార్థరహితమైన ప్రవర్తన అలవరచు కోవడంవల్ల కాపాడుకుంటాం.

—మహాత్మాగాంధి

# గుడి కట్టించిందెవరు?

కల్యాణసింగ్

'అకళంకమైన భక్తి నీది  
ఆడంబరమైన యుక్తి నీది  
ఆలయంలో చెక్కిన  
బంగారపు అక్షరాలపేరు  
చెరిపివేయండి, అచ్చోట  
చెక్కించండి ఈమె పేరు.



" అందమైన ఆలయం అద్భుతమైన ఆలయం  
కొండ అంత ఆలయం గొప్పదైన 'ఆలయం  
ఆలయం ఆలయం అంతా మెచ్చే ఆలయం  
కట్టిస్తాను నాపేరు కలకాలం ఉండాలి. "  
— అనుకొన్నాడు రాజు.

" నాపేరే పెట్టాలి, నాపేరే ఉండాలి  
నాపేరనే కట్టాలి, నాకీర్తే నిలవాలి.  
గుడి కట్టడానికి ఎవరూ గోరంతైనా దానం  
ఇవ్వకూడదు; ఇవ్వకూడదు — ఇది నా ఆజ్ఞ. "  
— అన్నాడు రాజు.

అందమైన అద్భుతమైన ఆలయం లేచింది.  
గొప్పదైన గోపురం కొండనే తాకింది.  
మండపంలో చెక్కించాడు మహారాజు గర్వంతో  
ధగధగలాడే బంగారంతో తనపేరు శాశ్వతంగా.  
బంగారపు అక్షరాలతో ప్రకాశిస్తున్న ఆ పేరు  
ప్రజలు చూచి మెచ్చుకొన్నారు రాజుగారి గొప్పతనం.

హంసతూలికా తల్పంమీద హాయిగా పడుకొన్నాడు  
గర్వంతో సంతోషంతో కన్నుమూసుకొన్నాడు.  
కలలో ఒక దేవత కనిపించింది రాజుకు  
దివ్యమైన తేజస్సుతో దేదీప్యమానంగా.

మండపంలో చెక్కిన మహారాజు పేరు  
శాశ్వతంగా చెక్కిన స్వర్ణాక్షరాల పేరు  
క్షణంలో చెరిపివేసి స్పష్టంగా వ్రాసింది  
ఆచోటనే మరొకపేరు అందంగా దేవత.

అదిరిపడి లేచాడు రాజు. ఆశ్చర్యపడ్డాడు.  
మళ్ళీ నిద్ర పట్టింది; మళ్ళీ కల వచ్చింది.  
మూడుసార్లు కల వచ్చింది, మూడుసార్లు అదేకల.  
రాజుపేరు చెరిగిపోయి అచట రాణించిందొక స్త్రీపేరు.

" ఎవరి పేరిది ? ఎవరీ స్త్రీ ?  
వెతికి తీసుకురండి వేగంగా ఆమెను "  
ఆజ్ఞాపించాడు భటులకు ఆత్రంగా రాజు.  
వెతకగా దొరికింది వృద్ధురాలు ఒక అనాథ

బీదరాలు విధవరాలు బిక్కముఖంతో వచ్చింది  
భయంతో వణుకుతూ దర్బారులో నిలచింది.  
"నా ఆజ్ఞ మీరావు; నన్ను ధిక్కరించావు.  
ఏమంటావు? నిజం చెప్పు." —ఎగిరిపడ్డాడు రాజు.

" నిజం చెప్పక ఏంచేస్తాను? నిర్భాగ్యురాల్ని ప్రభూ  
ప్రభువుకు నే నేమి ఇవ్వగలను ?—పైసలేదు నాదగ్గర.  
ప్రేమించాను ప్రభువును మీ ప్రభువును నా ప్రభువును  
రాజాజ్ఞను మీరాను, రక్షించండి ప్రభూ.  
పైసా చేతలేనిదాన్ని ప్రార్థనే నా సొమ్ము  
మహారాజును దీవించాలని మహాదేవుని వేడాను.  
దేవళం కట్టడానికి రాళ్లు తీసుకుపోతున్న బండిని  
లాగే ఎద్దులకు అందించాను గుప్పెడు ఎండు గడ్డి.

"అదా సంగతి, అదా సంగతి?"-ఆశ్చర్యపోయాడు రాజు  
" ప్రతిష్ఠకోసం కీర్తికోసం ప్రాకులాడాను నేను.  
ఆదరణతో అర్పించావు అమాయకురాలివి నువ్వు  
అకళంక మైన భక్తి నీది; ఆడంబరమైన యుక్తి నాది.  
" ఆలయంలో చెక్కిన బంగారపు అక్షరాల పేరు  
చెరిపి వేయండి; ఆ చోట చెక్కించండి ఈమె పేరు  
బంగారంతో కాదు; వజ్రాలతో మణులతో.  
రత్నాలు కూడా సరిపోవు అనురాగానికి భక్తికీ."

గుడి గంటలు మోగాయి; గుడిలో దేవుడు మెచ్చాడు.  
గుడి కట్టించిందెవరో మళ్ళీ గుడి గంటలు చెప్పాయి. 

# పంచతంత్రము

కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి

## సోమిలకుని గుప్తధన కథ

ఒకానొకపట్టణమునందు 'సోమిలకుడు' అను సాలెవాడు ఉండెను. అతడు రాజోచితములైన అనేకవస్త్రములను నేయు చుండెను. ఇంత చేసికూడ ఆతనికి అన్నవస్త్రములకు సరిపోవుధనముమాత్రమే లభించు చుండెను. అంతకన్న ఎక్కువ దొరక కుండెను. ముతకబట్టలను నేయు సామాన్యులు మహాధనవంతులుగా నుండిరి. వారిని చూచి భార్యతో —

ముతకబట్టలు నేయువారు ఎంత ధనవంతులుగా నున్నారో చూడుము. నా కేమియు లేదు. కనుక ఈ నగరము విడిచి వేరు చోటికి పోయెదను అనెను.

'ధన మిక్కడ దొరకదు, వేరుచోట దొరుకును అనుట అసత్యము. ఇక్కడనే ధనసంపాదనకు ప్రయత్నించుము.' అని ఆమె యనెను.

'నీమాట సరి కాదు. ప్రయత్నము చేయక ధనము లభించదు. కనుక నేను దేశాంతరము పోయెదను.

అని నిశ్చయించి వర్ధమానపురమునకు పోయెను. అక్కడ మూడేండ్లు ఉండి మూడువందల బంగారునాణెములను సంపాదించుకొని తన యింటికి బయలుదేరెను. మార్గమధ్యములో ఒకఅడవిలో ప్రొద్దు గ్రుంకెను. క్రూరమృగ భయముచేత ఒకవటవృక్షముపైకి ఎక్కి నిద్రించెను. స్వప్నములో ఇద్దరు పురుషులు మాట్లాడుకొను చుండుటను ఇట్లు వినెను —

" కర్తా ! ఈ సోమిలకునిభాగ్యములో అన్నవస్త్రములకన్న మించినధనము లే దని నీకు తెలియదా! ఎందుకు మూడు వందల బంగరునాణెముల నిచ్చితివి ? "

' కర్మా ! శ్రమపడి పని చేయువారికి ఇవ్వవలసినబాధ్యత నాపైన ఉన్నది. కాని దానిపరిణామము మాత్రము నీయధీనము "

సాలెవాడు మేలుకొని చూచుసరికి ముల్లెలో ధనము కనపడలేదు. అది చూచి, " ఎంతోకష్టపడి సంపాదించినధనము అవలీలగా మాయమయ్యెనే! ఇంత కాలము వ్యర్థముగా పరిశ్రమ చేసికూడ దరిద్రుడనుగా, భార్యకు బంధువులకు నాముఖ మెట్లు చూపుదును ?" అని చింతించెను. మరల ఆ పట్టణమునకే పోయెను. ఒక సంవత్సరములోనే అయిదువందల బంగారు నాణెములను సంపాదించెను. స్వగృహమునకు బయలుదేరెను. మార్గమధ్యములో ఆ మఱ్ఱిచెట్టువద్దనే ప్రొద్దు గ్రుంకెను. ధననాశ భయముచేత అక్కడ ఆగక ఆరాత్రియే త్వరత్వరగా నడుచుచు పోయెను. దారిలో ఆ యిద్దరు పురుషులే యెదురై పూర్వమువలెనే మాట్లాడుకొను చుండుటను వినెను

ఆ మాటలు విని సోమిలకుడు తన మూటను విప్పి చూచుకొనెను. సువర్ణ మందులో లేదు మిక్కిలి దుఃఖపడి ఆహా! ధనము లేని నాజీవిత మేల ? ఈ వటవృక్షమునకు ఉరిపోసికొని చచ్చెదను '' అని నిశ్చయించుకొని గడ్డితో త్రాడు పేని తన కంఠమునకు ఉరి వేసికొని, ఆ చెట్టు కొమ్మకు కట్టి వ్రేలాడబోవు చుండగా ఆకాశమునుండి ' ఓయీ! సోమిలకా! ఇట్లు సాహసము చేయకుము. నేను నీధనమును అపహరించితిని. నీకు అన్నవస్త్రములకు సరిపడు ధనముకన్న అధికము లభించదు. నేను ఒక గవ్వకూడ ఎక్కువ నీ కీయను. కాని, నాదర్శనము నీకు వ్యర్థము కాకూడదు. ఏదైన వరము కోరుకొనుము. ఇచ్చెదను '' అని వినపడెను. మాటలు విని సోమిలకుడు 'అట్లైనచో, నాకు అధికధనమును ఇమ్ము' అని కోరెను 'ఓయీ ! సుఖానుభవమునకు పనికిరానిధనముతో నీ వేమి చేసెదవు ?అన్నవస్త్రములకన్న అధిక ధనము పొందుటకుగూడ నీనొసట వ్రాయబడ లేదు. '' అని అతడనెను. దానికి సోమిలకుడు, అనుభవము లేకున్నను అది నాకు ఉండ నిమ్ము ఇందుకొక కథచెప్పెదను వినుము '' అని యిట్లు ఆ కథ చెప్ప దొడగెను —

ఒకనగరమునందు ' తీక్ష్ణవిషాణము ' (వాడియైన కొమ్ములు గలది) అనునొక వృషభము ఉండెను. అది మదించి తన మందలను వాడి కొమ్ములతో నదీతీరములను పెళ్లగించుచు స్వేచ్ఛగా లేతగడ్డి మేయుచు అడవిలో తిరుగుచుండెను. ఆ వనములోనే 'ప్రలోభకుడు' అనునొకనక్క తిరుగుచుండెను. అది యొకప్పుడు తనభార్యతో నదీతీరమునందు కూర్చొని యుండెను. అక్కడికే జలపానార్థమై ఆ యెద్దు వచ్చెను. వ్రేలాడుచున్న దాని వృషణములను చూచి ఆడునక్క భర్తతో నిట్లనెను. చూడుము ఆ వృషభమునకు వ్రేలాడుచున్న మాంసపిండములను, యెప్పుడో ఊడి పడును. మనకు మంచి ఆహారము లభించును కనుక ఈయెద్దువెంటనే పోయి మాంస పిండలములు రాలి పడినవెంటనే తీసికొందము.'

''అవి క్రింద పడునో లేదో తెలియదు. ఎందుకు వ్యర్థముగా శ్రమపడ వలెను. ఇక్కడనే ఉండి. ఎలుకలను పట్టి భక్షింతము. ఈయెద్దువెంటపడి పోయినచో, మరి యెవరైన ఇక్కడికివచ్చి మనస్థానమును ఆక్రమించుకొన్నచో ఇదికూడ మనకు దక్కదు.'' అని మగనక్క అనెను.

''ఎంత అల్పుడవు నీవు? దొరకినవస్తువుతోనే తృప్తిపడ దలచు చున్నావు. పురుష డెప్పుడుగూడ ఉత్సాహవంతుడుగా నుండ వలెను. ఈ మాంసపిండములు క్రిందపడునో లేదోయని నీవు సంశయించు చున్నావు. అది కూడదు. ప్రయత్నించిన లభించును. సర్వదా మూషికమాంసమును తిని నాకు వెగటు కలిగినది ఈ మాంసపిండములు వీక్షణములోనో పడునట్లున్నవి. కనుక వీటిని తప్పక సంపాదించ వలెను.'' అని ఆడునక్క అనెను

భార్యమాటలను మీరలేక మగనక్క భార్యతో ఆ యెద్దు వెంటబడి పదునైదు సంవత్సరములు తిరిగెను. కాని యెద్దు వృషణములు క్రింద పడలేదు. అప్పుడు నక్క నిరాశ చెంది భార్యతో స్వస్థానమునకు పోయెను.

కనుక తనకు అనుభవము లేకున్నను తనకడ ధన మున్నచో నలుగురు తనచుట్టు, నక్కలు ఎద్దును ఆశ్రయించినటు, చేరు దురు. అని సోమిలకుడు ఆపురుషునితో చెప్పెను. ఆ మాట విని ఆ పురుషుడు తిరిగి నీవు వర్ధమానపురమునకే పొమ్ము. అక్కడ గుప్తధనుడు, ఉపభుక్తధనుడు అని యిరువురు వణిక్పుత్రు లున్నారు వారిలో నొకరిని కోరుకొనుము. నీవుకోరిన ప్రకారమే 'గుప్తధనుడు' (దాచిన ధనము గలవాడు) గానో ఉపభుక్తధనుడు (అనుభవించు ధనము కలవాడు) గానో నిన్ను చేసెదను'' అని చెప్పి అంతర్ధానము చెందెను.

సోమిలకుడు వర్ధమానపురమునకు పోయి తొలుత గుప్త ధనునియింటికి పోయెను. అతడు ఇంటిలోనికి రానీయక తిట్టి తరిమి వేసెను. కాని, సోమిలకుడు అక్కడనే పడియుండెను. గుప్తధనుడు నిరాదరముతో విసుగుచు సోమిలకునకు కొంచెము అన్నము పెట్టెను. సోమిలకుడు తిని అక్కడనే శయనించెను. రాత్రి ఆ పురుష లిరువురు మరల వచ్చి, యిట్లు ప్రసంగించుకొనిరి--

''కర్మా! గుప్తధనుడు సోమిలకునకు అన్నము పెట్టెను. అతనికి అధిక వ్యయము కల్పించితివి. ఇది యుక్తమా?''

''కర్మా! ఇందు నాదోష మేమియు లేదు. నేను పురుషునికి లాభనష్టములు కలిగించ వలెను. దానిఫలము నీయధీనము.''

సోమిలకుడు తెల్లవార లేచిచూచునరికి గుప్తధనుడు 'విషూచి (కలరా) జబ్బుతో బాధపడుచుండెను. ఆదోషముచేత మరునాడు భోజనము చేయలేదు. ఆ ఉదయమే సోమిలకుడు ఉపభుక్తధనుని యింటికిపోయెను. అతడతనిని ఎదుర్కొని ఆహ్వానించి ఆదర పూర్వకముగ ఇష్టాహారములతో తృప్తిపరచి సుఖశయనమునందు నిద్రింపజేసెను. ఆరాత్రి తిరిగి ఆపురుషులువచ్చి యిట్లుమాట్లాడు కొనిరి--

''కర్మా! సోమిలకునకు ఉపకారము చేయదలచిన యితడు అధికధనమును వ్యయముచేసెను. ఇది యంతయు ఋణము తెచ్చి చేసెను. అది తీరుట యెట్లు?''

''కర్మా! ఇది నా విధి. దీని పరిణామము నీవు చూచుకొన వలెను''

ఆ ప్రాతఃకాలమునందే రాజభటుడొకడు రాజ భవనము నుండి ధనముతెచ్చి ఉపభుక్తధనునకిచ్చెను. అదిచూచి సోమి లకుడు ''ధనసంశయము లేకున్నను ఉపభుక్తధనుడు, లోభియైన గుప్తధనునికన్న మేలు.'' అని తలచెను.

కనుక హిరణ్యకా! ధన విషయమై నీవు పరితాపము చెంద కుము. అనుభవించని ధనమును లేని దానినిగానే భావించవలెను. ఈ సత్యము నెరిగియే సోమిలకుడు దత్త భుక్తధనుడయ్యెను. హిరణ్యకా! ఈ సంగతి తెలిసికొని నీవు నిలువచేయుటకు ధన మును సంపాదించగూడదు. అది దుఃఖమునే కలిగించును.'' అని మంథరకుడు చెప్పిన మాటలు విని లఘుపతనకము హిరణ్యకునితో "మంథరకుడు చెప్పినట్లు నీవు ధననాశమునకు చింతించకుము," అని చెప్పెను

(సశేషము)

---

## సమాచార శాఖ ప్రచురణల మీద ప్రఖ్యాత రచయిత వ్యాఖ్య

నేడు పెద్దపుస్తకాలని చదివే వోపికా లేదు. తీరికా లేదు. అందుకే వీరు చిన్నిపుస్తకాలను వ్రాస్తారు. ఏచిన్ని పొత్తమూ నలభై పుటలు మించదు. బస్సుస్టాండ్‌లో క్యూలో నిలబడ్డప్పుడు, చదవేటందుకు అనువైన చిన్ని కరపత్రంలో వారు చెప్పదల్చిం దంతా చెప్పివెయ్యగల సంక్షిప్త శక్తులు ఎరిలో వున్నాయి. మరొక విశేషం.........మన గ్రంథకర్తల గ్రంథాలలో మెచ్చు కోతగ్గ విషయం వొక్క అచ్చుతప్పుకూడా దొర్లక పోవడం. మరొకటి--వీరిది అద్భుతమైన శైలి, ఉద్రేకం, ఉద్వేగం, భావనాపటిమ, ఈశైలి ప్రధాన లక్షణాలు......ఇది సాహిత్యం కాదని ఎల్లా అనుకోను? .........అక్కడక్కడ జాతీయాలు, సామెతలు కనబడతాయి,.......ఆంధ్రప్రదేశ్ సమాచార పౌర సంబంధశాఖ ప్రచురించే ఈ గ్రంథాలలో చక్కటి చిత్రాలుంటాయి. 'అ విద్యపై యుద్ధం' అన్న పుస్తకంపై వున్న చిత్రం ప్రశంస నీయమైంది. అవిద్యని సూచిస్తూ మూడువ్రేలు ముద్రలు, దాని నిర్మూలనకు అవసరమైన పరికరాలు.........ఈ వ్రేలు ముద్రల చుట్టూ చిత్రించబడ్డాయి. గొప్పభావం, గొప్ప చిత్రం.......

'యువ'లో బుచ్చిబాబు

కవిత:

# వికసించే కాలం

డా॥ సి. నారాయణరెడ్డి

రెక్కవిప్పుతున్న వర్తమానక్షణాలెన్నో లెక్కించు.
ముక్కిపోయిన భూతకాలక్షణాలెన్నో లెక్కించు.
రేకులువిప్పని రేపటిక్షణాలెన్నో లెక్కించు.
ఈ క్షణాలన్నీ లెక్కించి లెక్కించి
ఏదో ఒక కొలిక్కి రప్పించు.
అప్పుడు తర్కం ఎదురుతగులుతుంది.
ఆ లెక్కమాత్రం అలాగే మిగులుతుంది

అవిచ్ఛిన్న కాలప్రవాహంలో
అల్పబిందువే నీకందేది.
ఇంతకూ నీకు తెలుసా కాలం
ఎన్ని రకాలుగా రూపొందేది ?
రేఖలతో, విచిత్రాకృతులతో
వలయాలతో, పుక్కిటదాచిన విలయాలతో
అచలంగా, అంతలోనే ప్రచలంగా
ఒకప్పుడు శూన్యంగా,
ఒకప్పుడు కైవల్యానికి మూర్ధన్యంగా—
ఎంతెంత అగాధమైనది
ఈ అనంత చైతన్య మహానది.

వర్తమాన యవనికపై గతం
వార్ధక్యంలా వెలవెల బోయింది.
భవ్యదృష్టితో, నవ్యసృష్టితో
భవితవ్యం బారసాచివస్తుంది.

కరిగిపోయిన గతకాలం
విరిసికొంటున్న వర్తమానం
బ్రతుకు బ్యాంక్‌లో డిపాజిటు కాగా
వడ్డీరూపంలో చిగుళ్లువేయగా
భవిష్యత్తు రూపొందుతుంది.
ప్రతిక్షణాన్ని భద్రంగా దాచుకుంటే
ప్రతిఫలం ప్రవర్ధిల్లుతుంది.

ఇదిగో సారమున్న ధారుణి
వెదజల్లవోయి ఏడికెడన్ని విత్తనాలు
ఎదిగివస్తాయి బండెడన్ని ధాన్యాలు.
ఏమి వికాసం? ఏమి వికాసం?
కణంలోనుంచికణం, క్షణంలోనుంచి క్షణం
కరల్తెత్తే వెల్లువలాంటి చైతన్య గుణం.
మెత్తని వెలుగుతో ఉషస్సు ఉబికివస్తుంది.
విత్తనాలు నాటిన కృషీవలునికి
కొత్తపంట చేతికొస్తుంది.

కణం కణం, క్షణం క్షణం
సూర్యేందు తారా గణం
సుందరవసుంధరా గోళం
సృష్టిలోని జీవజాలం
అఖిలం వికాసరమ్యం
అన్నిటికీ పూర్ణత్వమే గమ్యం
నిన్నటిక్షణం కలలు కన్నది
నేడుగా కుట్మలించాలని.
పచ్చిమొగ్గ కోరుకుంటున్నది
విచ్చిన పువ్వుగా పరిమళించాలని.

ఆత్మ వికసిస్తుంది.
అమృత మార్దవం విలసిస్తుంది.
నేల వికసిస్తుంది నింగి వికసిస్తుంది.
నీలో నాలో, కణకణంలో క్షణ క్షణంలో
కావాలి వికాసం, రావాలి వికాసం
చిత్ర చిత్ర వికాసం, చిద్రూప దరహాసం.
వెదుళ్లు విరబూసినట్లు
కదళీ వనాలు కలకల నవ్వేసినట్లు
వికాసం, వికాసం
విశ్వమంతటా వికాసం.

—వేణీభాయ్ పురోహిత్
గుజరాతీ గీతానికి అనుసరణం.

# ఈ చిహ్నం ఏమిటో?



ఈ చిహ్నం ముద్రించబడిన వస్తు సామగ్రులు లభించిన పక్షాన్ని,
రూఢిగా నమ్మదగ్గ విషయాలు ఏమన:

- ఈ వస్తు సామగ్రులు భారతీయ మానక్ సంస్థ వారి పరీక్షకు లోనై, ఉత్తీర్ణత పొందినవనియూ,
- వాటి నాణ్యతకు భారతీయ మానక్ సంస్థ వారు హామీ ఇస్తున్నారనియూ,
- వాటి నాణ్యతలో ఒకవేళ లోటుపాటు కనిపిస్తే వాటిని బదిలీపరిపించి మంచి సామగ్రి భారతీయ మానక్ సంస్థ వారు ఇప్పించగలరనియూ.

## కాబట్టి మీ కర్తవ్యం ఏమనగా:

- ఈ ISI ముద్రగల వస్తు సామగ్రినే కొనుటయూ, కోరుటయూ,
- ఈ ISI చిహ్నం లేని వస్తు సామగ్రి భారతీయ మానక్ సంస్థ వారి ప్రమాణ ముద్రణకు చెందలేవని భావించుటయూ,
- ఈ ISI ముద్రగల సామగ్రిలో ఏ లోపము గోచరించినా, ఈ దిగువ వివరించిన చిరునామాలలో ఏదో ఒకదానికి ఆ విషయం తెలియజేయు బాధ్యతయూ.

ఈ విధంగా మీరు తమంతట తాము సహాయం పొందడమే కాక, ఇతరులకుకూడ సహాయకారులవుతారు.

**ISI భారతీయ మానక్ సంస్థ INDIAN STANDARDS INSTITUTION**

మానక్ భవన్, 9 బహాదూర్ షా జాఫర్ మార్గ్, న్యూఢిల్లీ-1

బొంబే మ్యూచ్యువల్ టెర్రేస్, సాండ్‌హర్ట్స బ్రిడ్జి. బొంబాయి-7

117/418 బి, సర్వోదయ నగర్, కాన్పూర్

5 చౌరంగీ అప్రోచ్, కలకత్తా-13

54, జనరల్ పటర్స్ రోడ్, మద్రాసు-2

అమ్మమ్మగారి దాతృత్వాన్ని అడుగడుగునా చాటిచెప్పే

# కన్నాపురం - పేరువిన్నారా?

వినలేదని అంతఖచ్చితంగా చెప్పకండి మరి! మొన్న మొన్నటివరకూ నేనూ వినలేదనుకోండి—మీకు జ్ఞాపకముందా—రెండు నెలలక్రితం "ఆంధ్రప్రదేశ్" మధ్యపేజీలలో, ఒక బంగారు జడ ఫోటోగ్రాఫూ, దాని ప్రక్కన ఒక వయసు మళ్లిన స్త్రీ ఫోటోగ్రాఫూ వేశారు. వాటి క్రింద వ్రాశారు "పశ్చిమ గోదావరి జిల్లా కన్నాపురం వాస్తవ్యులు శ్రీమతి కానుమిల్లి వెంకటనరసమ్మ గారు, భద్రాచలం దేవాలయంలోని సీతాదేవికి కానుకగా యిచ్చిన "50 కాసుల బంగారు జడ". నిజం చెప్పొద్దూ—సీతాదేవి అంటే మహా అసూయకలిగింది. అడగాపెట్టని సీతాదేవికి అరణంగా ఆభరణాలిచ్చే ఈ మహాతల్లి ఎవరని తెలుసుకోవాలని కుతూహలం కూడా చాలాకలిగింది.

ఆమెను చూడాలని నాకు కోరిక కల్గిన కొద్దికాలనికే అయాచితంగా ఆ ఊరు వెళ్ళే అవకాశం కూడా కల్గింది. ఏలూరు నుండి పోలవరం (రెడ్డిపోలవరం-వరదల పోలవరం—ఏజన్సీ పోలవరం—ఇన్ని నామంతరాలుగలిగిన గోదావరి ఒడ్డున ఉన్న పోలవరం) వెళ్లే రాస్తా మీద, ఏలూరుకు 43 మైళ్ల దూరంలో రోడ్డు కిరుప్రక్కలా నిశ్శబ్దంగా, నిద్రపోతూ కన్పించే ఊరు కన్నాపురం.

బస్సుదిగి నాలుగు ప్రక్కలా కలయజూచాను. ఒక ప్రక్క పూర్వపద్ధతుల్లో కట్టిన పెంకుటిళ్లూ—మరోవైపు వెదురుదడులూ, తాటాకు కప్పిన పూరిళ్లూ—దూరపు పొలాలనుండి, కావిళ్లకు ఖాళీ ఉన్నపు గిన్నెలు తగిలించుకొని ఇండ్లకు చేరుతూన్న పాలేళ్లూ—ఇంతకు తప్పిస్తే ఎక్కడ ఏమీ సందడి లేదు. పదడుగులు ముందుకు వేసి ఆమెగారిల్లు ఎక్కడ అని ఎవర్ని అడుగుదామా అని తటపటాయిస్తూ తల ఎత్తి చూచాను. రోడ్డు ప్రక్కనే పెద్ద ఆర్చి— "కానుమిల్లి వెంకట నరసమ్మ సర్వీసుహోం" అని దానిమీద వ్రాసి ఉంది. ఇంత చిన్న గ్రామంలో సర్వీసుహోము ఏమిటి? అని చాలా ఆశ్చర్యపడి 'ఆహోము సంగతీ, సందర్భమూ కనుక్కోవచ్చు, ఆమె పరిచయమూ సంపాదించవచ్చు గదా అని'—ముందుకు నడిచాను.

రోడ్డుకి అరఫర్లాంగుదూరంలో చిన్నకొండవాగు సాయంత్రపు నీరెండలో నొంపుగా ప్రవహిస్తోంది. చల్లని మెల్లని గాలికి వాగు ప్రక్కన ఉన్న వెదుళ్లు వయ్యారంగా ఊగుతున్నాయి. వెదుళ్ల ప్రక్కనే, ఎత్తుమీద పెద్ద పెంకుటి కట్టడాలఇళ్లూ, ముందుప్రక్క పిరిసిన గులాబీలతో, మందారాలతో,



చల్లనితల్లి శ్రీమతి కానుమిల్లి వెంకటనరసమ్మ

మాలతీలతో సమ్మోహనంగా రారమ్మని పిలుస్తూన్న తోట—ఎక్కడా మనుష్యసంచారం లేదు. గేటుగా కట్టిన వెదురు వాసాలను ప్రక్కకు తీసి తోటలో అడుగుపెడ్తూ ఉన్నాను. ఇంతలో సాయం సంధ్యలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ పన్నో స్త్రీ కంఠాలు.

"అసతోమా సద్గమయ<br>
తమసోమా జ్యోతిర్గమయ<br>
మృత్యోర్మా అమృతంగమయ<br>
ఓం శాంతిః; శాంతిః శాంతిః!

అని పలుకుతున్నాయి. ఆవెంటనే పసికంఠాలు

ఓం సహనా భవతు<br>
ఓం సహనౌ భునక్తు<br>
సహవీర్యం కరవావహై<br>
తేజస్వినా వధీతమస్తు<br>
ఓం శాంతిః శాంతిః శాంతిః!

అనివంత పలికాయి. ఎంత పవిత్రపు ఘడియలలో వచ్చానని పరమానందపడుతూ లోపలకు వెళ్లాను.

## ఆమె మీకు అమ్మమ్మగారా ?

ప్రార్థన ముగించుకొని కోలాహలంగా తిరుగుతున్నారు ఒక యాభై మందిస్త్రీలూ, ఓపాతికమంది పిల్లలూను అందులో యిద్దరు ముందుకువచ్చి నమస్కరించి కూచోబెట్టి మర్యాద చేసి, ఆహోము అధికారిని (సూపరింటెండెంటును) పిలుచుక వచ్చారు. ఆమె రాగానే అడిగాను. ''ఏమండీ! కానుమిల్లి వెంకటనరసమ్మగారు ఉన్నారా ?" అని.

"అమ్మమ్మగారు యిక్కడ లేరండి, ఇంటిదగ్గఱ ఉన్నారు" అంది ఆమె.

''మీకు అమ్మమ్మగారు అవుతారా ? ఆమె''?

''నవ్వుతూ అంది ఆమె. " నాకే ఏమిటండీ, ఇక్కడ ఉండే మా అందరికీ అమ్మమ్మగారే ఆమె, వారింటికి తీసుకు వెడతాను రండి.''



సర్వీసుహోమ్ గృహాలు

ఎల్లాగూ వచ్చాను, ఆమెగురించి పూర్తి వివరాలు తెలుసుకున్న తరువాతే ఆమెను కలుసుకుందామని, సూపరింటెండెంటుగారిని ప్రశ్నలు పరంపరగా అడగ్గా తెలిసిన విషయాలివి—

శ్రీమతి కానుమిల్లి వెంకట నరసమ్మగారి పుట్టినిల్లు ఈ గ్రామం. తండ్రి గెడా గెరటయ్యగారు, గొప్ప స్థితిమంతులు. చుట్టూవున్న ఎన్నో కోయ గ్రామాల్లోనే ఏమిటి, మొత్తం పోలవరం తాలూకాలోనే మన్నె సుల్తానుగా వ్యవహరించిన కమ్మ జమీందారు. వారికి పురుష సంతానం లేదు. వెంకట నరసమ్మగారి భర్త శ్రీ కానుమిల్లి జగ్గారాయుడు-బారిష్టరు, రాజమండ్రిలో ప్రాక్టీసూ - నివాసమూను.

వెంకట నరసమ్మగారికి 40 ఏళ్ల ప్రాయంలోనే ముందు తల్లీ వారి వెనుక తండ్రీ, ఆవెంటనే భర్త, చివరికి అక్క-



గిరిజన బాలుర హాస్టలు

గారు, అంతా కాలం చేయడంతో ఒంటరితనం, వల్లమాలిన ఆస్తీ, హస్తగతం అయ్యాయి.

తల్లిపోయిన వెంటనే వారి జ్ఞాపకార్థం భర్తగారి ప్రోత్సాహంతో ఆంధ్ర యూనివర్శిటీలో ఆడపిల్లలకు స్కాలరుషిప్పుకుగాను రు. 18,000/- విరాళ మివ్వడము వీరి దాన కార్యములలో ప్రప్రథమము.

కన్నాపురంచుట్టూ గ్రామాలన్నీ నిన్న మొన్నటి వరకూ పూర్తిగా మన్యప్రాంతం. విద్యకూ, విజ్ఞానానికి దూరంగా ఆటవిక జీవితం గడిపే కోయప్రజ. అక్కడే పుట్టి, పెరగడం, పూర్వమునుండి తనతండ్రి నాశ్రయించి బ్రతికినవారంతా మన్య ప్రజలే కావడంతో వెంకట నరసమ్మగారికి వారంటే ప్రత్యేకాభిమానం, శ్రద్ధ!

1955 సం॥ర ప్రాంతంలో ప్రభుత్వం స్త్రీ సంక్షేమశాఖ పరంగా మన్యస్త్రీల సంక్షేమంకొరకు ఒక కేంద్రాన్ని కన్నాపురం సమీపంలో ఏర్పాటుచేసే ప్రయత్నంలో ఉన్నప్పుడు, పట్టుదలగా, అమ్మమ్మగారు ఆ కేంద్రాన్ని కన్నాపురంలోనే స్థాపింపజేశారు. ఆనాటినుండి ఈనాటివరకూ, ఆకేంద్రం



హోములో సాయంత్రం



సర్వీసుహోములో ఉదయపు అసెంబ్లీ

చుట్టూ గ్రామాల కోయస్త్రీలకు విజ్ఞాన వికాసాల నంద జేయడమే గాకుండా, మందూ, మాకూ, మంత్రసాని సౌకర్యమూ అందజేస్తోంది.

1958 సం॥లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనాథస్త్రీలకు సేవాసదనాలు స్థాపించబోతోందని తెలుసుకొని, ఎవరూ అడగా పెట్టకుండా తన గ్రామంలో మన్యస్త్రీల సంక్షేమానికి సేవాసదనమును స్థాపించమని కోరుతూ, 5 ఎకరముల మాగాణి, 8 ఎకరముల మెరకపొల్పాని వెంటనే దానపట్టా వ్రాసి ప్రభుత్వమునకు అంకితం చేశారు. ఇది ఆధారంగా స్త్రీ సంక్షేమశాఖ ప్రారంభించిన సేవాసదనమే ఈనాటి కానుమిల్లి వెంకటనరసమ్మ సర్వీసుహోం. అజ్ఞానంలో, అంధకారంలో కొట్టుమిట్టాడుతున్న కొండజాతి స్త్రీలకూ, అభాగ్యులూ, అనాథలూ అయిన ఇతరవర్గాల స్త్రీల జీవితాలలో నిలిచి వెలిగే జ్యోతి.

ఇప్పటికీ ఈ హోమునుండి 125 మంది స్త్రీలు విద్య నేర్చికొని, వృత్తి విద్యలలో ఆరితేరి, స్వయం పోషకత్వాన్ని



పఠన మందిరము

సంపాదించుకొని, అమ్మన్నగారి పేరుచెప్పుకొని రాష్ట్రంలో ఆ మూలమూలలా స్వతంత్రులుగా జీవిస్తున్నారు. ఈ సేవా సదనం స్థాపించడానికి ఆదిలో ఇచ్చిన భూదానమేగాక, సదనానికి అనుబంధముగా, అనాథ బాలబాలికల కొరకు, సదనములోని ప్రయోజన స్త్రీలకుగాను మెట్రిక్ తరగతులకూ, భవనముల నిర్మాణం నిమిత్తం వ్యయం రు. 32,000 అమ్మమ్మ గారి చల్లని చేతినుండి వచ్చినవే.

మన రాష్ట్రంలో సాంఘిక సంక్షేమశాఖ వెనుకబడిన వర్గాల బాలబాలికలకు స్థాపించిన వసతి గృహాలెన్నో ఉన్నాయి గాని కన్నాపురంలోలాటి గిరిజన బాలబాలికలకు వసతిగృహ మెక్కడా లేదు. అమ్మమ్మగారిచ్చిన రు 15,000 లకు మరంత ప్రభుత్వపుసొమ్ము కలిపి ఊరికు దూరంగా చక్కని ప్రశాంత వాతావరణంలో చూడ ముచ్చటగా ఉంది గిరిజన బాలల హాస్టలు.



తోటపనిలో నిమగ్నులైన హోముస్త్రీలు

కేవలం కన్నాపురంలో ఎటుచూచినా అమ్మమ్మగారి దాతృత్వ చిహ్నాలే! కమ్యూనిటి హాలు, గ్రంథాలయం, పాఠశాల ఒకటేమిటి గ్రామంయొక్క సమిష్టి ప్రయోజనాల కుపకరించే సంస్థలకన్నింకీ మూలాధారం ఆమే.



కొండవాగునుండి నీరుతెస్తున్న హోముస్త్రీలు

అయితే అమ్మమ్మగారు చేసిన మంచి కార్యాలన్నీ తమ స్వగ్రామానికే పరిమితమా? అని కొంచం సంకోచిస్తూనే అడిగాను, సూపరింటెండెంటుగారిని. మద్రాసులోని కేసరి హైస్కూలుతో మొదలుపెట్టి, ఆంధ్రా యూనివర్శిటీ, కాకినాడ రంగరాయ మెడికలు కాలేజీ, రాజమండ్రి గౌతమీ జీవకారుణ్య సంఘం; కొవ్వూరు, ఏలూరు పట్టణములలో సంస్కృత పాఠశాలలు, కాన్వెంటులు, త్యాగరాజగానసభలు, కొయ్యలగూడెం హైస్కూలు, హాస్పిటలు, తిరుపతి దేవస్థానంలో స్వామిపేరన గృహం; భద్రాచల రామాలయోద్ధరణ; సీతమ్మవారికి బంగారు జడలు; హృషీకేశంలో ఆంధ్రాశ్రమానికి సహాయం; స్వగ్రామంలో నిరుపేదలకు గృహనిర్మాణానికి స్థలాలూ - ఇలా గ్రుక్క త్రిప్పుకోకుండా చెప్పుకుపోతున్నారు సూపరింటెండెంటుగారు. అంటే అడగని దేవతలకూ; ఆశ్రయించిన మానవులకూ అందరికీ పెన్నిధి అమ్మమ్మగారు.

ఇంకవారిని కలిసేవరకూ మనసాగేదికాదు. కోటగోడల్లాంటి గుమ్మాలుదాటి లోపల ప్రవేశించగానే; మల్లెపువ్వుల్లాంటి తెల్లని వస్త్రాలతో, కాంతులీనే కళ్ళతో; ప్రసన్న వదనంతో రమ్మని ఆహ్వానించారు. అప్రయత్నంగా "నమస్కారమండీ, అమ్మమ్మగారూ" అన్నాను. ఆమె నాకుకూడ అమ్మమ్మే అయినట్లుగా. ఒకనాటి సౌందర్యపు ఛాయలు మాయని ఆమెమూర్తిలో, ఉనికిలో, మాటలో, తీరులో, సంస్కార ముట్టిపడుతూంది.

అమ్మమ్మగారిలాంటి సంపన్నులు మనసంఘంలో చాలా మంది ఉన్నారు. కాని, సంపదతోపాటు సాధుత్వమూ, సంస్కారమూ; దాతృత్వమూ, వితరణలో విచక్షణ ఉన్నవారెంతమంది? గుప్తదానాలూ, యిచ్చి మర్చిపోయినవీ; ఇవన్నీపోగా ధనరూపంగా 4 లక్షల రూపాయలుకి పైగా విద్యా సంస్థలకూ, వైద్య సంస్థలకూ; దైవ కార్యాలకూ వినియోగించారు

"ప్రస్తుతం మన స్త్రీల వైద్య సౌకర్యం కొరకై హాస్పిటలు కట్టడానికి ప్రభుత్వం అంగీకరించు నట్లయితే కొంత భూవసతీ, రు. 10,000 ఇవ్వడానికి రెండేళ్ళ నుండీ సిద్ధంగా ఉన్నాను.అన్నారు అమ్మమ్మగారు. అమ్మమ్మ గారు చాలా పట్టుదల, వ్యవహార దక్షత గల వారు. తప్పక సాధించి తీరుతారు. సాధించడానికి వలసిన సమయమూ, సామర్థ్యమూ; ఆంధ్రుల అభిమాన దైవము భద్రాచల రామచంద్రమూర్తి, అమ్మమ్మగారిచే అల్లారుముద్దుగా బంగారు జడ వేయించుకొన్న సీతామహాదేవీ తప్పక ఆమెకు ప్రసాదిస్తారు!


అతి స్వల్ప వ్యయంతో ఎక్కువకాలం
మన్నగల ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన

27 H. P. ఎయిర్ కూల్డ్
డీసెల్ ట్రాక్టర్




భారతదేశపు మొదటి ట్రాక్టర్ ఫ్యాక్టరీ!
పశ్చిమ జర్మనీ—భారతదేశం—
హకారోత్పత్తి !!

వ్యవసాయదారుల అధికోత్పత్తికి గొప్ప సదవకాశం!
ఈ రోజునసే వివరములకు వ్రాయండి
ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు:

రమణా కార్పొరేషన్

ఫోన్: 37719 3-5-926/19, హిమాయత్‌నగర్, హైదరాబాద్-29 గ్రామ్స్: TRACTORS

# సాహిత్యానికి అవధులు లేవు

'ఇంద్రకంటి'

> నిత్యపల్లవశీలమైన సాహిత్యాన్ని మోడు కానివ్వకు... బెదురుగా, బెరుకుగా చూడక ఎంత దూరపు సారస్వతాన్నైనా ఆచమించి ఆస్వాదించు.

రోడ్డువెంట తల వంచుకు వెడుతున్నాను. ఒక డాబా యింటి వీధి గదిలోంచి ఈ మాటలు వినబడుతున్నాయి—

Let the long contention cease !
Geese are swans and swans are geese
Let them have it how they will !
thou art tired, best be still !

పదిహేనేళ్ల మార్చి పరీక్ష కుర్రాడు ఒక్కొక్క ముక్కే నాల్గుసార్లు ఉచ్చరిస్తున్నాడు.

ఆ మాటలు నా మనస్సు నెందుకో గుంజుతున్నాయి.

ఏమిటీ!

"ఈ చిరసంఘర్షణ ఇక ఆపు. బాతులు హంసల కిందా హంసలు బాతులకిందా చెలామణీకానీ అననీ ఈ లోకం ఇష్ట మొచ్చినట్టూ; నువ్వలసిపోయావు; ఇక ఊరుకో"

ఈ మాటలు ఎంతపుందిని అంతర్ముఖుల్ని చేస్తాయో చెప్పలేనుగాని--ఒకతరం మనుష్యుల్ని పట్టి ఆపుతాయి. ఊపుతాయంటే అతిశయోక్తి అనకు.

వెనకటికి ఆచార్యశంకరులు కాశీలో ఒక తెల్లవారు జామున గంగానదికి వెడుతూ వ్యాకరణ విద్యార్థి ఒకడు "డుకృఞ్ కరణే" అనే ధాత్వర్థం వల్లించడంచూచి గాఢంగా ఆలోచించి కృపాపూర్ణులై 'భజగోవింద' పరంపర పలికి పరికించి ఆ శాస్త్రారణ్య జంతువును ఉద్ధరించారట--

ఆర్నాల్డు మాటల మీదుగా ఆ విద్యార్థి నా ఆలోచనల్ని రేపి గురువయ్యాడు గాబోలు—

సాంఘికంగా సాహిత్యపరంగా ఏటి కెదురీది, ఆఘాతాలు తిన్న విప్లవకారులు జ్ఞాపకంవచ్చారు.

శ్రీ వీరేశలింగం. గిరాంమూర్తి. అప్పారావు ఎందరో మహానుభావులు......

నవకవులు, సభలు, ఖండనలు, ధిక్కారాలు. ధూళులు ......ఎన్నో......

చిత్రం! కొందరు పుట్టుకతోటే వరంగానో శాపంగానో విప్లవబుద్ధి తెచ్చుకుంటారు గాబోలు—

కొందరు "పాపాత్ముల్ని" అయినా ఈ విప్లవకణం అంటి రాజకపోతే సాంఘికంగా రాజకీయంగా సారస్వతికంగా ఒక్క అంగుళం వృద్ధీవెలుగూ లేక జాతిజాతంతా స్తబ్ధ అజగరంలా పడి ఉండేదేమో—

ఒక స్నేహితుడనేవాడు—"విప్లవమనేది లేనేలేదు. అభివృద్ధి మొదటి రూపమే దురంతవిప్లవంగా కనబడుతుంది అమాయకులకు.

1 తో ప్రారంభించిన అంకెలకు 9 దాకా విప్లవంలేదు. 10 అనగానే స్థానంమారి విప్లవం అనుకుని కొందరు భయపడతారు, కాని ఈమార్పు సహజం అనితెలిసి క్రమంగా స్తిమితపడతారు.

ఈ ఆత్మబలంతోనే యుగనిర్మాతలు అడ్డంవచ్చిన ప్రతి ప్రవాహాన్నీ ఈది కొండను బద్దలుకొట్టి దారిచేసుకు ముందుకు నడిచారు.

లేకపోతే—ఒకొక్క పాతవ్యవస్థ, ఒక్కొక పురాణ విశ్వాసం, ఎంతమంచిగా ప్రారంభమైనదైనాసరే క్రమంగా శిథిలమై విషమై ఈప్రపంచాన్ని ఎంతనాశనంచేసి ఉండేదో టెన్నిసన్ అన్నట్టు.

ఈమాట ఎవడు ముందంటే వాడు ప్రజాశత్రువు. తొలిదూషణాగ్నికి అతడు పూర్తిగాబలియై అతని ఉద్యమం ఫలిస్తే లాభం పంచుకోడానికి మనకేమి అభ్యంతరంలేదు.

సాహిత్యపరంగాచూడండి—

కొవ్వూరులో గిరాంమూర్తి, కాకినాడలో అప్పారావు అనుభవించిన సంఘటనలు వింటే మనస్సు కొట్టుకుంటుంది.

ఆరోజుల్లోమాత్రం వారికి ఎవరూ సాయంరాలేదు.

ఆర్నాల్డు పద్యం విన్నాక శ్రీ శ్రీగీతం జ్ఞాపకం ఒచ్చింది.—

అదృష్టవంతులు మీరు
వెలుగును ప్రేమిస్తారు
ఇరులను ద్వేషిస్తారు
... ...
అభాగ్యులం మేము
... ....
జీవితపు సన్నిని సందులకే

ఆకర్షణమాకు——

.... .... ...

అలజడి మాజీవితం

అర్నాల్డు మాటల్లోనూ శ్రీశ్రీ వచనంలోనూ కనపడ్డ దైన్యం నిజమనుకోకు. అదిఒకకెరటం, దానివెనకాల ఉన్న ఉజ్జ్వల సమరసన్నాహం గమనించు.

సంఘసంస్కర్తకూ, రాజకీయ వేత్తకులేని చురుకైన కన్నూ కరుకైన మాటాకల ఏనాటి కవీ నూరుదోషాలలోని ఒక సుగుణం, నూరు పుణ్యాలలోని ఒకఘోరం చెప్పడానికి భయ పడలేదు.

అయోధ్యలో కైకనూ, లంకలో విభీషణుణ్ణీ సృష్టించిన ఆదికవి ఎంత క్రాంతదర్శి! పంకకుల౧నుంచి పద్మంవంటి వసంత సేననుసృష్టించిన ఔదార్యం శూద్రక మహాకవికి గాక ఇంకెవరికి చెల్లింది ?

నిత్యపల్లవ శీలమైన సాహిత్యాన్ని మోడు కానివ్వకు. బెదురుగా బెరుకుగా చూడక ఎంత దూరపు సారస్వతాన్నైనా ఆచ మించి ఆస్వాదించు.

సాహిత్యానికి అవధులు లేవు.

అందిన సౌందర్య, సత్యాలను ఎలుగెత్తి చెప్పడానికే ఎక్కడి సాహిత్య హృదయమైనా కొట్టుకుంటుంది.

మన సాహిత్య గమనం ఎక్కడికి అంటావా ?

అన్యాయం తొలగేచోటికి
అభ్యుదయం వెలిగేచోటికి

ఆ కుర్రాడింకా వల్లిస్తున్నాడు.

"Charge once more- then be dumb".

---

## సివిలు ఇంజనీరింగులో ప్రతిభ చూపిన ఎలక్ట్రికల్ ఇంజనీరు

ఒక ఎలెక్ట్రికల్ ఇంజనీర్, సివిల్ ఇంజనీరింగ్ పనులకు ఉపయోగించే క్రొత్త విధానాన్ని కనుగొనడం అనేది చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. కాని, హైదరాబాద్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డులో డివిజనల్ ఇంజనీర్ శ్రీ అట్లూరి వెంకటేశ్వరరావు ఒక కొత్తరకం కాంక్రీట్ మిశ్రమాన్ని [ఆ ప్రోసిస్టంఫ్ ప్రిస్ట్రెస్డ్ కాంక్రీట్] ని కనుగొని రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో కేంద్ర పరిశ్రమల శాఖ అవార్డును గెలుపొందారు.

కృష్ణజిల్లా, వానపాముల గ్రామానికి చెందిన శ్రీ వెంక టేశ్వరరావు తీరిక సమయంలో ఏదో ఉబుసుపోకకు పనిచేసి ఈ కొత్త విధానాన్ని కనుగొని, కొత్త విషయాలను కను గొన్నందుకు పరిశ్రమలశాఖ ఇచ్చే ఈ అవార్డును సాధించారు.

కొత్త కొత్త దేశాలు చూడాలని, తక్కువ ఖర్చుతో చక్కని ఇళ్ళు నిర్మించాలని చిన్ననాటినుంచీ తాను కలలు కనేవాడిననీ, అక్కడివారి జీవిత విధానాలను గురించి పత్రి కలలో వ్యాసాలు వ్రాశానని 'ఆంధ్ర ప్రదేశ్' ప్రతినిధితో శ్రీ వెంకటేశ్వరరావు అన్నారు. ప్రిస్ట్రెస్డ్ కాంక్రీట్ అనే పుస్తకాన్ని రచించారు.

ప్రిస్ట్రెస్సింగ్‌లో ప్రస్తుతం వున్న రెండు విధానాలను ఏకంచేయడంతో ఆ రెంటిలోవున్న లోటుపాట్లను సరిదిద్ది ఒకే సరికొత్త ప్రయోజనకరమైన విధానాన్ని తాను రూపొందిచా నని ఆయన తెలిపారు. ఈ ప్రిస్ట్రెస్సింగ్‌కు వలసిన సాంకేతిక పరికరాలను, పరిజ్ఞానాన్ని ఇంతవరకు విదేశాలనుంచే దిగుమతి చేసుకుంటున్నాము. ఇందుకు ఎంతో విదేశ మారక ద్రవ్యం కూడా వ్యయమౌతున్నది.

ఈ క్రొత్త కాంక్రీట్ విధానాన్ని దేశీయ పరికరాలుంటే చాలు గనుక, సాంకేతిక పరికరాలను విదేశాలనుంచి తెప్పిం చుకునే శ్రమ వుండదు.

విద్యుచ్ఛక్తి స్తంభాలు, భవనాల పరికరాలు, రైల్వే స్లీపర్ల ఉత్పత్తికి ఈ విధానాన్ని భారీ యెత్తున అమలు జరిపితే ఉత్పత్తి వ్యయంకూడా చాలావరకు తగ్గుతుంది. ఈ క్రొత్త విధానాన్ని ప్రశంసించిన పెద్ద పెద్ద ఇంజనీర్లు సైతం ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

నూతనంగా కనుగొన్న ఈ విధానాన్ని రాష్ట్ర విద్యు చ్ఛక్తి బోర్డులో అమలు జరిపి సత్ఫలితాలు కూడా సాధించారు.

# మహారాష్ట్ర జానపద జీవితశోభ

భాషలు వేరైనా భావాలు ఒకటే. భావ ప్రకటనే కళ. జన్మాంతర తపస్సు కొందరికి ఫలిస్తుంది. వారు సిద్ధులౌతారు. కొందరికింకా ఫలించ వలసివుంటుంది. వారు సాధకులుగా జన్మిస్తూ వుంటారు. ఆ సాధనలో వారు మానవోత్తములు అవుతూ వుంటారు. మహా రాష్ట్రీల కళారాధన కూడా ఇలాటి పవిత్రతకు చెందినదే.

బొంబాయికి చెందిన "అల్పనా కళా కేంద్రం" వారు ఆంధ్ర రాష్ట్ర సమాచార పౌర సంబంధాల శాఖ ఆధ్వర్యమున ఆంధ్ర రాష్ట్రంలో నృత్య ప్రదర్శన లిచ్చారు. కేంద్ర ప్రభుత్వ విద్యా శాఖ నిర్వహించిన ఈ పథకంవల్ల ఒక రాష్ట్రపు కళాకారులు వారి కళా సంస్కృతులను మరొక రాష్ట్రంలో రంగస్థలంపై ప్రదర్శించి ప్రశంసలందు కొనుటకు, ఒక రాష్ట్రం మరో రాష్ట్రం కళా సంస్కృతులు అవగాహన చేసుకొనుటకు ఇలాటి కార్యక్రమాలు ఎంతగానో ఉపకరిస్తాయి. అంతే గాక దేశ కళల భావ ప్రకటనలో సంస్కృతీ, జాతీయత, సమైక్య దృక్పథం ప్రచారం కాగలదు.

మహారాష్ట్రకు చెందిన అల్పనా కళా కేంద్రం "వారు ఆంధ్ర రాష్ట్రంలో నిజామాబాదు, హైదరాబాదు, వరంగల్లు, ఖమ్మం, కృష్ణజిల్లా, మచిలీపట్నంలో ప్రదర్శనలు యిచ్చారు.

వారి ప్రదర్శనలు తిలకిస్తే మనకు కాన వచ్చేవి చాలా వున్నాయి. వారు ఆరాధించేది, పవిత్రంగా పూజించేది వారి జన్మ భూమిని. ఆ తరువాత దైవ ప్రార్థన. దైవారాధనలో నటరాజ, వినాయక, సరస్వతి ముఖ్య దైవాలు. ఈ ముగ్గురు మూర్తులను వెనుక కర్టనుపై అలంకరించారు.

మైక్‌లో మాట్లాడడం కూడా ఒక కళేనని వీరి ప్రదర్శనలలో ద్యోతకమౌతుంది. ప్రతి ప్రదర్శనకు ప్రారంభంలో ఆ ప్రదర్శన వివరాలను తెలియజేయడానికి సమాజ నిర్వాహకురాలు శ్రీమతి సుధా కర్మార్కర్ మైక్‌లో మాట్లాడిన తీరు, సొగసు, ఉచ్చారణలోని కంఠ మాధుర్యం ప్రదర్శనలకు ప్రత్యేక నిండుతనాన్ని సంతరించి పెట్టినది. రంగ స్థలంలో ఏ మూల మాట్లాడినా ఆశబ్దాన్ని, దాని స్థాయీభావాలను సమాన శబ్ద తరంగాలు థియేటరు నలు మూలలు వ్యాపించడానికి చేసిన మైకు ఏర్పాట్లు ఒక విశిష్టతను చేకూర్చాయి. విజయవాడ అసిస్టెంట్ రేడియో యింజనీరు వారితో సహకరించారు.

మహారాష్ట్ర నృత్య ప్రదర్శనలలో బలమైన భావాలు, శుద్ధమైన అనుభూతులు, సంవేదనాత్మకరమైన సంఘటనలు, భావ్యమైన వ్యక్తిత్వాలు, కమనీయమైన కల్పనలు, జవసత్వములు గల జీవితాలు, కదలికలలో చురుకు, నవ్వులలో నవరసాలు పొదిగిన రీతిలో అందరిని అన్ని విధముల ఆనందపరిచాయి. వారి నృత్యరీతుల కళా నిర్మాణంలో కృతి, వికృతి, ప్రతి కృతికి ప్రధాన స్థానముంది. ప్రతి భంగిమ ఒక ప్రక్రియ. అందులో చిత్త సంస్కారం అగపడుతుంది.

"మహా రాష్ట్ర గీత్" అనే ప్రదర్శన అందరిని అలరించినది. శుభోదయ సంగీతం కమనీయంగా వినిపిస్తుంది. పాటలో మహారాష్ట్ర పవిత్ర చరిత్ర, ఉన్నత ఔన్నత్య ఆదర్శములు, సాంస్కృతిక, సాంఘిక ఆచారములు, అమర జీవుల శౌర్య పరాక్రమాలు వివరించ బడ్డాయి.

---

విడియాల చంద్రశేఖరరావు

---

"భూపాలీ" ప్రదర్శన మహా రాష్ట్ర చరిత్రకు మచ్చుతునక. వారి సంస్కృతి, ఆచార వ్యవహారాలు కళ్ళకు గట్టినట్లు సహజంగా చిత్రించి ప్రదర్శించారు. గాయకుడు శుభోదయం వేళ మానవ ప్రపంచమును వారి దైనందిన జీవితాన్ని ప్రారంభించ మని హెచ్చరిస్తూ రాగాలాపన చేస్తారు. దైనందిన మానవ జీవితాలలోని విభిన్న సంఘటనలు కూడా యిలాగే ఆశా నిరాశల మధ్య ఊగిసలాడుతు ప్రకంపిస్తూ వుంటాయి. దేశాల చరిత్రలు వాటి వాటి సంస్కృతి కూడా తత్తత్కాల ప్రభావ ప్రభంజనాలకు పడుతూ లేస్తూ సంభ్రమాశ్చర్యాలను కొల్పుతుంటాయి. నదీనదాలలో క్రొత్త నీరు రావడం, కావిళ్లతో రైతులు నీరు నింపుకొని రావడం, అత్తకోడళ్ళ పిండి విసరడం, రొట్టెలు చేసి మగవారికి పెట్టడం. వాకిళ్లు ఊడ్వడం, ముగ్గులు వేయడం, శ్రోత్రియ బ్రహ్మణుడు నదీ స్నానమాచరించి భూమి మీద నీరు జల్లుకుంటూ దాని మీదనే ఒదిగి ఒదిగి నడవడం, ప్రకృతి మేలుకొని చెయ్యి జాపి తనతో పాటు లేవమని మానవుని తట్టినా—మానవుడు బద్ధకించి ఆవులిస్తూ మొద్దుబారి బద్దకంగా పడి దొర్లువారికి భూపాలీ హెచ్చరిక రాగాలాపన వినవస్తుంది. ప్రతి చరణం హాయిగా, ఆనందంగా, మనోజ్ఞకంగా రసానుభూతిని కల్పించింది.

వేరువ ఝామున పక్షుల కిలకిలా రావాలు, ఆవు దూడల అరుపులు, పాలుపితుకుతున్న సవ్వడి, గ్రామీణ వాతావరణం కళ్లకు కట్టినట్లు మహారాష్ట్రజానపదజీవిత శోభ అనందపర్చింది. 'వాసుదేవ్' ప్రదర్శనలో పూర్వం మహారాష్ట్రం ప్రజలలో సాంఘిక, నైతిక మార్పులు కలిగించుటకు ఇంటింట తిరుగాడుతూవుండే సాధువుల జీవితాలను యదాతథంగా చిత్రించే ఈనృత్యం భావగర్భితంగా వుంది. ఇప్పటికి ఈసాధువులు ఈవిధంగానే మహారాష్ట్ర ఆచార వ్యవహారాలను ప్రచారం చేస్తూ పాటలు పాడుతూ బిక్షాటన సాగిస్తుంటారు. వారు వాలు కన్నులతో, చిరునవ్వులతో వున్న శాంత మూర్తులుగా ప్రజల దర్శనమిచ్చి ప్రబోధాలు చేస్తూవుంటారు. దైవప్రార్థనలకు దేవాలయాలకన్న, శిల్పాలకన్న చిత్రాలను మక్కువతో అరాధిస్తారు. గోడలపైన, మిద్దెల పైనా దేవతల చిత్రాలను చిత్రించి 'చిత్రాలకథ' గా రూపొందించి గానం చేస్తారు. ఆధ్యాత్మిక చింతనలతో కూడిన భక్తితత్వాలతో ఒక ప్రత్యేకమైన శైలి, బాణీ మనకు వినవస్తుంది. ప్రతి గీతంలోను మహారాష్ట్ర ప్రజల హావభావాలు, కష్టసుఖాలు పొందుపరుస్తుంటారు. ఈ పాటలు కళాలక్ష్మికి అమూల్యాభరణాలు.

## "మరి ఆయీ"

"మరి ఆయీ" ప్రదర్శనలో భయానకం గోచరిస్తుంది. ఇందులో సుంకలమ్మ దేవతను పూజించే విధానం మహారాష్ట్రకు ప్రత్యేకంగా అనాదినుంచి ఈనాటి వరకు ఒకే రకంగా వస్తున్నది. ఈ ప్రదర్శనలో వాయిద్యాలు భయం పుట్టిస్తాయి. నవ్వులు, కేకలు, వీరవేశ నృత్య భంగిమలు, చరమ స్థాయినందుకునే నవ్వులు, మంత్రాలు, మోకుతో శరీరాన్ని బాదుకొనడం, దబ్బళంతో దండ చేతిని పొడుచుకొనడం, ఆ రక్తంతో సుంకలమ్మకు పూజలు చేయడం వంటి దృశ్యాలు మనోనిబ్బరం గల పెద్దలకే శరీరం గగుర్పాటు చెందిస్తాయి. ఈ ప్రదర్శన ఇంత భయానకంగా సాగినా చివరకు ఆపదలో వున్న వారు శాంతి సంతోషాలతో సుఖం పొందుతారనే నమ్మకం కలిగించక మానదు.

## "గోంధాళా"

నవరాత్రోత్సవ సమయాల్లోను, ఇతర రోజులలోను మహారాష్ట్రుల ఆరాధనా దైవం అంబా భవానిని పూజించే పూజారులను గోంధాళీలంటారు. అందులో పాడుతూ నిప్పులెత్తినట్లు నృత్యం చేస్తూ, ఆ గజ్జల సవ్వడుల ధ్వనులు పరిసర ప్రాంతాల నుంచి ప్రతిధ్వనించేలాగా తన్మయత్వం పొందిదేవిని ఆరాధించే ఈ ప్రదర్శనలో ప్రతి నిమిషంలో ఒక గంట కష్టం వుంటుందని ఊహించుకోవచ్చు. ఈ నృత్య విజయం సమిష్టి కృషిపై అధారపడివుంటుంది. అటువంటి కృషి ఈ నృత్య ప్రదర్శనలో అడుగడుగునా కానవచ్చింది.

## తమాషా

మహారాష్ట్రంలో జానపద పాటలు, పల్లె ఆటలు చాల ప్రాముఖ్యం వహిస్తాయి. ఈ ఉత్సవాలలో స్త్రీలకన్నా పురుషులే ఎక్కువ పాల్గొంటారు. ఈ ఆట పాటల నృత్యాలలో సంగీత వాద్య పరికరాలు తప్పనిసరిగా ఉపయోగిస్తారు. ముఖ్యంగా డోలక్, తుంతునా, జాంజీ, బుల్‌బుల్ మొదలైనవి ముఖ్యమైన సంగీత సాధనాలు. ఈ కార్యక్రమం విఘ్నేశ్వరి పూజతో ప్రారంభించబడుతుంది. తరువాత మధురలోని గొల్లభామలతో కొంటెకృష్ణుని చిలిపిచేష్టలను జ్ఞప్తికి తెచ్చే నృత్య విన్యాసాలు గుర్తుకువస్తాయి. ఈ ప్రదర్శన మహారాష్ట్రలో వాడుకలో వున్న 'లావిని' అనే నృత్యంతో ముగుస్తుంది.

'తమాషా' నృత్యాలలో పాల్గొనే గ్రామీణ స్త్రీల సౌందర్యాన్ని, భావ సౌకుమార్యాన్ని పాటలలోని భావాలు చాటుతాయి. ఈ నృత్యాలు గ్రామీణ జీవితకథలకు, తథాగతుని భావాలకు అనుగుణంగా చిత్రించబడినాయి. నృత్య భంగిమలో నర్తకిలు వయ్యారంగా, లలితంగా కనబడతారు. అందుకు కారణం కళలలోని వాస్తవికతకంటే వారు నమ్మిన సిద్ధాంతాల పట్ల, మన నేత్రం చూసిన దృశ్యం పట్లగల నర్తకిల నమ్మకమే కరణం కావచ్చునేమొ.

## "మంగళగౌరీ వ్రతం"

"మంగళగౌరీ వ్రతం" లో నవవధువులు రాత్రంతా గౌరిదేవిని పూజిస్తూ నృత్యములతో, పాటలతో, సంగీత రావాద్యములతో గడుపుతారు. ప్రతి పాట స్త్రీల నిత్య జీవితానికి ప్రతిబింబముగా అనిపిస్తుంది. మహారాష్ట్రలో మంగళగౌరీ వ్రతం పల్లెపల్లెను ఒక పాలవల్లిగా మారుస్తుంది. కట్టు, బొట్టు, జుట్టు, నడక ప్రతిదీ మహారాష్ట్ర సాంప్రదాయాన్ని ప్రతిబింబిస్తుంది.

ఈ ప్రదర్శనలో వెన్నెలరాత్రి ఆడపడుచులు ఆనందంగా ఆడుకునే ఆటలు, పాడే పాటలు, కోలాటాలు, ఒప్పుల గుప్పా ఆటను ప్రదర్శిస్తారు. ఆటలలోకూడా లయ రీతిని సృష్టించారు. వివిధ స్థాయిలలో గాత్రాలు, పాటలు చక్కటి వైవిధ్యాన్ని అందించాయి. అందుకు అనుగుణ్యంగా చిందు, భంగిమ, అభినయం, నయ, వినయం చక్కగా ప్రదర్శించారు.

నర్తకులందరు చలాకీగా బొంగరంవలె తిరుగుతూ ప్రేక్షకుల కళ్లను, చూపునూకూడా అలాగే తిప్పి తమ వశం చేసుకున్నారు.

## పవాడ

ఆంధ్రదేశంలో వాడుకలోను ప్రచారంలోనువున్న బుర్రకథలవలె మహారాష్ట్రంలో 'పవాడ' అనే పేరుతో

గానం చేస్తారు. ఇందులో గాయకుడు పూర్వపు వీరులను గురించి, వారి శౌర్యపరాక్రమాలను గురించి కథారూపంలో నవరసభరితంగా అభినయిస్తూ గానం చేస్తాడు. ఈ కార్యక్రమంలో మహారాష్ట్ర వీరుడైన ఛత్రపతి శివాజీ వీరత్వము పటుత్వంగా గానం చేయబడింది.

## కర్షక నృత్యం

గ్రామీణ రైతులు పొలాలలో పగలంతా యంత్రం లాగా పనిచేసి అలసి సొలసి యింటికి తిరిగి రాగానే చిరునవ్వులతో పాపలు, మందహాసాన్ని చిందిస్తూ మగువలు వారిని ఆహ్వానిస్తారు. కర్షకులు తమ శ్రమను మరచి ఆనందంతో హృదయాలను నింపుకుని వినోదంగా నృత్యాలు ప్రారంభిస్తారు. భార్యలు పాటలు పాడుతూవుంటే భర్తలు నృత్యం చేస్తుంటారు. వారి అడుగుల సవ్వడిలో భార్యల అడుగులు కూడా కలిపి నృత్యం ప్రారంభిస్తారు. మధ్యమధ్యన పాటలు ఆపి రాగాలాపనచేస్తూ వింతవింత శబ్దాలను సృష్టిస్తూ చంకలు ఎగరవేస్తూ, ఈలలువేస్తూ, చప్పట్లు చరుస్తూ మైమరచిపోతారు. వెన్నెల రాత్రులు మరీ ఆనందాన్ని చేకూరుస్తాయి. వెన్నెల కొబ్బరిచెట్లుపై పడి మెరుస్తున్నట్లు, వాటినీడ నర్తకుల ముఖాలపై పడినట్లు భ్రమను కల్పించే లైటింగు ఏర్పాట్లు ఈ కర్షకనృత్యంలో ప్రత్యేకత.

## బెస్తవారి నృత్యం

మత్స్య పారిశ్రామికులు చేపలవేటకు బయలుదేరే ముందు గంగాదేవిని పూజిస్తారు. ఈ నృత్యం పెండ్లి ఊరేగింపుతో తారస్థాయిని అందుకుంటుంది. ఈ నృత్యంలో జాలరుల సాంప్రదాయాలకు అనుగుణ్యంగా దుస్తుల అలంకరణ ఈ ప్రదర్శనకు నిండును, హుందాను చేకూర్చింది. ఆట పాటలలో వారి ఆచార వ్యవహారాలు ప్రాముఖ్యం వహిస్తాయి. నృత్యాల సమయంలో అలసట కానరాక వారి శిక్షణాస్థాయి ద్యోతకం అవుతుంది. మనిషికి మనిషి అడ్డురాకుండా ఎవరిగడిలో వారు తిరుగుతున్నట్లుగా కన్పించింది.

## హాస్య ప్రదర్శన

వివిధ నృత్యముల మధ్యలో హాస్యప్రదర్శన అన్ని ప్రదర్శనలకన్నా మిన్నగా ప్రేక్షకులు ఆనందమును అనుభవించారు. శ్రీ సురేష్ సెంఖర నిర్వహించిన హాస్య ప్రదర్శనలలో ధ్వన్యనుకరణ, మూగాభినయం అద్వితీయ ప్రదర్శనలు.

రైలు స్టేషనులోను, బండిలోను చిల్లర వ్యాపారులు, భిక్షుకుల అరుపులు, పాటలు, రైలుకూత, బయలుదేరిన దగ్గర నుంచి రైలు కనుమరుగు అయ్యేవరకు ఉత్పన్నమయ్యే శబ్దస్థాయి భేదాలు; పశుల, మృగముల, జంతువుల అరుపులు, వివిధనాయకుల ప్రసంగాల అనుకరణ, టగ్ ఆఫ్ వార్‌లో తాడు లాగుతున్నట్లు అభినయిస్తు వెనుకకు, ముందుకు జరిగిపోవడం, శ్రమించినట్లు అలసిపోవడం, వృద్ధుడుగా ఒకచోట కూర్చుని యౌవనంలో తన ప్రేయసితో జరిపిన శృంగార చేష్ట జ్ఞప్తికి వచ్చినప్పుడు యువకుడైన తన ప్రియురాలికోసం నిరీక్షించడం, తన ప్రియురాలు ఆలింగనం చేసుకున్నట్లు పృష్ఠ భాగం ప్రేక్షకులకు చూపించి భుజంమీదుగా తన ప్రేయసి చేతులు కనిపింపజేడం, అన్నిటికి మించినది ఒక యువతి తల దువ్వుకొని పువ్వులు సింగారించుకోవడంలో హాస్యం తారా స్థాయికి అందుకుంది.

మహారాష్ట్ర కళలలో, ముఖ్యంగా నృత్యాలలో చెప్పుకోదగినది అభినయముకన్నా సాంకేతిక ప్రతిభ అమితంగా కానవచ్చినది. సంగీత సాధనాల వినియోగంకూడా గుర్తించదగినది. అభినయం, నృత్యం విషయంలో మన కూచిపూడివారే సిద్ధహస్తులని చెప్పక తప్పదు.

ఈ బృందములో శ్రీయుతులు విరాస గుర్జా, ఉదయ్ కాడ్‌వార్, సావన్ కేశవ, అజిత్ సామంత్, విజయ సునాల్‌కర్, మహేష్ గుందా శేఖర్, రవిరాజం, ఓంపే, ఆనంద్ మాత వందూఖర్, భాశామ్రజ్‌కర్, శ్రీమతులు సుధాఖర్ ముర్కర్, ఉత్తర ముర్గాన్‌ఖర్, ప్రవీణ్ నాయక్, నీలా మత్తావంకర్, జ్యోతి హేమంత్‌గార్లు నృత్యాలలో పాల్గొన్నారు. శ్రీ బాళ్ దేశ్‌ముఖ్ హార్మోనియం, శ్రీ రాజారామ్ సింధ్ ఢోలక్, శ్రీమతులు మందామత వన్‌కర్, ఆశా భంగాలే గానంలో సిద్ధహస్తు లనిపించుకున్నారు.

నృత్య ప్రదర్శనలలోని సంఘటనలలో నిశితత్వము, పాటలలోని వ్యాఘ్రానుసరణ మిళితమైయున్న మహారాష్ట్ర భాష అర్థంకాని ఆంధ్రులకు అయోమయ స్థితి ఏర్పడకుండా రాష్ట్ర సమాచార పౌర సంబంధాల శాఖ డిప్యూటీ డైరెక్టరు శ్రీ కె నాగభూషణరెడ్డి ప్రదర్శన వివరాలను, పాటలలోని అర్థాన్ని చక్కని భాషలో మైకులో వివరించడం వల్ల అందరికి అన్నివిధముల అర్థమైన కారణంగా వారి నృత్యాలలోని హాయిని అనుభవించ గలిగారు. కృష్ణా జిల్లా పౌర సంబంధాల అధికారి శ్రీ ఎస్. దొరస్వామిరెడ్డి తక్కువ వ్యవధిలో కార్యక్రమాలను చక్కగా నిర్వహించారు.

బందరు ప్రదర్శనలో మహారాష్ట్ర కళాకారులను కలెక్టరు సతీమణి శ్రీమతి కేతరిన్ జాన్సన్ పూలమాలలతో సత్కరించారు కళాకారులకు బందరు రోటరీ, లయన్సు క్లబ్‌వారు విలువైన రజిత షీల్డులను బహూకరించారు. రాష్ట్ర సమాచార పౌర సంబంధాల శాఖ తరఫున రజిత నటరాజ విగ్రహామును బహూకరించారు. బందరు రెవెన్యూ సిబ్బంది సాంస్కృతిక సంఘం తరఫున తహసిల్‌దారు శ్రీ కె. సీతారామయ్య బందరు కలంకారీ వస్త్రాలతో కళాకారులను సన్మానించారు.

సన్మానసభకు రాష్ట్ర సమాచార, పౌర సంబంధాల శాఖ డైరెక్టరు శ్రీ బి ఆర్. కె. శాస్త్రి అధ్యక్షత వహిస్తూ ఈ కార్యక్రమ పథకాల ఆవశ్యకతను వివరించారు. కలెక్టరు పర్సనల్ అసిస్టెంట్ శ్రీ ఎం. రాంశింగ్ ఆహ్వానితులకు స్వాగతం చెప్పారు.

ప్రదర్శనముల అనంతరం కృష్ణా జిల్లా ప్రజాసంబంధాల అధికారి శ్రీ ఎస్. దొరస్వామిరెడ్డి వందన సమర్పణ గావించారు.

*

*Statement about ownership and other particulars about Newspaper (Andhra Pradesh) to be published in the first issue every year after last day of February.*

FORM IV.

(*See* rule 8)

| | |
|---|---|
| Place of Publication .. .. .. | Hyderabad. |
| Periodicity of Publication .. .. | Monthly. |
| Printer's name .. .. .. | Director, Govt. Printing. |
| Nationality .. .. .. | Indian |
| Address .. .. .. | Chanchalguda, Hyderabad-24. |
| Publisher's name .. .. .. | B. R. K. Sastry, M.A., I.A.S. |
| Nationality .. .. .. | Indian. |
| Address .. .. .. | Director of Information and Public Relations and Ex-officio Joint Secretary to Govt., G.A.D. |
| (Chief) Editor's name | B. R. K. Sastry, M.A., I.A.S. |
| Nationality .. .. .. | Indian. |
| Address .. .. .. | Director of Information and Public Relations and Ex-officio Joint Secretary to Govt., G.A.D. |
| Name and address of Individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital .. | |

I, B. R. K. Sastry, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

B. R. K. SASTRY,
*Signature of the Publisher.*

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING GOVERNMENT OF ANDHRA PRADESH AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD-24

